పానుగంటిలక్ష్మీనరసింహరావు

రచియింపఁబడినది.

రెండవకూర్పు.



పిఠాపురము

శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రణాలయమున

ముద్రింపఁబడినది.

1925.

శ్రీరామ.

# పీఠిక.

ఈసరస్వతి నా పదునాలవనాటకము. నన్నుఁబోషించు మ॥ రా॥ రా॥ శ్రీ శ్రీరాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు సీ. బీ. యీ. గారికిఁ బ్రథమపుత్త్రుఁడు చిరంజీవులగు శ్రీరాజా గంగాధర రామరావు బహద్దరుగారు సోదరసోదరీసమేతులై గురుబంధుభృత్యపరివృతులై మదీయకథాలహరిలోని కథలను జదివించి యానందముతో వినుచు నన్నుఁ బేర్కొని యేదైన నొక్క విచిత్రకథను గల్పించి నాటక మొనర్పుమని నాతో సెలవిచ్చిరి. పరమేశ్వరకటాక్షమునను మాతాపితల పుణ్యమునను వారికిఁ బదేండ్ల పసితనముననే కలిగిన గ్రహణశక్తికిఁ గవితాభిమానమునకు మహానందమొంది చిత్తమని మనవిచేసితిని. కొన్నిమాసము లయినపిమ్మట భర్తృదారకునియాజ్ఞ ప్రభువుగారితో విన్నవించి యీనాటకమును రచియించితిని. శ్రీ శ్రీ శ్రీ మా సూర్యరాయప్రభువువారే దీని నచ్చువేయించిరి. వారికి వారికుటుంబమునకుఁ బరమేశ్వరుఁడు పరిపూర్ణసుఖాయుస్సంపత్సమృద్ధుల నిచ్చి రక్షించుఁగాక !

నాకుఁ బరమమిత్త్రులు రామకృష్ణపరమహంస గౌరాంగ చరిత్ర రూపలతావనవాసి ముఖ శ్రవ్యదృశ్యప్రబంధసంధానధౌరేయులును సద్గుణగణనీయులును నగు బ్రహ్మశ్రీ కూచి నరసింహముగారు దీనికి నాందీప్రస్తావనలను వ్రాసి యిచ్చుటచే వారి కనేకనమస్కారము లర్పింతును.

శ్రీ శ్రీ శ్రీ.

పా॥ లక్ష్మీనరసింహారావు.

# ఇందువచ్చు పాత్రములు.

సరస్వతి—కథానాయిక-గోవర్ధనుని సోదరి.

మధురిక—సరస్వతికి దాసి.

జయరామసింగు—రాగవర్ధనుని భార్యకుఁ దమ్ముఁడు.

భీమరుఁడు—మధురికకు మగఁడు.

గోవర్ధనుఁడు—రాగవర్ధనుని కొడుకు.

కళాలలితుఁడు—సరస్వతికి భర్త.

కళాలలిత—గోవర్ధనుని భార్య-కళాలలితుని చెల్లెలు.

కురంగి—కళాలలిత దాసి-జయరామసింగు భార్య.

రాగవర్ధనుఁడు—రామపుర రాష్ట్రమునకు రాజు. ఇతనికి మందపాలుఁడనికూడఁ బేరు.

మాధవవర్మ—రాగవర్ధనుని పినతండ్రికొడుకు-కాళీపురనాథుఁడు.

కమల—గోవర్ధనునకు సరస్వతికిఁ దల్లి.

ఇద్దఱు పల్లెవాండ్రు, ఇద్దఱుభటులు, మఱియొకసారి యిద్దఱుభటులు.

శ్రీరామ.




నాంది.

ఉ. వ్యాహృతిరూపమై కవుల • వాక్కుల కించుకయేని లొంగక
త్యూహమనీష, నైహికమ • హోత్కటనాటకమందు శర్వ ని
ర్మోహమనస్కుఁ జిత్రముగ • మోహితుఁ జేసినవ్యక్తి యాజగ
న్మోహిని మీకు సంతతవి • నోదములన్సమకూర్చుఁ గావుతన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.)

సూ—నటీ! (నటి ప్రవేశించును.)

నటి—బావగారూ! నమస్కారము.

సూ—నమస్కారముల కేమిగాని, నటీ! యిటొకసారి చూడుము.

గీ. సత్కళాపుంజమండల • శతసమేతుఁ
డౌచు జైవాత్రుకుఁడు నభం • బందు వెలుఁగు
పగిది, సూర్యరాణ్ణామజై • వాత్రుకుండు
సత్కళాభిజ్ఞవితతి నీ • సభ వెలుంగు !

నటి—ఔను. ఆహా!

గీ. శుభ్రదివ్యవిద్యుద్దీప • శోభితంబు
భూమిభృత్కల్పతరుసుమ • నోమనోజ్ఞ
మమృతమంజుద్విజాలాప • సముదయంబు
బావ! యీసభ నందన • వనముగాదె?

కాని మననాటకము చూచుటకై నేఁడు ద్రష్టృసంఘ మింతక్రి
క్కిఱిసియుండుటకుఁ గారణమేమో?

సూ—కారణములేని కార్యముండునా?

సీ. దాతృత్వధీరతో • దారగంగాధర
రామరాయాగ్రిపౌ • త్రకుఁడు మఱియు
భూతదయాశాంతి • పుష్కలవితరణ
ప్రముఖసద్గుణసూర్య • రాణ్మణికిని
బహాదరప్పారాయ • వంశదీపిక చిన్న
యాంబాసతీమణి • కగ్రిసుతుఁడు
తల్లివంశమువారి • తండ్రివంశమువారి
యమలయశోలక్ష్మి • కాటపట్టు

గీ. తాతనామంబుధరియించు • ధన్యుఁ డాయు
రున్నతుఁడు, మనయువరాజు • చిన్నవాఁడు
భవ్యపీఠికాపురభావి • పాలకుండు
కలికి! యీవేడ్క కంతకుఁ • గారణంబు.

నటి—ఎట్లెట్లు? నేఁ డాయుష్మంతులగు మన యువరాజుగారి జన్మదినవ వార్షికోత్సవ మసియా? అది ప్రతిసంవత్సరము జరుగుచునే యున్నదికదా! ఇప్పటి విశేషమేమి?

సూ—నేఁ జెప్పఁదలఁచిన శేషభాగము వినినచో నావిశేషమేమో తెలియును. మనయాస్థానకవీశ్వరులగు శ్రీపానుగంటి లక్ష్మీనరసింహరావుగారి నొకవిచిత్రనాటకము వ్రాయుఁడని వారొకసారి యడిగినారఁట. వారికోరిక దీర్చుటకై కవీశ్వరు లట్టినాటకము వ్రాసినారు. అదియే, మనమిపు డాడఁబోవునాటకము. తన్నాటకావలోకనకౌతూహలమే సదస్సు నిట్లు చతుష్పూర్వముగఁ జేయుచున్నది.

నటి—అలాగుననా? సరసవిద్యావయఃపరిపాకమున రావలసిన యుదా

రాభిలాష లీలేశవయసుననే యెట్లు పుట్టెనో ?

సూ—(నవ్వుచు) వరవంశప్రసూనలక్షణములకు వయోవిద్యాపరిణతి యంతయూవశ్యకముగాదు.

గీ. నేర్చి నేర్పించి విద్యల ♦ నియతిఁ బెంచి
ప్రకటంబైన శ్రీరావు♦వంశమందు
వేఱుకోరిక లెట్లుద్భ♦వింపఁగలవు ?
మల్లెచెట్టునఁ బుట్టునే ♦ యుల్లిపూలు ?

నటి—సరే! యీనాటకము చేసినవారెవరు !

సూ—ఇంతపరాకేమినటీ! ఆమాట యిప్పుడేకదా చెప్పితిని !

నటి—ఓహో! మేధావియగు నృసింహారావుగారి పదునాఱవనాటకమా మనము ప్రదర్శింపఁబోవు "సరస్వతి"?

సూ—ఔను.

గీ. క్రమభావంబులను గథా♦కల్పనమున
సరసశృంగారహాస్యప్ర♦సంగములను
గ్రాలుచున్నది యీనాట♦కంబు షోడ
శకళలను నిండుపూర్ణిమా♦చంద్రుఁబోలి!

నటి—పదునాఱుకళల పార్వణచంద్రుఁడో, పదాఱువన్నె బంగారమో, సరే-కాని, ఆయనవయసెంత ?

సూ—ఏఁబదియైదు దాఁటినవిశాఁబోలు.

నటి- గావా! షష్టిపూర్తికైదుసంవత్సరములు తక్కువగానున్నప్పుడు ఇడ నీనవనవశ్యామాశృంగారములు, నర్మప్రసంగములేనా?

సూ—బాగుగానున్నవి నీమాటలు! బాలుఁడైన భర్తృదారకునియందు రుచి దీర్చుటకై పాతంజలయోగశాస్త్రము పాఠము చెప్పుమందువా ? పారాశరి వేదాంతసూత్రములు పారాయణ చేయు

మందువా? అదిగాక, శృంగారము కావ్యరసరాజముకాదా?

ఆ. చెట్టు పెరుఁగుకొలఁదిఁ ♦ జేవయుఁ బెరుఁగును
దోఁడుకొలఁది నూతఁ ♦ దోయ మూరు
మెఱుఁగుదేఱి యశ్లె ♦ మించుఁ గవిత్వంబు
వయసు ముదురుకొలఁది ♦ వ్రాయుకొలఁది.

మఱియు,

ఆ. హాస్యరసము జీవ ♦ మతనిగ్రంథములకు
వచనరచనలందుఁ ♦ బద్యరచన
నశ్రమంబుతోడ ♦ హాస్యరసం బొల్కుఁ
బలుకునుండి చేతి♦కలమునుండి.

శృంగారహాస్యములు ప్రధానములంటిని గాని యితరరసము లున్నవిసుమా! చూడు:- ఇందలి యష్టమాంక మెంతకరుణ రసభరితమో! కనులు చెమ్మగిల్లకుండ నది చదువుటగాని విను టగాని కడుఁగష్టముగదా!

గీ. ఆపగలు, పుట్టుచోట్ల మి♦తాంబువులయి
బహుళజలపూరితంబులోఁ ♦ బాఱుకొలఁది,
నట్లె యీనాటకము మొద♦ల్పెట్టి వెల్లు
కొలఁది రసవంతమై హాయిఁ ♦ గూర్చు మదికి.

నటి—ఏమో! మన "మనము"గారి మదనశాస్త్రమర్యాదలు, ప్రద్యుమ్న పరిహారణములు, పదతాడనములు—నాకంతగా నచ్చలేదు బావా!

సూ—పోనీ, గర్దభశృంగారమని కవియే పేరుపెట్టినాఁడుగదా దానికి. సృష్టిలో నట్టివెఱ్ఱిసాఱబుఱ్ఱవా రుండఁగూడదా! అట్టివారున్నఁ గాని పరమపురుషుల ప్రతిష్ఠ యెట్లు బయలుపడును?

సీ. జయరామసింగు వా॰చాటత్వమున కేమి ?
ప్రహసనపోషణ॰పాత్రమద్ది
కాయికభోగకాం॰క్షాక్షిప్తమధురికా
కామానలస్ఫులిం॰గములు కేమి ?
మైహికసంప్రదా॰యానుగ గోవర్ధ
న సరస్వతీ మోహ॰నటన కేమి ?
లలితాంగి ! యలకళా ॰ లలితాకళాలలి
తామలదివ్యస॰త్ప్రేమ చూడు !
గీ. చుంబనాశ్లేషముల దాటి ॰ సుప్రణయము
స్త్రీపురుషభేదచింతనా ॰ తీత మవిష
యకము స్వార్పణపూర్వక ॰ మదియె రాధ
బాలకృష్ణునిపై నిడ్డ॰వలపుసుమ్మి !
ఏఁబదియేండ్ల శృంగారమునకును, మీయిరువదియైదేండ్ల శృం
గారమునకును దారతమ్యమును గనిపట్టినావా యిప్పుడు ?
నటి—అంతయుదారప్రేమప్రతిపాదకమా యీనాటకము ?
సూ—అంతమాత్రమే కాదు- పరితలప్రకృతినిబట్టియుఁ, బాటవము
నుబట్టియు నీగ్రంథమునుండి యనేకనీతులు గ్రహింపవచ్చును.
నటి—అవి యేవి ?
సూ— గీ. జగతియంతయు దుర్భ్రమ॰సంకులంబు
పురుషు లస్వతంత్రులె యెట్టి॰పోడలైన
నంచు నాటకమంత బో॰ధించు, రాగ
వర్ధనుఁడు ద్వితీయకళత్ర॰బాధఁ దెల్పు.
నటి—ఇట్టినాటకరచనకుఁ గారణభూతులైన యువరాజుగారి నెట్లభినం
దింపఁగలమో తెలియదు.

సూ—ఇట్లాశీర్వదింపవచ్చును.

ఉ. వాణియనుగ్రహంబునను వాక్చతురత్వము ధీబలంబు, శ
ర్వాణిదయన్ శుభోత్కరము, పద్మకృప న్సిరులు, స్త్రిమూర్తిసం
త్రాణమున న్థిరాయువు, నిరామయతాపటిమంబు, నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణము నయ్యెడు మాయువరాజుగారికిన్.

(తెరలోనుండి మంగళమద్దళధ్వనులు వినఁబడును.)

నటి—అవేమి?

సూ—మరేమియు లేదు. మృదంగమునుండి శబ్దబ్రహ్మము, మనదీవెనలు విని "తథాస్తు తథాస్తు తథాస్తు" అనుచున్నది. ఇంకను నాటకప్రదర్శనమునకుఁ గాలయాపనమేల?

నటి—ఇదిగో! పోయి సరస్వతీపాత్రధారణము చేసికొందును.

సూ—నీవనినది సరిగా లేదు. గోవర్ధనుఁడవు కావలెను.

నటి—ఎట్లైననుసరే పోనిండు! లోపల సరస్వతిని, పైని గోవర్ధనుఁడను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

శ్రీ శ్రీ శ్రీ.



శ్రీరామ.




# ప్రథమాంకము.



ప్రదేశము—అడవి-రామపుర సంబంధమైనది.

ప్రవేశము—సరస్వతి, మధురిక, పురుషవేషములతో.

సర—నీవనినది సరిగాలేదు. మధురికా! ఏదీ? అప్పుడే యేమైనది! వెనుకటికష్టమేదో యంతరించినది కాని యింక రాఁదగినవెన్ని చిక్కులున్నవో! పడవలసినపాటు లెన్నియున్నవో! అవి యన్నియు నైనతరువాతఁగదా సుఖముచేకుఱుట.

మధు—దేవీ-సరస్వతీ! పామున్నపుట్టలోఁ జేయిపెట్టవచ్చును. పులియున్నగుహలో నివసింపవచ్చును. పిశాచమున్న చెట్టుక్రింద నిదురింపవచ్చునుగాని సవతితల్లి చేరినయింటిలో నుండరాదు. ఆపో రిప్పటికి మీకు వదలినది కావున బ్రతికితిమంటిని. ఇఁక ముందుఁ జిక్కులువచ్చుననియా మీసందేహము? రానీ-అది దేహధర్మము. కడుపున్నంతకాల మాఁకటివ్రేటు తప్పదు; కాని లక్షరోఁకటిపోటు లొకసవతితల్లి ప్రాపుక్రింద దిగఁదుడుపు.

సర—మాతండ్రిగా రామెకు వశుఁడు కాకుండినయెడలఁ గేవలము సవతితల్లి నన్నేమి చేయఁగలదులే?

మధు—కన్నబిడ్డలుండఁగాఁ గంకణాల సంబరమునకు రెండవసారి సిద్ధపడిన కక్కుర్తి పెండ్లికొడుకునకు దేహశక్తి తక్కువ కావున విధేయత యెక్కువ. బింకమైన ముద్దుపెట్టుకొనుటకు దంతములపటుత్వము చాలనప్పుడే క్రొత్తపెండ్లికూఁతుముక్కునకుఁ బచ్చలముంగర. బిగికౌఁగిటిలోఁ బడుచుబొమ్మను నిలుపుకొనుటకు సమర్థతలేనప్పుడే సవతిబిడ్డలను శంకరగిరిమన్నెములకు సాగనంపుట. ఇది యీనాఁడేపుట్టెనా ? ప్రపంచచరిత్రమునకు మొదటిపత్రమున నేమియున్నదో కడపటిపత్రమునఁగూడ నదియే యుండును. ఎప్పటికప్పుడే క్రొత్తయని కవులేమో తలతిక్క గానమొనర్చెదరు. కాని యది వట్టికల్ల. ఎవనియనుభవమున వానికిఁ గ్రొత్తకాని వస్తుతత్త్వమునఁ గ్రొత్తకాదు. దానిలో నొకపత్రమును జూచినవాఁడు మిగులుపత్రములను జూడనక్కఱలేదు. అది వట్టిరామకోటి—ఏదోచెప్పవచ్చి మఱచితినమ్మా ?

సర—ఏమున్నది ? ద్వితీయభార్యలు పతులపైఁ గనఁబఱచు వాల్లభ్యమునుగూర్చి.

మధు—అందులో మీతండ్రి వట్టిమైనపుదిమ్మ—మట్టిబొమ్మ—తన తమ్మునిఁ జేసికొనవలసినదని నిన్ను మీసవతితల్లి బతిమాలుకొనినది—బెదరించినది—లంఘనములుంచినది బంధించినది. తుదకుఁ జంపుదునని శపథముచేసినదికాదా. దాని కిష్టముకానప్పుడీబలాత్కార మేలయని మీతండ్రి రవంత పెదవి కదలిచినాఁడా ? ఆయన రవంతకఱకున్నవాఁడైనయెడల మనకీగతియేమి ! ఇల్లు వదలి యడవులపాలై పోవుటలేల ?

సర—నీవు మాతండ్రిగారి నేమియు ననవలదు. ఆయన మహానుభావు

ఉ. తపశ్శాలులు—అంతర్ముఖులు—వైరాగ్యసంపన్నులు.
ఆయన మాహాత్మ్యము నీకేమి తెలియును ?

మధు—అటులైన గంగాతీరమందుఁ బద్మాసనమున ముక్కుమూసికొని కూరుచుండి ముక్తికాంత నపేక్షింపక, మదనవిలాసములో మంచముమీఁద వేంచేసి నోరు తెఱచుకొని మాఱుమపెండ్లాము నపేక్షింపనేల ?

సర—మధురికా ! వెనుకటినంగతు లేమియు నెత్తకు. ఇఁక ముందు మాట యేమియో యదిచెప్పు.

మధు—ముందుమాట కేమున్నది ? నీవు పొమ్మనువఱకు నీసేవచేయుచు నీయొద్ద నుందును.

సర—అది సరేలే. ఎవరినైన మనవెనుకఁబంపి మాతండ్రిగారు తిరుగ మనలఁ బిలిపించుకొందురేమో ?

మధు—ఆయాశ, ఆసందేహము, ఆభయము నీకక్కఱలేదు. పీడవదలినదని యిద్దఱు సంతసింతురు. తనయనంతరము తనతమ్ముని పేర రామపురరాజ్యము వ్రాయించి—

సర—పోనిమ్ము. రాజ్యమున కెవరు దేవులాడుచున్నారు ? కాని నా సవతి మేనమామమాత్రము వెఱ్ఱియాసచే నన్ను వెంబడించునేమోయని యనుకొనుచున్నాను.

మధు—అతఁడు వేఁటకై పోయినాఁడు. తిరుగ నెప్పుడు గ్రామములోనికి వచ్చునో ?

సర—అతఁ డీయడవికే వేఁటకువచ్చినయెడల, మనలఁ గలసికొనవచ్చునేమో ?

మధు—కానీ-పురుషవేషముల నున్న మనల నాతఁ డెట్లానవాలుపట్టును ? నిన్నాతఁ డెప్పుడు చూచియేయుండఁడుకదా ! ఇఁకనన్నా?

తెల్లి మొగముముండకొడుకు! అతఁడేమి! నన్నానవాలుపట్టు
టేమి! కన్నులున్నవారందఱు కనుచున్నారా! చెవులున్నవా
రందఱు వినుచున్నారా! నోరున్నవారందఱు తినుచున్నారా!
మంచమునకుఁ గన్నులులేవా! గంగాలమునకుఁ జెవులులేవా!
అక్షయపాత్రకు నోరులేదా! ఇవియన్నియు నుండవలసినది
లోనఁగాని పైనఁగాదు. ఆ 'లోన' మనపెద్దమ్మ కయ్యవారి
నట్టిల్లు.

సర—పోనిమ్ము, ఆతనిమాత్ర మధిక్షేపించుట యెందులకు?

గీ. మనకు నచ్చకపోయిన ♦ మనుజుఁడైనఁ
బరుని కుపయోగకారి కాఁ♦వచ్చుఁ జుమ్ము
రాజహంసముకనని ధా♦రాధరంబు,
శిఖిని దెయితక్కళాఁడఁగఁ ♦ జేయుఁగాదె!

ఇంతకు నాతనిని విడనాడి పోవుచునే యుంటిమికాదా.

(నేపథ్యమున) విడిచిపెట్టుఁడు భటులారా—విడిచిపెట్టుఁడు-రండు.

మధు—(అటునిటు చూచి) అదిగో నీసవతిమేనమామ! ముందు పరు
గెత్తుచున్న రెండులేఁడిపిల్లలను బట్టుకొనలేక, విడిచిపెట్టి యిట
కే వచ్చుచున్నాఁడు. ఆతనిఁ జూచి సిగ్గుపడి చప్పునఁ జెట్టుచా
టునకుఁ బాటిపోకుసుమా.

సర—నూతన పురుషత్వముగావున, భద్రముగనే యుందును. (తనలో)
ఆహా! స్త్రీపురుషుల కెంత భేదమున్నది!

గీ. ఎంత గడిఁదేటి మిటిమీఱు ♦ నింతియైన
నన్యుఁ గన్నెత్తిచూడఁ గా♦నంత కొంకు,
నెట్టి యాడంగి పావడ♦గట్టునైనఁ,
జేఁ-వపైఁ గోరచూపులఁ ♦ బ్రదిమ్మరించు.

గీ. పొలఁతులకు సిగ్గు సహజమౌ ♦ భూషణంబు
పురుషులకుఁ జాకచక్యమే ♦ పుట్టుతోడవు ;
కవచమున సాధుహృదయంబు ♦ గట్టిపడునె ?
పట్టుఱవికను మృదువౌనె ♦ గట్టిమనసు ?

గీ. కాని, దేశకాల విభేద ♦ గతులఁ బట్టి
కోరమీసాలు గాగరాల్ ♦ కుండమార్పుఁ,
జెందుచున్నవి సందర్భ ♦ సిద్ధిఁ గనక
కల్లనటకుల వేసాల ♦ గతులయట్లు.

(జయరామసింగు ప్రవేశించును.)

జయ—ఓహో ! మీరు మాదర్శనమునకే వచ్చిన పురుషులని మే మెఱుఁగకపోలేదు. మీమనవియేదో వెల్లడించుకొనుఁడు.

మధు—(తనలో) మీదర్శనము—అసత్యమే ; పురుషులు—అసత్యమే ; (ప్రకాశముగా) అయ్యా! చేతఁజిక్కిన లేఁడిపిల్లలను వదలివైచినా రెందులకు ?

జయ—ఆలేళ్లతోఁకఁ జూడఁగానే మా క్రొత్త పెండ్లికూఁతురుగారి తల్లకట్టు మనసునఁ దళుక్కుమనుసరికి, వాని నేమియుఁ జేయవలదని శాసించినాము. ఇది యైహికకారణము.

మధు—ఆహాహా ! మీసౌందర్యరసగ్రహణము! లేఁడితోఁకవంటి కేశభారమని లోకమున క్రొక క్రొత్తకవిసమయమును గల్పించిన మహావిద్వాంసుఁడవు ! ఐహికకారణమంటివి ! ఆముష్మికకారణ మింకొకటి యున్నదా ?

జయ—లేదామఱి ? వసిష్ఠభగవానుని జటాజూటమందున్నజంతువును జంపఁగూడదని—

మధు—అది శంకరుని చేతిలోనున్నదని కాదా-పురాణములందున్నది?

జయ—ఉత్తర దేశపుఁబ్రతులలో నట్లున్నదనుట వాస్తవమే కాని యది ప్రక్షిప్తమని శంకరాచార్యులవారు కృతయుగమందే పరిష్కరించినారు.

మధు—అబ్బో! విమర్శనముతోఁగూడిన మీపాండిత్యము సర్వతోముఖముగఁ బ్రకాశించుచున్నదే.

జయ—పెద్దలేర్పఱచిన యఱువదినాల్గు విద్యలలోను 'దస్తావీజు' వంటి సాహిత్యము సంపాదించినాము. పరీక్షచేయువాఁడున్నప్పుడు బయలుపడును. పూర్వప్రభువులు గతించిపోవుటచేఁ గాఁబోలు నిప్పు డెక్కడను గనఁబడకుండ నున్నారు. కోడిపందెము ప్రత్యేక మొక సముద్రమంతవిద్య; ఆవిద్యరానిరాజు రాష్ట్రపాలన కర్హుఁడుకాఁడు. దొంగతన మొకవిద్య; అర్థికశాస్త్ర సంప్రదాయము రాజనీతియు నందు విరివిగనున్నవి. ఆవిద్య రానివాఁడు మంత్రిపదవి కర్హుఁడు కాఁడు. తుట్టతుదకు ముష్టి యెత్తుకొనుట యొకవిద్య. అది రానివాఁడు బ్రాహ్మణవృత్తికిఁ బనికిరాఁడు.

మధు—(అప) అమ్మా—ఈముండకొడుకుతోఁ బెండ్లిమాన్పి భగవంతుఁడు నీకెంతమాపదఁ దప్పించినాఁడమ్మా!

సర—(అప) నాకు మిగుల రోఁతగ నున్నది. నీకాతనితో సంభాషణ మెందులకు?

మధు—(అప) నే నాతని నిటకు రమ్మనలేదు. నేను ముందుగా నాతనితో మాటలాడలేదు. అయినను వదలుచుకొనుటకుఁ బ్రయత్నించినకొలఁది వెంపటికంపవలెఁ గాళ్లకుఁ దగులుకొనుచున్నాఁడు.

సర—(తనలో) గీ. ఆఁడుదానిపుట్టు • వనికప్రమాదంబు,
వదలరాని పెండ్లి • బాధవలన,

# ప్రథమాంకము.

మగలకున్న స్వేచ్ఛ ♦ మాకుఁగూడఁగనున్న
లగ్గులేకయున్న ♦ నెగ్గులేదు.

మధు—మీ జ్ఞానసముద్రమంతయు మీతో నింకిపోకుండ లోకోద్ధరణార్థ మేమిచేయఁదలఁచితిరి ?

జయ—సర్వప్రపంచసారమను గ్రంథమును వ్రాసి పెండ్లికూఁతురు గారికిఁ గృతినిచ్చెదము.

మధు—పెండ్లికూఁతురుగారని యిదివఱకొకసారి యంటిరి. మీకు వివాహము నూతనముగా నైనదికాఁబోలునేమి ?

జయ—(గట్టిగ నవ్వుచున్నాఁడు.)

మధు—అట్లు నవ్వెద రేల ?

జయ—దానికి సపాదలక్షగ్రంథమున్నదిలే—నీప్రక్కనున్నయీయన యిదివఱకు మాటలాడలేదేమి ?

మధు—ఆయన బహుమితభాషి.

జయ—ఆయనయెదుట మనము స్వేచ్ఛగా మాటలాడుకోవచ్చునా ?

మధు—అభ్యంతరమేమి ?

జయ—పెండ్లికూఁతురుగా రెవరనఁగా—ఈదేశపురాజున్నాఁడే, మందపాలుఁడు—అతనికూఁతురు—పిల్లను బెండ్లిచేసికొమ్మని మనయక్కయు బావయుఁ బెద్ద పట్టుపట్టుచున్నారు. మనమే యింకను దలఁ గదల్పలేదు. ఆలాగున వ్యవహారముకొంపిలో స్తంభములాగున నున్నది.

మధు—అక్కగారి బావగారి పట్టునకేమి? ఆపిల్లకు మీయందనురాగమున్నదా ?

జయ—మనమనఁగా నామెకుఁ బంచప్రాణాలు-వింటివా-పంచప్రాణాలు ! ఆమె కెంతసేపు మనగొడవయే—మనయుబుసే—ఇం

కొకనిమీఁది కామెమనస్సు పోవుటకు మఱియేముండకొడుకున కిన్ని సౌభాగ్యములున్నవి ? మనము శాశ్వతముగా నామెహృదయములోఁ దిష్ఠవేసినాము. అది శిలాక్షరమైనమాట.

సర—(తనలో) అంతవఱకు నిజమే.

గీ. చెవిని దుద్దుకాంతి ♦ చిత్త మంటునో లేదో ?
చెవినిగలుగుపోటు ♦ చిత్తమేర్చుఁ ;
గాలియందె హృదిని ♦ గల్లునో లేదో ?
కాలిముల్లు మదిని ♦ గలుకుమనును.

గీ. జననమిడిన తల్లి ♦ స్మరియింతు నెప్పుడో
సవతితల్లి పేరు ♦ జపమొనర్తు ;
జనునియీవి హృదిని ♦ జాఱిపోవఁగవచ్చుఁ
దిట్టు చిలుకకొయ్యఁ ♦ బట్టు మదిని.

గీ. మిత్రవరునికంటె ♦ శత్రువే యెల్లప్పు
డుల్లమందు విడువ ♦ కుండువాఁడు
ప్రేమకున్నజిగురు ♦ పెళుసేమొ కాసంత
యప్రియతకుఁ గలుగు ♦ నతుకు మెండు.

మధు—మీయం దామె కంతప్రేమమున్నదికదా—మీ కామెయం దెట్లున్నది ?

జయ—సాధారణముగా మనమగవారిలోఁ బ్రేమమును తత్త్వముండదు ; ఏదో కారణమునుబట్టి యది యప్పుడప్పుడు బయలుపడును. ప్రేమమున్నప్పుడు మగతనమునకుఁగూడఁ గొంతలోపమని మంత్రివేత్తలందఱు నొప్పుకొనినయంశమే; అయినను సంక్రాంతిపండుగలకు డింకికోడిమీఁదనున్నంత ప్రేమము నాకు బెండ్లికూఁతురిగారిమీఁద నున్నదని చెప్పఁజాలను. ఆప్రేమ

తత్త్వము విచిత్రతయేదో అనుభవించినవానికిఁగాని తెలియదు. ఒక్కొక్కప్పుడు పిల్లికూన వదువాల్లుపెండ్లికూతులపెట్టు; మిత్త్రముమీఁద ప్రేమ యున్నదికాని లేకపోలేదు. లేనియెడల నామెను సప్తవింశతిభుజంగప్రయాతములతో నేల వర్ణించియుందును?

మధు—మీ రామెనుజూచుటకు వీలులేదుగదా—ఎట్లువర్ణింపఁగలిగితిరి?

జయ—ఆమెయొద్ద మధురికయను దాసియున్నది; అది నట్టి తలబిఱుసుసుండలే—దానిని నెత్తి వాయఁగొట్టి నిమ్మళముగాఁ జేలోపు చేసికొన్నాము.

మధు—(తనలో)ఓరిదొంగముండకొడుక(ప్రకాశముగా) చేలోవనఁగా?

జయ—ఆయవశిష్టము దీర్చినామన్నమాట.

మధు—(తనలో) ఓరి నీగొంతుకఁగొయ్య.

జయ—దానిమూలమునఁ బెండ్లికూఁతురుగారి యవయవసౌభాగ్యమంతయు విని కవిత్వము చెప్పినాము.

మధు—సరే, మీ కింకను వివాహ మెందులకుఁగాలేదు?

జయ—ఇచ్చటనే యున్నది కీలకము—లౌకికపుమాఁట.

మధు—నా కేదియో బోధపడలేదు.

జయ—మనము రహస్యముల వెల్లడించుకొను బుద్ధిహీనస్వభావము కలవారము కాము; కాని మిమ్ము జూడఁగానే మనకు విశ్వాసము కలిగినది కావునఁ జెప్పుచున్నాము. ఈ రాజ్యమంతయు ముందుగా మనపేర వ్రాసి యిచ్చినఁగాని మీకూఁతును మనదము పెండ్లాడమని మామయ్యగారిచే బావకుఁ జెప్పించినాము.

మధు—ఆదు కాతఁ డంగీకరించినాఁడా?

జయ—ఆత్మస్తుతి పనికిరాదు—కాని చక్రవర్తివంటి పెండ్లికొడుకు

లభించినప్పుడు ఖర్చు రాజ్యమిచ్చుట విశేషమేమి ?

మధు—(తనలో) నాకడుపులో మండుచున్నది. నిన్నే చునుటకు వీలు లేకున్నది కదా. ఇక్కడినుండి పోవులోపల నిన్ను దూడమీదఁ గొట్టకుండునెడల నేను రాజగురువుగారి కూఁతురనుగాను.

జయ—మాయక్కకు సంతానప్రసంగతి నిరాశయైనది. మనలో మన మాట. ఇఁక నే నీరాజ్యమునకు రాజను. ఇప్పటిరాజుగారు నాకుఁ బగలుబావ రాత్రిమామ; ఆయనకున్న యనికారమంతే.

వర—నేవకా ! లేనిపోనిమాట లాడుచు నాదొరగారికి నీవు విశేషశ్రమ మీయనేల ? వారియొద్ద సెలవుతీసికొనుము. పోవుదము. మనకున్న యవశ్యమగుపనియేమి ? ఈవ్యర్థకాలహరణమేమి ?

మధు—అయ్యా క్షమింపుఁడు. ఇదిగో పోవుదము(అపవారించి)అమ్మా! ఈతనిచే నీకాళ్లు పట్టించెదను. ఒక్కనిముసము శాంతింపుము!

వర—(అపవారించి) నాకక్కఱలేదు.

జయ—అయ్యా ! ఆయన యట్లు కోపపడెదరేల ?

మధు—కోపపడెదరేలయని సామాన్యముగా ననుచున్నారా ! మీరు చెప్పినమాటలనుబట్టి యీయన యీనటికు మీజుట్టుపట్టుకొని జాడించి నేలఁగొట్టియుండవలసినది. నన్నుఁజూచి యూరకుండి నట్టున్నది.

జయ—ఎందుచేత ? మనమేమైనను దప్పాడితిమా యేమి? మనమెప్పుడు తగవులలో దిగువారము కాముసుమీ! పౌరుషములేక కాదు. దినమునకొక్కమేఁకను దిను మనకుఁ బౌరుషములేకేమి? పౌరుషమనునది పంటిశక్తిలోనున్నది. పందివాళ్లమీఁదికొవ్వను బంటివరుసతో గట్టిగాఁ గోరముతో నొక్కినట్లు లాగలేని వానికిఁ బౌరుషము వచ్చినదన్నమాటయే. ఎవ్వనికైనప్పటికిఁ

బన్నా మొదలుకొని కొండనాలుకవఱకే పౌరుషత్త్వము, దానిక్రిందినుండి శుద్ధమాంసమే; కాని యిప్పుడు మీహితువకు మనయందుఁ గోపమేల కలిగినదో చెప్పుము. అంతకంటె ముఖ్యమైనది—అది శాంతించుటెట్లు? మనదగలిగినప్పుడు వెంటనే గోఁకికోవలసినదేగాని కారణపరీక్షచేయుచు నాలసింపఁ గూడదు.

మధు—మీ రాజునకుఁ బ్రబలశత్రువగుటచే మిమ్ము శిక్షించినఁగాని యాతనికోపము శాంతింపదు.

జయ—అంతమాత్రమున మేము? పాఱిపోవుటకూడఁ బౌరుషచిహ్నముగానే వేదాంతు లంగీకరించినారు. కావున మర్యాదగా వెను కాడెదమా?

మధు—కదలినయెడల నిన్నాతఁడు ముక్కలక్రింద ఖండింపఁడా!

జయ—అంతవఱకు వచ్చునెడల మన మాతనికాళ్ళపైఁ బడెదము. మనమా యుష్మత నీవతపట్టుదల పెట్టుకొనలేము. కులగోత్ర విచారణము మనకు మొదలే యక్కఱలేదు. తగవులాటలు తక్కువజంతువులకుగాని మనకుఁ దగవు.

మధు—(తనలో) ఎంత నిర్భాగ్యుఁడవురా. నీ మొగమీఁదవ (ప్రకాశముగా) అతఁడు నీకేల శత్రువయ్యెనో నీవెఱుఁగవేమి?

జయ—కారణచింతతో మనకుఁ బనిలేదని యిదివఱకే చెప్పితిని. ఆ కారణమేదో తెలిసినయెడల, దానికిఁ బై కారణముఁ దెలియ వలసివచ్చును. ఇట్లు పైకిఁ బోయినకొలఁది మనుజుఁడప్పియుప్పై దిగిపోవును గాని హెచ్చఁడు. ఇప్పుడు మనకు దిగవలసిన దినములు కావు. ఇప్పుడు మన కుచ్ఛస్థితినొందిన కుజుని మహాదశ; రాజ్యలాభము దీనిలోనే కలుగవలసియున్నది.

మధు—అబ్బ! నేను జెప్పఁదలఁచినదేదో చెప్పనీకుండ నొకటేసోద చెప్పకు. ఈతఁ డొకమహారాజపుత్త్రుఁడు. వివాహప్రాయము ప్రాపించినవాఁడు. కన్యాన్వేషణకై తిరుగుచున్నాఁడు. ఈదేశపు రాజునొద్ద సుందరస్వరూపిణియైన కన్యయున్నదని తెలిసి యిటకు వచ్చినాఁడు. ఆమెను సవతితల్లి ప్రోత్సాహమునఁ దండ్రి బలాత్కారముగ నొకనిర్భాగ్యునకిచ్చి—

జయ—మనమే యూనిర్భాగ్యులము కాని కుజునిలో శుక్రాంతరము వచ్చుసరికిఁ గిరీటధారణయోగము కలుగనియెడల సిగ మొదలంటఁ దఱిగించు.

మధు—ఉస్స! చెప్పఁదలఁచినదేదో చెప్పనీయవు. చెప్పినంతవఱకైన నభిప్రాయమేదో కనిపట్టవు. ఆపిల్ల కిష్టముకాకుండ నీవివాహము జరుగనైయున్నది. కావున నిన్ను రాజును దండించి యామె నీతఁడు తీసికొనిపోవలయునని వచ్చినాఁడు.

జయ—అబ్బే! అమ్మతోడు; కన్యకకు నాయందు గాఢమైనవలపు.

మధు—(తనలో) ఛీ. ఛీ.

సర—(తనలో) వదినిముసము లీతనిమాటలు వినుటచేతనే యొడలు జలదరించి బాధపడుచుంటినిగదా. ఈతనిని భర్తగా బడయనున్న యిల్లాలిగతి—ఆహా—యేమికావలయునో! భగవంతుఁడా! అంతయేకాక యీరాజ్యమున కీతఁడే ప్రభుఁడైనచోఁ బ్రజ లెంత భాగ్యహీనులగుదురో!

గీ. ప్రజను సమదృష్టిఁ గాంచెడు • ప్రభువరుండు
వధువును సుఖోదధిని దేల్చు • వల్లభుండు
కృతికి శోభను సమకూర్చు • కృతిపతియును,
ఛాత్త్రునకుఁ గన్నులిచ్చు నా • చార్యవరుఁడు.

# ప్రథమాంకము.

గీ. దానమున కన్నివిధములఁ • దగినపాత్రి
వంశవిఖ్యాతినిలిపెడు • బాలకుండు
పూర్వజన్మసురచితసం • పూర్ణపుణ్య
భారపరిపాకమునఁగాని • పడయుటెట్లు?

(ప్రకాశ) నీవింక నాతనితో మాటలాడక ముందునడువుము.

మధు—మహాప్రభూ! చిత్తము.

జయ—అయ్యో—మీకాళ్లపైఁ బడుదును—మనకు జుట్టుపట్టుకొనుట యొక్కటియుఁ గాళ్లుపట్టుకొనుట యొక్కటియుఁ గదు. పౌరుష మున్నవానికి నఖశిఖలొక్కటే; మహారాజా! మీకుఁ గన్యల కేమికొదవ. మనమైనను రాష్ట్రముకొఱకే యీబొట్టుముక్కు ముచ్చిబొమ్మనపేక్షించితిమిగాని మఱియొకటికాదు. మనలో మనమాట. అంతఃపురకాంతలలోపముల వెల్లడింపఁగూడదు అన్నియు నామె కివగుణములే.

మధు—ఛీ. ఛీ. ఇరువదేసు భుజగప్రయాతములలో నామెస్వరూప స్వభావములు వర్ణించితినని చెప్పితిరే.

జయ—ఆమాటమాత్రము మనమనలేము. జిహ్వఁగోసిననైన మనకసత్యమనుమాట లేదు.

మధు—పెండ్లికూతుపేరేది?

జయ—ఏదోకాని మఱచిపోయితిని. మంచిపేరే.

మధు—అయ్యో- పెండ్లాముపేరు మఱచినవాఁడవు నీ వెక్కడిమనుజుఁడవు!

నర—సేవకా! ఇఁకఁ బోవుదము రమ్ము.

జయ—రక్షించు-రక్షించు. (నరపతికాళులపైఁ బడును.)

నర—తెన్నాని చెప్పుము.

మధు—(అప) నీకు నత్తసదోత్సవము చేయవలసిన పెండ్లికుమారుని యవస్థ చూచితివా? (ప్రకా) లే.

జయ—మీరు మనకూటిలో మట్టిఁ గొట్టకుండ మీయూరు పోవలయును. మనకట్టి బాస యిచ్చినఁగాని లేవము. మనభటులు దూరమున నుండుటచేత గౌరవమునకు లోపములేదని కాళులు పట్టుకొంటిమి.

వర—మీదారిని మేము పోవుదుముకాని నీప్రయత్నమున కేమియు నడ్డురామని చెప్పు.

మధు—వింటివా?

జయ—(లేచుచు) ఇంతకంటె సుఖ కేమియు నక్కఱలేదు.

మధు—అక్కఱలేకేమి! రెండు లెంపకాయలు మాప్రభువుగారిపక్షమున నే నిచ్చెదను తీసికొనుము. (చేయి యెత్తును.)

జయ—రెండు కాదు. పండ్రెండు లెంపకాయలు తీసికొందును. లాభించునప్పుడు తీసికొనుటలో వెనుదీయకుగులేదు. ఇందులో నొకధర్మసూత్రమున్నది. నే నిప్పుడు రాజప్రతినిధినగుటచేత నన్నుఁ గొట్టినదెబ్బలు రాజుదౌడపైఁ గొట్టినట్లనిమాత్రము మనుస్మృతి చెప్పుచున్నది.

మధు—నీవంటి యవతవక తెలివితక్కువ నిర్భాగ్యశిరోమణినిఁ జేర్చినందుల కూరకపోవురా? (రెండుసారులు దౌడపైఁగొట్టును.)

వర—సేవకా! నడు. (పరిక్రమించుచున్నది.)

జయ—నేనుకూడ రేవువఱకు వచ్చి యోడ నెక్కించి మఱలిపోవుదును.

మధు—(అప) అమ్మా! మనకు రేవువఱకు దారి తెలియదు. అక్కడ నోడ నెక్కుటకుఁ బడవలసినపాటు లనేకములుండును. ఇతఁడు కూడ మనతో వచ్చును.

సర— గీ. గరళసంపర్కమున్న యో ♦ గిరము వలెను
మొండిచేయి పుట్టినయింటి ♦ పోల్కి నకట!
మాదుసాంగత్యమాత్రచే ♦ మనసు చెడిన
కన్నతండ్రిని విడిచి యేఁ ♦ గంగవలసె.

గీ. చల్లనిదయామృతలబావి ♦ తల్లి పోవఁ
దండ్రి పినతండ్రికంటె ను ♦ త్తరుఁడు కాఁడు
భవ్యగాయత్రిహృదయంబుఁ ♦ బాసిపోవ
యజ్ఞసూత్రంబు మొలత్రాటి ♦ కధికమగునె?

గీ. కన్నతండ్రిఁ బాసినదని ♦ నన్ను నింద
సలుపకుఁడు రామనగరవా ♦ స్తవ్యులార!
పెండ్లికొమరుని సౌశీల్య ♦ విధము నంత
కాంచితిరి గాదె? నాయందుఁ ♦ గలదె తప్పు

గీ. విషసముద్రంబునఁ దుపాను ♦ విసరునపుడు
చాపకొయ్యలు విఱుగఁ బుం ♦ జాలు తెగఁగ
మోర్జ పగులఁగఁ జుక్కాను ♦ ముక్కగాఁగ
నడలు నావికగతి నుంటి ♦ నడవి నడుమ.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.



శ్రీరామా.




# ద్వితీయాంకము.



ప్రదేశము—భీమపురము-సముద్రతీరము.

ప్రవేశము—ఇద్దఱు పల్లెవాండ్రు.

మొదటివాఁడు—అన్నా! తుక్కురేఁగఁగొట్టినదిరా తుపాను-దీనిసిగ దఱుఁగ.

రెండ—వల బుజాన వేసి ఎన్నియేండ్లయినదో! కుంటిబాపనయ్య అయిదుపదులమీఁద రెండన్నాఁడు. కంతిపాతానమ్మ పదైదుల మీఁద రెండన్నది. ఎవరిమాట నిజమో తెలియదు కాని, యింతగాలివిసరుమాత్రము తోఁకబుట్టలో బొమ్మిడాయి బోణి అయినది మొదలు నే నెఱుఁగను బాబూ! నెత్తిమీఁద వెండ్రుక లుండునో యెగురునో యనిపించినది.

మొద—మన లెక్కయేమి? రావణాసురుని మీసాలే మూపు మాసిపోయినవి. ఆయమ్మ మనపాలఁ బడి మనచేతిలోఁ బెట్టిన మెడలోని తీగచేతఁ గడుపులో పెచ్చుఁబడి యీముసురుదినములలో బ్రదికినాము గాని—

రెండ—పోలేరమ్మగండిలోఁ జిక్కుకొన్న అమ్మవారిని లాగినందుకు మడతమీఁద లోడితెడు గలదో లేదో అవస్థ విచ్చినందుకే

సంబరపడుచున్నావా? నేనే ఆఁడుదాననైన పక్షానికి-నీవే నన్ను లాగినపక్షానికి-బంగారపు రింగులున్న వల నీబుజాన వేయనా? ఆయమ్మ యిప్పుడేమైనది ?

మొదటి—అయిదాఱురోజులు మాఁగుడిసెలోఁ బ్రాణాలు గూటఁబడ వలె కుంచినాము-తరువాత-ఈభీమపురము సివారునుండి రో య్యమీసాలయ్య యెవఁడో యయ్య వచ్చినాఁడు. అటు చూ చినాఁడు. ఇటుచూచినాఁడు. ఈయమ్మ యట్టె కన్నుతెఱచినది. ఇట్టె తలవంచినది. ఆయయ్య యిగిలించినాఁడు. ఈయమ్మ నగిలించినది. ఆ! నీవు నేను మాటలాడుకొనునంతలోఁ బెద్ద చేఁప చిన్నచేఁపను బట్టుకొన్నట్లు-ఆయయ్య యీాయమ్మను వడివేసినాఁడు.

రెండవ—అటుపైన.

మొదటి—అటుపైన లేదు. ఇటుక్రింద లేదు. వల దులుపులోఁ దప్పించుకొని నీటిలోఁ బడిన చేఁపలాగున మఱి చూపులేదు.

రెండ—అదిరా తమాసా! పుట్టగోఁచి పెట్టినా మొదలు చూడఁగాఁ జూడఁగా నా కేమితోఁచిన దనఁగా—మగవాఁడున్నాఁడే— నేయి అన్నము తినువాఁడు మొదలుకొని అంబలితాగువాని వఱకు వట్టి దద్దమ్మ. ఇల్లు దాఁటినయెడల నుప్పుగల్లునకు మారఁడు. అమ్మ! దీనిమాయ కాల—ఆఁడు దున్నదే! అడ విలోఁ బెట్టు—నడిసంద్రానఁ బెట్టు—దానిబ్రదు కది సులు వుగాఁ జూచుకోఁగలదురా. దీపానికివచ్చిన యినుళ్ల తెరలాగున దానిఁ జూచి అందఱు మూఁగుదు రేమిరా! మనమొగ మొ కఁడును జూడఁ డేమిరా! ఛీ! ఎన్నాళ్ళు గోఁచిపెట్టి సిగవేసి కొని బ్రదికిన నేమి లాభము? పైఁట వేసికోవలెను. కొప్పు

పెట్టుకోవలెను. అప్పుడు దాని తమాసా! మీసాలపోతులు గా మనలఁజేసి ఆబమ్మగాఁడు మన గొంతుక గోసినాఁడురా. కొన్నాళ్లాఁడుది, కొన్నాళ్లు మగవాఁడుగా నుండునట్లు చేసినను పసందుగా నుండును. ఇన్నిమాట లెందుకురా? సిష్టికంత ఆఁడుది కావందను. మగవాఁడు బానిసేఁడను. తమ్ముఁడా! అట్లు చూచి పాఱిన దేమిరా?

మొదటి—అదిగో! ఆకొబ్బెరతోఁపువ్రక్కను- ఆమగవాఁడు నాఁడుది కూడ నిలఁబడినారురా!

రెండవ—ఏది? (చూచి) అదిరా తమాసా! తెక్కలచేఁపలాగున మంచిసొగసుగా నున్నదిరా! ఎన్ని రంగులైన నన్ని సొగసులైన నెంతతమాసయైన సముద్రపుఁజేఁపలలోను—ఆఁడుపాపలలోను నున్నదిరా. అదిగో! వారిక్కడికే వత్తురుకాఁబోలు. ఆమగముండకొడుకు పీఁతలాగున నష్టముగా నడచుచున్నాఁడేమి? మన మిద్దఱము పోవుదము రా. (నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.



ప్రదేశము—భీమపురపు సివారు.

ప్రవేశము—మధురిక, భ్రమరకుఁడు.

భ్రమ—అది నీకు బాగుగా నున్నదా?

మధు—నీకు బాగుగా లేకపోవచ్చును గాని, నాకు బాగుగా లేనియెడల నే నక్లేల యనియుందును? నాజాతివాఁడవు కదా-దూర బంధువు వనికూడఁ జెప్పితివికదా—మీయింటికి రమ్మని యూ

దరణపూర్వకముగాఁ బిలిచితివికదా అని వచ్చితిని. మూఁడు దినములకంటె నీవలన నాతిథ్య మొందుట యెందులకు? నీ యింటిలోనున్న ముసలియామె నాకుమిగుల మేలైనయూఁడుతోడు గా నుండుటచేత నీదినములైన నుంటిని గాని నే నిట్లుండుట తగునా? నీవా-పడుచువాఁడవు. నేనింక నగరు పెండ్లియైనదా ననుగాను. అందుచేత నేనుబోవుదును. నాకు సెలవిమ్మంటిని. నేను దగనిమాట యేదియు ననలే దనుకొందును. అంటినని నీకుఁ దోఁచినయెడల క్షమింపవలయును.

భ్రిమ—నీయభిప్రాయ మేదో నాకు బాగుగాఁ దెలియలేదు. నేను బడుచువాఁడనైన యెడల నీకుఁ గలిగిన చిక్కేమి? నీకుఁ గన్నెఱికము గానందువలన నీయూరికిఁ గలుగు నష్టమేమి? నీవేల పోవలయును? సరే—పోయెద వనియే యనుకొనుము. నీవు వెళ్లినందువలన నాపడుచుఁదనమునకు భంగము కలుగు నని నీయభిప్రాయమా? నీనగరుపెండ్లి కీయూరికంటెఁ బైయూ రెక్కువతృణకాష్ఠజలసమృద్ధి గలదని నీయభిప్రాయమా? నీశుభకార్యము శ్రీజగన్నాథాలయములోఁ జేయఁదగినది కా దుగదా! ఏదోయొకయూర జరుగఁదగినదేకదా! ఈయూరి మనదాసులందఱ జీమాత్రిపు గృహకృత్యమునకుఁ బైయూరు పోవుచున్నారా! ముసలిదానియింట మన మిద్దఱ మింకముం దుఁగూడ నున్నయెడల నితరు లేమని యనుకొందురని నీయ భిప్రాయమో రవంత చెప్పు!

మధు—ఆఁ! ఏమైన ననుకొందురు—మానుదురా యేమి? నరము లేని నాలుకకు న్యాయమేమి యన్యాయమేమి?

భ్రిమ—ఏమైన ననుకొందురని యంటివిగదా—ఏమని యనుకొందు

రో చెవులార వినవలయునని యున్నది. ఏదీ! ఏదీ! (నవ్వేను.)

మధు—(సిగ్గుతోఁ గూడిన వగతో) ఆఁ !

భ్రమ—ఆహాహా! ఎంతసొగసుగా 'ఆఁ'కొట్టినావు! ఏలాగున? ఆఁ ఆఁ. (తాననుకరించును.) ఏమధురగానముకూడ నీ'ఆఁ'కు సరిపోదు గదా. సప్తస్వరసారస్యసార మొక్కజెటకాతో విసరివైచితివే! సరే. మన మిద్దఱము భార్యాభర్తలమని పైవారనుకొందురు. మన మట్లు లింకను గాకపోవుట వారితప్పా మనతప్పా? ఇంక ను గాకపోవుటచేతనేగదా వారట్లనుకొనుటకుఁ గారణమగును. ఐనయెడల నోరెత్తుదురా? సతీపతులనందఱ నూరివారు తారకమంత్రమువలె జపించుచున్నారా? తప్పు మనలో నున్నప్పు డూరివారికిఁ జీవాటులేల? మూఁడుదినములు వ్యర్థమైనందుల కే మనము భగవంతునికిఁ బ్రజలకుఁ గూడ నుత్తరవాదులమై యుంటిమిగదా. ఇంక నాలస్య మేల?

మధు—ఇందులో భగవంతునికిఁ గూడ నేమిసంబంధము?

భ్రమ—సంబంధ ముండితీఱును.

మధు—ఎట్లు?

భ్ర—నీవు చక్కని చుక్కవు. దోరజామిపండువంటి ప్రాయము వ చ్చినదానవు. స్వదేశమునకు మిగుల దూరమున నున్నావు. అసహాయురాలవై యున్నావు. పోల్లుపిట్ట మఱ్ఱిపండునువలె నిన్ను గుటుక్కున మ్రింగుట కీవాడనే యెందఱో జాఱుకచ్చల వారు—కోరమీసాలవారు—వడివేసియున్నారు. నన్నుఁజూచి సంశయించుచున్నారు. మొదట నేను శుద్ధజారుఁడువలె ని న్నాకర్షించితిని. నాస్వభావ మదికాదు. నీవు నాబారిఁబడుట నాయదృష్టమే కాక నీయదృష్టముకూడను. ఇట్టి నీవు దుష్ట

సంపర్కముచేఁ జెడిపోకుండఁ గాపాడుట నావిధియనుకొనుచు న్నాను. నీవు భగవదిచ్ఛచేఁ బల్లెవాని కొంపలో నాకుఁ జిక్కి తివి. నిన్ను వదలివైచినయెడల నేను భగవంతుని కుత్తరవా దిని గావలసి వచ్చునని భయపడుచున్నాను. నిన్ను నేను బెం డ్లాడెదను. నీవు సుఖముగా సంసారమును సవరించుకొనుచు నన్నుఁ బుత్త్రివంతునిగాఁ జేయవలయును.

మధు—ఈయంశమందే నీకు నాకును భేదాభిప్రాయము లున్నవి. నేను బెండ్లినొల్లను.అందువలననే మఱియెక్కడికైనఁ బోవుదు ననుచున్నాను.

భ్రమ—పోకుండ నిన్ను నిరోధించుట కెవని కధికారమున్నది? నీవు వయసువచ్చిన దానవు, దానితో బుద్ధికూడ రావలసినదే. కా వునఁ బెండ్లిచేసికొనుము.

మధు—పెండ్లిప్రస్తావన నీవు పదేపదే చేయకుము. నాకది యపశకు నముగా నున్నది. పెండ్లిచేసికొనుటకు నేనంత దిక్కులేనిదాన నుగాను. అంత కన్ను ముక్కు తీరులేనిదానను గాను. అంత గాగరాగుడ్డకైన గతిలేనిదానను గాను.

భ్రమ—కావుననే పెండ్లిచేసికొనుమని బ్రతిమాలుకొనుచున్నాను. చేసికొని టంకసాలలోని కాసులవంటి పిల్లలఁ గనినయెడల నీ సౌందర్యము లక్షగుణములై శాశ్వతముగాఁ బ్రకాశించును. నీజాతిని నీవు లావణ్యమయమును జేయుదువు. కవియగువాఁ డు గ్రంథముల వ్రాయవలయును. సౌందర్యవతి సంతానమును గనవలయును.

మధు—సంతానము కొఱకేనా యీజంజాటమంతయు? సరిసరిమంచి బుద్ధిమంతుఁడవు! పిల్లలవలన సౌందర్య మెంత ధ్వస్తమగునో

మగవాఁడవైన నీ కెట్లు తెలియును? తలనఱసినప్పుడు సంతాన మే కావలసియుండినయెడల దేనినైనఁ దెచ్చికొనఁగూడదా? కొనఁగూడదా? సంతానమనునది వృత్తివిచ్ఛేదము గాకుండఁ గొనసాగుట కేకదా. అదిగాక కులవృత్తిలో నున్నప్పుడు మాత్రమంత కనవలసిన దౌర్భాగ్యము భగవంతుఁడు నుదుట వ్రాసినప్పుడు తప్పునా యేమి? కావున వృత్తి మానుకొని పెండ్లిచేసికొనుమని నీవు చెప్పిన మాట నాకు నచ్చలేదు.

భ్రమ—మధురికా! వృత్తి వృత్తియని పెద్దమాటలు చెప్పుచున్నావు. రాజ్యాధిపతి వృత్తియా? మంత్రాధిపతి వృత్తియా? సేనాధిపతివృత్తియా?

మధు—ఆవృత్తులు మావృత్తికంటె ఘనమా! కత్తి చేతధరించి యుద్ధభూమియందలికి వీరావేశమును దెచ్చుకొని యొక్క శత్రువును స్వాధీనునిగాఁ జేసికొనుసరి కొకసేనాధిపతికిఁ జావుతెంపులయి పోవును. అట్టె విలాసముగాఁ దలుపుచాటున నిలిచి హృదయము మీఁది హారమైనఁ గంపింపకుండ నొక్క క్రీఁగంటిచూపుతో వీరాగ్రేసరునినైన గడగడలాడించి గాగరాకొసను గన్నుల కద్దుకొనునట్లు చేయఁగలవృత్తి నాది—సేనాధిపతియే నాయొద్ద మాఱనప్పుడు ప్రధానునిలెక్కయేమి? ఆస్థానగజాశ్వాది జంతు పరిపోషణాధికారమున్న మంత్రిచే నాయింటి కోళ్లకుఁ దవిటియుండలు చేయింతును. తప్పులెక్కలు వ్రాయించి ధనము గడించిన సచివశిరోమణిచే మాయింటిలోని చాకిలిపద్దులు వ్రాయింతును. ఇఁక రాజ్యాధిపతివృత్తి మావృత్తికంటెఁ దక్కువయని మాయమ్మమ్మ పవిత్రమైన తన జీవచరిత్రముచే లోకమునకు వెల్లడిచేసినది.

భ్రమ—అదియేమి? అదియేమి?

మధు—మాయమ్మమ్మ—శ్రీమతులలోనిది—నీవువినలేదు కాంబోలు- చఱచఱకవిత్వము చెప్పఁగలదగుటచేఁ బఱపఱఁ దన జీవచరిత్రమును దానే వ్రాసికొనెను. ఇప్పటి మందపాలరాజున్నాఁడే. ఈయనతాతయే కాంబోలు, మాయమ్మమ్మను జేరఁదీసెను. ప్రభువులనఁగా నాకాలపుఁ బ్రభువులు. దాసులనఁగా నాకాలపు దాసులు—ప్రభుఁడు మొదలుకొని బానిసవఱకందఱు దాసి నుంచుకొని తీఱవలసినదేకద! ఆమర్యాద యాసొగసు నానియమము చూచితీఱవలసినదే. కాని చెప్ప నలవికాదఁట. మాయమ్మమ్మ పల్లకిలోఁ బగటికాగడాలతోఁ జోడుదాఱు కట్టలతో డప్పులతో నాస్థానమునకువచ్చి విజయదశమినాఁ డస్థసింహాసనమునఁ గూరుచుండి నజరులను దీసికొనుచుండెడిదఁట. ఆమె యట్లతద్దెనోము చేసికొనునప్పుడు రాజుగారామెయింటి వీధి యరఁగుమీఁదఁ గూరుచుండి యక్కడికివచ్చిన చిన్నపెద్దల కత్తరుతాంబూలము లిచ్చి యామెతో వీధివెంటఁ బాదచారియై బయలుదేఱి పదిమందిదాసు లింటికిఁ బోయి యట్లువంచి పెట్టించెడివాఁడఁట. అప్పటి కట్టుపాటు లెంతముద్దుగా నుండెడివో చూడు! బంగారుయుగము. ధర్మము నాలుగుపాదములతో సమముగా నడచినది. ఇప్పటి ప్రభువులు—పైచక్కఁబాటులకుఁ బటుత్వములు లేక, మడికట్టుకొంటిమని, మతమని, మనస్సాక్షియని దాసి మొగముచూడక తాము పాడై యాస్థానముల కప్రతిష్ఠ తెచ్చుచున్నారు. ఇఁక నిప్పటి రాజకీయోద్యోగులు—పట్టెదద్దమ్మలు—ఆడంగిరకముల అబ్బన్నలు—నసుమీసపువారు—అజీర్తికడుపులవారు—మొగము వెలవెలల

వారు—బట్టలబండారములవారే కాని గాగరాగాలికాఁగిన ముండకొడు కొక్కఁడును లేఁడు. అందుకొఱకే వర్షములు వెనుకఁబట్టుచున్నవి. పంటలు భగ్నము లగుచున్నవి. కఱవు లధికమగుచున్నవి. ఒక్కటే మాట—ఏయాస్థానమున దాసి ప్రభునికంటె నెక్కువగా గౌరవింపఁబడునో, యెచ్చట దాసి కడుపు తరవాణికుండకంటె నెక్కువ చల్లగానుండునో, అచ్చట సుభిక్షము—అచట సుభోజ్యము—అచ్చట సుమాంగల్యము.

భ్రమ—ప్రపంచవృత్తు లన్నిటిలో వ్యభిచారవృత్తి పరమోత్కృష్టమని యిప్పుడు బోధపడినది. కాని నీవు చెప్పినమాటలు నీకే బాధకములుగా నున్నవేల ? పెండ్లిచేసికొనవని నిశ్చయపఱచుకొంటివి. గాగరాగాలికాఁగిన ముండకొడు కిప్పు డొక్కఁడై లేఁడంటివి. నాలుకమీఁది తేనెగుక్క పైయంగిటి కంటినఁగాని రుచి యెట్లుపుట్టును ? వీణను మీఁటువాఁడున్నఁగాని నాద మెట్లుద్భవించును ? సరసుఁడు లేకుండ వృత్తి నెట్లుచేసెదవు ? న్యాయవాదియింట నెన్నిశాస్త్రగ్రంథము లున్ననేమి ? తలలో నెంతజ్ఞానమున్ననేమి ? మనోవృత్తి నాసించిన పూర్వసువాసిని యైన లభింపనిచో నతఁడు పుస్తకములనమ్మఁ బస్తుండఁదగిన దేకద ! వట్టిగదిలో నీకనుగీఁటులు వల్లెవాటులు గోటిపోటులు పూలవ్రేటు లెవనికొఱకు ? ఇప్పు డుత్తమజారుఁడు లేఁడు. కావునఁ దగినవానిని నిన్నుఁ గోరినవానిని బెండ్లి చేసికొని—

మధు—జగత్తంతయు గొడ్డుపోయినదని నాయభిప్రాయము కాదు. బట్టతలపై వెండ్రుకలవలె నక్కడక్కడ నొకొక్కఁడుండవచ్చును. అట్టివారుండఁ బట్టియే కలియుగ మిప్పటికైన నీవిధముగా నైన నిలిచియున్నది.

భ్రిమ — అట్టి ధర్మదేవత లుండుటవలన లోకోపకారమే జరుగుచున్నది. కాని యట్టిమహాపురుషు లెచ్చట నున్నారో నీవు వారి నెట్లు కనిపట్టఁగలవు! ఏ మొగము పెట్టుకొని వారి వెంటఁ దిరుగుదువు!

మధు — నేనంత వెనుకదిక్కు లేనిదానను గాను. మాతండ్రి రాజగురువు- అలహాసింగరాచార్యులుగారు. ఆయన శిష్యసంచారము వంకఁబెట్టుకొని నాకన్నె చెఱఁబాపుటకై తగినరాజపుత్త్రికొఱకు వెదకుచున్నాఁడు.

భ్రిమ — అద్దీ! ఆచార్యాభిమానము శిష్యులపై నట్లుండవలయును. పంచబాణవిద్యోపదేశమునకై షట్ఛాస్త్రపండితుఁడు బయలుదేరినప్పు డింకఁ గొదవయేమి? ఏమీ! భుజాగ్రములందు శంఖచక్రధారణముచేయించుటకంటెఁ గూఁతుకంఠమున శిష్యులచే మంగళసూత్రధారణ చేయించుట ఘనతకాదా. శిష్యులు మతమర్యాదను బుత్త్రిలు బంధుమర్యాద నల్లురునా? శిష్యవిత్తాపహరణమునకై తన సాలగ్రామతీర్థపాన మొకసాధనము- ముద్దులబిడ్డ యధరతీర్థపాన మొకసాధనమునా?

మధు — నీవధిక్షేపించుచుంటి వేమోకాని కన్నకడుపుకొఱ కెన్నిపాటులు పడవలయునో కన్నవానికిఁ దెలియును గాని నీకెట్లు దెలియును?

భ్రిమ — తెలియవలసినప్పుడు తెలియనే తెలియును గాని రాజగురువా? అలహాసింగరాచార్యులుగారా? రాజగురువని యాదిక్కుమాలిన బిరుదముకూడ నెందులకు? అది యాచార్యులవారి ప్రతిష్ఠకొఱకా? రాజుగారి ప్రతిష్ఠకొఱకా? అలహాసింగారాచార్యులన్న సరిపోవునే. ఏమూఁడునామాల దాసరయ్యయో

యని యెవ్వఁడును గణింపకుండునే! రాజు ప్రతిష్ఠకూడఁ బా
డుచేయుట యెందులకు? రాజుగా రాతని నట్లు చేయుమని
నారా? రాజుగారి గురువు కాదుకదా—రాజుగారి చాకలి
యైన నట్లుచేసినయెడల సాగఁదీసి—

మధు—నీవధిక్షేపించుచుంటివమ్మా నేనిఁకఁ బోవుదును. నీమోమే
మోకాని నాకు విశేష విశ్వాసభాజనమగుటచే నా కష్టసుఖము
లు నీతో వెడలఁ బోసికొనుచుంటిని. మనఃకాపట్యములేకుండ
వటవట వాగుదాననేకాని యెదుటివాని యెత్తిపొడుపులను గ్ర
హింపలేనిదానను. అట్టి నాకే నీ వధిక్షేపించుచుంటివని తోఁ
చినప్పుడు—

భ్రమ—నన్ను క్షమింపుము. ఇఁక నిన్నుఁ బరిహసింపనులే. కాని
మీయమ్మయే వరాన్వేషణకై బయలుదేఱినయెడల నాచా
ర్యులుగారు బయలుదేఱినకంటె బాగుగా నుండునేమో?

మధు—మాయమ్మ చనిపోయి మూఁడుసంవత్సరము లయినది. ఆమె
సరిగా నీవంటి హృదయనైపుణికలది. మధురికమ్మకుఁ బెండ్లిచే
యవలయును గాని కులవృత్తిలో దింపవలదుసుమా యని
మాతండ్రితో నవసానసమయమునఁ జెప్పి పోయెను.

భ్రమ—వృత్తి కష్టములస్థితినిఁ బట్టుటచే నామె యట్లు చెప్పినది. కాని
మీతండ్రి యేమనినాఁడు?

మధు—నాఘటములోఁ బ్రాణములుండఁగా మధురికమ్మచేత గాగరా
మాసిపించి చీర కట్టింతునా? మధురికమ్మకు మగలే లేకపోవు
దురా? మూఁడుజిల్లాలలో శిష్యసంచారమున్న యాచార్య
పురుషుఁడను ముద్దనుసుముకొక్కఁడువారిని బూటకొక్కఁ మగనిఁ
గన్నబిడ్డకుఁ దేలేకపోవుదునా? యని కన్నీరు గ్రుక్కుకొనెను.

భ్రమ—మీయమ్మకంటె మీతండ్రియే ముందుగాఁ బోయినయెడల నీ క్రుమ్ములాట లేకుండి యుండును. కాని మీయమ్మమాట పథ్యమా మీనాయనమాట పథ్యమా?

మధు—అమ్మమాట పథ్యమే కాని యపథ్యము పైకి నాలుకపండెవు గుఱ్ఱమువలెఁ బరుగెత్తుచున్నది.

భ్రమ—అందుచే జిహ్వయందు రోగదోషమున్నట్లు స్థిరపడుపవలయును. నీవు నోటికివచ్చినట్లెల్ల వదరుటయే కాని యెదుటివాని యెత్తిపొడుపులను గ్రహింపలేనని యిప్పుడేకదా పలికితివి? ఇట్టి నీవు కులవృత్తికిఁ బొత్తిగాఁ బనికిరావు.

మధు—పనికిరాకేమి! నేనే పనికిరానియెడలఁ బనికివచ్చినది మఱి యెవతె? నాది ధారాళమైన స్వభావమే కాని కుత్సితమైన స్వభావము కాదంటిని.

భ్రమ—అందుకుఁ గావలసినదే కుత్సితత్వము కృత్రిమత్వము క్రూరత్వము. నీతెలివి రాణింపదు. నీవాఁడి విశారదతవలన ఫలము లేదు. నీకున్న ముక్కుతీరంముల కుపయోగింపదు. దీనికిఁ గావలసినవి హస్తలాఘవము కనుకట్టు, మహేంద్రజాలము. చెవితోఁ జూడవలయును—కంటితో వినవలయును. నాలుకతోడ మూరుకొనవలయును. తెరలేకుండ నంతరిక్షమునఁ దోలుబొమ్మలాడింపవలయును. మూఁకుడుతీయకుండఁ దోలపొడువకుండఁ గుండలోనితేనెను నాలుకతగులకుండ నాకింపవలయును. మబ్బులేని మింటినుండి రసములేని వర్షము కురిపింపవలెను. అటుచేతఁ ద్రిమూర్తుల నగపడుపవలెను. ఇవియన్నియు నీవు చేయఁగలవా? సహస్రమాయావిశేషమునఁ గోటీశ్వరుఁడైన న్యాయవాది యెవ్వఁడైనఁ జచ్చి యుత్తరజన్మమున

దాసినై పుట్టి బాహాటముగా వర్తక మారంభించిన నైన నా
తని క్రొత్త గాగరాకట్టుమాత్రము పూర్వపుగానుకట్టంతజయ
ప్రదముగా మాత్ర ముండదు.

బుధు—ఎవని కుండకపోయిన నాకేమి? నాచాకచక్యమును నా చమ త్కారమును లోకమునకుఁ గనఁబఱచుటకైన నేను గులవృత్తి లోఁ బ్రవేశింతును. జీవయాత్రావిజయమునకుఁ గొంతమాయ యావశ్యకమని నేను నెఱుఁగుదును. ఱవంత బియ్యపుఁబిండి కూడికయున్న సెనగపిండితోఁ జేసినపకోడికాని పంటిక్రిందఁ గఱకఱ లాడదు. రుచిమంతమై రెండుదినములవఱకు నిలువ యుండదు. శుద్ధసాత్వికమైన బుద్ధికంటె ఱవంత పెంకితనపు మేళవింపుగల బుద్ధి యెక్కువ శోభించును. వంకవంకలుగల తలకట్టునకున్న శోభ తీఁగ సాఁగుడు తలకట్టునకు లేదు. ఆ మాత్రపు గడుసుఁదనము మాయయు నాకున్నవి. అధికమాయ యెన్నటికి పజయమొందును. అది నాకు లేనులేదు. అక్కఱ యులేదు. చెట్టు సంపంగి పూలనుండి వచ్చిన గాటుపరిమళము వలె నొక్కసారి విటహృదయములను గ్రమ్మి యుక్కిరిబిక్కిరి లాడింతును. కాని నాదొక్క ప్రార్థనమున్నది. నాకు మనసులో నొక్కటియుఁ బైని నొక్కటియు లేదు. నిన్నుఁ జూడఁగనే నీ పై నాకు వాంఛకలిగినది. నాకీ కన్నెచెఱఁ బాపి నన్నూరిపై విడువుము. పెండ్లియని పట్టుపట్టకుము. ఇంతసందేహింపకుండఁ దనయంత తానడిగినదాసి యెవతైన నుండునాయని యను కొనకుము. ఒక్కొక్కస్థానమున నావంటి తెట్టెమొగమొ కతె యుండును.

శ్రీమ—పెండ్లికొఱకే కానియెడల నీవు నాకేల?

మధు—(దీనముగా) ఇంతయేనా ?

భ్రమ—ఇంత కాక నీవ నెంతయనుకొనుచున్నావు ?

మధు—(ఊరకుండును.)

భ్రమ—మాటలాడవేల ? పడమటి వడగాలి విసరే విసరుదువో ? తూర్పు తుపానుగాలి విసరే విసరుదువో ? ఉత్తరపుఁ గొండ గాలి విసరే విసరుదువో ? దక్షిణపుఁ బయ్యెర విసరే విసరుదువో కానీ.

మధు—నామనస్సు స్పష్టముగా నీకు విప్పిచెప్పినను నీకు దయరాకపోయినది. నిన్ను వదలిపోవుటకు నాకుమాత్రి మిష్టమా.? ఎటు వచ్చినను బెండ్లిముడి దగులుచుకొనిన పిమ్మట మనస్సులోనైన వ్యభిచరించుట మహాదోషము కావున నే నింత సందేహించుచున్నాను. కాని పడుచుఁదనపుటుత్సాహము ప్రిబలముగా నుండుటచేతఁ గడద్రోక్కిపోవుట [illegible]లాటపడుచున్నాను.

భ్రమ—నీపడుచుఁదనపు విసరులు—ఊపులు—అగాదులు-దండయాత్రలేవో యన్నియుఁ గానిచ్చుకొని శాంతిపడినపిమ్మటనే నా యొద్దకు రమ్ము.

మధు—(తెల్లఁబోయి) అప్పుడు నీవు నన్నెట్లు పరిగ్రహింతువు ?

భ్రమ—నాయిల్లాండ్రుటకైన నక్కఱకు రాకపోవుదువా ?

మధు—నాబ్రిదుకు దుదకంతే.

భ్రమ—ఇంకనుసందేహమా ! ఇట్టి యవస్థ నీకొక్కతెకేనా? పిల్లలు మాకక్కఱయేలేదని యఱచినమిండకత్తెలలో నిప్పుడు మంతు రసానితన మొందఱు చేయుచుండుటలేదు ? విటులచేఁ దలలకు సంపంగినూనె యంటించుకొనిన విటకత్తె లెంద ఱిప్పుడుసొంతి తిరుహస్తములతో నంట్లు తోముచుండుటలేదు ? పడుచుఁదన

మేమి పాషాణమనుకొంటివా! బ్రహ్మాస్త్రమనుకొంటివా! నీవొక్కతెవే పడుచుదానవా! నీవంటిపడుచువాండ్రంద ఱేదండయాత్రలు సలిపినారు? ఏదేశములఁ గొల్లఁబెట్టినారు. ఏయుద్ధములు పొడిచి గెలిచినారు? నీజవ్వనపువిసరులు విఱ్ఱవీఁగుటలు విఱుచుకొని యూరిపైఁబడుటలు వీరావేశములు విజయధ్వజములు నెంతకాల ముండుననుకొంటివి! పక్షిణివలె మూఁడునాళ్లు. తుపానుగాలియైన నాల్గువిసరులతోఁ జప్పఁబడును. గంగవెఱ్ఱియైనను రెండుపొంగులతోఁ నడఁగును. నీపడుచుఁదనపువ్రేటు సముద్రపుఁబోటుకంటె నెక్కువదా! పాటు తెప్పపాటులో వచ్చునుగాదా! ఈదినమున వన్నెలవిసనకఱ్ఱ ఱేపుచీఁపురుకట్ట—ఈపూట గజగామిని ఱేపు గంజికావడి—ఈపక్షమునఁ జక్కవపిట్ట పైపక్షమునఁ దలక్రిందుపక్షి. ఈవారమునఁ గమలనేత్రదాసి పైవారమునఁ గాగితాలరాసి—(ఒడలునిండిన పలాస్త్రిపట్లచేత) ఇంతేకాదా! దాసిదాని పడుచుఁదనపు సౌభాగ్యము! యీమాత్రమునకే యీయాకాశగమనమెందులకు? పేకజువ్వవలెఁ గాలి చప్పబడి గుల్లయై వెంటనే యధఃపతనమొందు టెందులకు?

మధు—దేహారోగ్యము చెడుననియా! చెడనీ! దేహత్యాగమైనఁగానీ! ఊరుపేరులేక కదలికలేక లోడితెడుసంసారములో గుడుగుడుగుంచము లాడుటకు నాకు మనస్కరింపకున్నది. అదికాక నీతో నిదివఱకుఁ జెప్పలేదు. నాకొక్క రాణియున్నది. ఆమె కొలువులో నే నుందును. అంతకంటె నామెనుగూర్చి యిప్పుడు నన్నడుగకు. తరువాత నీకుఁ జెప్పనే చెప్పఁగలను. అంతఃపుర రాజ్ఞీపరిచర్యకంటె మాకు సంసార మెక్కువని కాదు. రాణివాసపుజీతము తక్కువయేగాని రాఁబడి దానికంటె నిరువది

రెట్లు హెచ్చు. రాఁబడికేమికాని యందములోనున్న సొగసంత కంటె హెచ్చు. గుడ్లుమిడుకరించుకొని చూచువారు, గ్రుక్కిళ్లుమ్రింగువారును నగు రాజోద్యోగులనడుమఁ బడుగుపేకగా మేము దిరుగుచున్నప్పుడు మాకెంతో యుత్సాహముగా నుండును. ప్రధానుఁడు మొదలు బంటువఱకుఁ దలపాగలదద్దయ్యలందఱు మమ్ముఁజూచి గడగడలాడుదురు. మాదయకొఱకుఁ బ్రాకులాడుదురు. స్థానబలముచేత మాకట్టియధికారమున్నది. రాజుగారు మాత్రము? అతఁడుగూడ మమ్ముఁగని ప్రక్కబెదరుతో నుండక తప్పదు. క్రిందిది మీఁదఁబెట్టినను మీఁదిది క్రిందఁబెట్టినను గవ్వను గాసుచేసినను గాసును గవ్వచేసినను ముడిబెట్టినను ద్రెంపినను నన్నిటికి మేము చాలియుందుము. మా కిష్టముకానిపని యేదియుఁ గోటలో జరుగుటకు వీలులేదు మునుపు మంథర నేమిచేసినది? కట్టుకొన్నతోరణాలు త్రెంపించి రాము నడవికిఁ బంపలేదా?

భ్రమ—మంథర సంసారిణికాక దాసియేయని నీ వెఱుఁగుదువు? దానిపేరు మీవంశవృక్షములో నున్నదాయేమి? నాయభిప్రాయ మేమనఁగ వ్యభిచారిణులు రాజాంతఃపురములఁ బూర్వమున నుండియుండరు. వారు కులకాంతలనియే నానమ్మకము. అలాగున నీవుకూడ సంసారిణివై లేనిపోని పోకడలకుఁబోక మీరాణిని గొల్చుట నాకు సమ్మతమే. మగవారు సంసారులు రాజుగారి నెట్లుకొల్తురో యాఁడువారు మగనాండ్రు రాణిగారినట్లు కొలువఁదగినదే. లేనప్పుడు నటత్వము మనుష్యునకేర్పడినవృత్తి. అంతేకాని కులవృత్తియని చెప్పికోళ్లకంటెఁ గొండముచ్చులకంటె గాడిదలకంటె సహస్రగుణము లధమమైన

బ్రదుకు బ్రదుకుట యెందులకు ?

మధు—నేను మా బ్రదుకే యధిక గౌరవయుక్తమైనదనుకొనుచున్నాను.

భ్రమ—గౌరవమా ? మహారాజుభార్యయైననరే వ్యభిచారిణియైనచో
మాదిగవాఁడైన నామెను గాంచి నిర్భయముగాఁ గన్నుగీఁటఁ
గలఁడు. మాదిగవానిభార్య సంసారిణియైనచో మహారాజైన
దానిని గన్నెత్తిచూచుటకు గడగడలాడును. అట్టిచోఁ బడుచు
కొనుటయే వృత్తిగాఁగలదాని బ్రదుకెంతతుచ్ఛమో చెప్పఁదర
మా ? వెలకు సంతలోఁబెట్టిన యానపకాయమీఁదఁ గుష్ఠరోగి
యైన రవంత మిగిలియున్నగోటితో నొక్కుటకు యత్నించును.
అట్టిబ్రదుకు బ్రదుకుకాదు. ధనము వచ్చునుగదా దానివలన
గౌరవము రాఁగూడదా యని నీవనుకొనుచున్నావేమో ? ధన
పురాఁబడి కల్ల. వచ్చినదేదో వైద్యులకు వైశ్యులకు బ్రాండి
బుడ్లకు, నెదురీవి నపేక్షించు ముద్దులమగలకుఁ జాలదు. అందు
లో నీకాలపుదాసులకు విటులనుండి రాఁబడికంటె విటులకుఁ
బెట్టుబడి యెక్కువ. కులవృత్తివలనఁ గొంపగుల్లయగుటకాని
మఱియొకటికాదు. లక్ష సంపాదింతువనియే యనుకొనుము.
నీమంచిముత్యాల[illegible]ము [illegible]న్నియు నొకత్రాసుచిప్పలోవైచి
కులకాంతమెడలోని పసపుకొమ్ముకట్టినబొందొక చిప్పలోవైచి
నమెడల బొందు బరువుగానుండును. నీవృత్తినిబట్టి నీకేకాదు
నీసంబంధమున్న ప్రతివస్తువునకు గౌరవమను మాటయైనలేదు.

మధు.—అటులైన నన్నేమిచేయుమంటివి ?

భ్రమ—మాదిగవాని నొకని బిలిపింపుము.

మధు—ఎందులకు ?

భ్రమ—వానికి నాలుగణాలిచ్చి మధురిక కులవృత్తిలో దిగినది; కావున

నీయవకాశమును వృథపోనీయక వచ్చువారందఱు రావచ్చు నోహోయని చాటుమని చెప్పుము. న్యాయవాదులు కట్టునట్టు లింటికి బల్లకట్టిన వినియోగము లేదు.

మధు—నేను కులకాంతనై యుండెదను. చూడు! నేను నిన్ను మనస్ఫూర్తిగా నమ్మినదానను. నీవు నాభర్తవు. చిన్నతనము నుండి యీశరీరము పుష్పశయ్యమీఁదఁ బెరిగినది. ఇప్పుడు కఠినశయ్యపైఁ బండుకొనలేను. చల్లనిపన్నీటిబుడ్డి నొడలి పైఁ ద్రిమ్మరించుకొనిన నేను వేడికుండను వంచి గంజి వార్పలేను. పువ్వులు గుచ్చిన యీచేతులతో బిడుకలను జేయఁజాలను. చేతితో నూదువత్తిని విలాసముగాఁ బట్టి యిప్పుడు చీపురుకట్టను బట్టుట నాకు మిగుల దురవస్థగా నుండును. ఇదికాక మఱియొకమాట—నీవెఱుఁగనిది కాదు. మనలో సంసారిణులే యింటిబండపనియంతయుఁ జేయుదురు. గిలుకు గిలుకుమనుచు హుళ్ళుహుళ్ళు మనుచు గమగమలాడుచు నీ దాసీముండలు (మెటికలు విఱుచును) పాలపిట్టరంగులతో పులిపిట్టచ్చులతో మన్నెపుగోరపలుకులతో వచ్చుసరికి వారికిఁ గాలు గడుగుకొనుటకు సంసారిణులే నీరిచ్చెదరు. కంచాలముందుఁ గూరుచుండునప్పు డాయమ్మవారలకు నైవేద్యము పెట్టుదురు. ఇట్లు చేయకుండ మాత్రము నామర్యాద కాపాడుము.

భర్త—నాకట్టివా రెవ్వరులేరు. నేనొక్కఁడను. నిన్ను సుఖపెట్టెదను. నేను గొంతధనము సంపాదించినాను. దానివలన వచ్చువృద్ధితో మనము సుఖముగా జీవింపఁగలము. నీరాణియొద్దకు నన్ను

రమ్మన్నయెడల వచ్చెదను. కానియెడల మనమిద్దఱమీయూర నే యుందము.

మధు—మీరాణి యిప్పు డూరలేదు. ఇప్పు డామెయొద్దకు వలదు. నీయొద్దనే నేనుందును. ఈయూరు నీదికాదా ?

భ్రమ—ఔను. ఈరాత్రి చెన్నకేశ్వరాలయములోఁ బెండ్లాడుదమా?

మధు—నీయిష్టము. నాకొక్కయాలోచన తోఁచుచున్నది. మనజాతివారందఱు సాధ్యమైనంతత్వరలో నొకచో సభగాఁ గూడి యింతటినుండి మనలోని కన్నెలకు వివాహములే చేయవలయును గాని వారిని గులవృత్తిలో ద్రింపఁగూడ దనియు, నట్లు చేసినవారిని సంఘమునుండి బహిష్కరింతుమనియు నొకశాసనము చేసికొనవలయును. ఇఁక నాకు దాసిదాని మొగముచూచిన నసహ్యమమ్మా.

భ్రమ—ఆసభలో నీవుపన్యసింతువా ?

మధు—అభ్యంతరమేమి ? గంగాప్రవాహమువలె మాటాడుదును. వాగ్ఝరి యనునది యాఁడుదానికే చెల్లును. మొద్దునాలుకఁ గల మగవాఁడు మెమ్మె పెప్పె యనువాఁడేకాని వచోధారాశక్తిఁ గలవాఁడు కాఁడు. ఆఁడుదానినోరు విడఁబడినతరువాత బ్రహ్మరాక్షసులే యచ్చట నిలువలేనప్పుడు దురాచారముల లెక్కయేమి ? కాని నావైపుఁ జూడక యట్లు చూచుచున్నావేమి ?

భ్రమ—అదిగో ! మాప్రభుఁడు సాయంకాలమగుటచే సముద్రతీరమునఁ జల్లగాలిని దిరుగుటకై పోవుచున్నాఁడుకాఁబోలు.

మధు—నీకొక్క ప్రభుఁడున్నాఁడా ? అతనికిఁ బెండ్లి యైనదా ?

భ్రమ—కాలేదు.

(గోవర్ధనుఁడు ప్రవేశించును.)

భ్రమ—అయ్యా! క్షమింపవలయును. ఈమెను బెండ్లిచేసికొనఁదలఁచుకొని యింతసేపటినుండియు మీకొలువులోనికి రాకుండ నీమెతో మాటలాడుచుంటిని. ఈరాత్రి స్వామిసన్నిధిని వివాహము స్థిరపఱచుకొంటిమి. మీరు మమ్మాశీర్వదింపవలయును. నమస్కారము. ఊరకుందువేల? బాబుగారికి నీవుకూడ నమస్కరింపుము. (మధురిక నమస్కరించును.)

గోవ—భ్రమరా! సంతోషమే; నేను జిన్నవాఁడనుగదా! నాయాశీర్వాదమేల?

మధు—(కెవ్వుమనఁబోయి యడఁచుకొని తనలో) అమ్మా! సరస్వతీ! నీవు మృతిఁబొందితివని యేడ్చితిని. నీవుగూడ దైవకటాక్షమున నీరేవునకే చేరితివా? హా! భగవంతుఁడా! ఎంతదయాళుఁడవయ్యా! నడిసంద్రమున మునిఁగిన రాణిని దాసిని దిరుగ నిట్లు సంధానపఱచితివా! అహా! ఎంతయాకస్మికముగా వేఱుచేసితివి! తిరుగ నెంతయాకస్మికముగాఁ గలిపితివి! సముద్రమధ్యమున నెంతయిక్కట్టుఁ బెట్టితివి! ఇక్కడ నిప్పు డెంతయానంద మొసఁగితివి! ఈశ్వరా! నీవెంతకైన సమర్థుఁడవయ్యా! (ప్రకా) బాబూ! ఆశీర్వదింపలేదా? మఱియొకసారి నమస్కరించుచున్నాను.

గోవ—వివాహ మీరాత్రియే యగునని నీభర్త భ్రమరుఁడు చెప్పినాఁడు కదా. ఇఁక శీఘ్రమవివాహసిద్ధిరస్తని యాశీర్వదింపనక్కఱలేదు గదా! శీఘ్రముగఁ బుత్త్రవతివగుమని యాశీర్వదింతును. నీవు కొంచెము నాకంటెఁ జిన్నదానవువలెఁ గానఁబడుచుంటివి. కావున నిన్నాశీర్వదించితిని. నీపేరు?

మధు—(తనలో) సముద్రము నానుటచేత నీగొంతు కొంచెము

బాఁగుగా నున్నదా! ఇది నీపురుషవేషమునకు మఱింత నగి యున్నది. అమ్మా! ఎంతగడుసుదానవు. నీదాసి నైననన్ను — నీతో నడవికి వచ్చిననన్ను — అబ్ధిమధ్యమున నీతోడ మునిఁగిన నన్ను — బ్రదికియుండి మొద్దువలె నీయెదుటఁ బడిననన్ను — రవంత యులుకైన లేకుండ — ఆనవాలు పట్టినట్లు మోమున రవంత సంజ్ఞయైన లేకుండ — గొంతుకను గానంత గద్గదికయైన లేకుండ — యేవిదేశమునుండియో దిగివచ్చి యెన్నడును నా మొగము చూడనిదానివలె నింతకొంకు లేకుండ నీపేరేదియని యడిగితివా! ఆహా! పనికిమాలినయెడ లెంతయున్న ప్రయోజనమేమి! పటుత్వముగల హృదయము లేనప్పుడు? అన్న (అర్ధోక్తిలో) బాబూ! నాపేరు నేనట్లు చెప్పవచ్చునా?

గోవ — నీవు చెప్పఁగూడదు. నీభర్త యంతకంటెఁ జెప్పఁగూడదు. ఇఁక నాకుఁ దెలియుటెట్లు?

మధు — ఇంకను బెండ్లి కాలేదు. కావున నాతఁడు చెప్ప...

భ్రమ — అయినను నాకాసందేహము లేదు బాబు! దసిపేరు మధురిక!

గోవ — ఆలాగా! పేరు బాగుగా నున్నది. ఇది సాధారణముగా నవలలలో నాటకములలోఁ గృత్రిమకాంతలకుఁ బెట్టు సొగసైన పేరువలె నున్నది. నేనిట్టిపేరు సాధారణముగా దాసికుటుంబములలో వినియుండలేదు.

భ్రమ — చిత్తము.

మధు — (తనలో) ఇది మఱింత దొంగమాట! నేను గృత్రిమస్త్రీనఁట! అమ్మా! సరస్వతి! నీకొఱకే పురుషవేషము వైచి కృత్రిమస్త్రీనో కృత్రిమపురుషుఁడనో కొంత కాలమయితిని.

"భార్యాభర్తలవలె నుందము. పురుషవేషమును దీసివేయు" మని మోద మెక్కినప్పుడు నీవు నాతోఁ జెప్పుటచేతఁ దీసి వైచి యథార్థస్త్రీనైతిని. నీవు లోపల నాఁడుదానవు, పైకి మగవాఁడవు. అదిగాక నీదాసిని నీవెఱుఁగనట్లు నటించుచు న్నావు. కావునఁ గృత్రిమకాంతవు నీవే యేల కాఁగూడదు?

గోవ—భ్రమరా! జేపుదయముననే యిటనుండి నేను గాలీపురము నకుఁ బోఁదలఁచితిని. నీవివాహమైనపిమ్మట మూఁడుదినములు నిచ్చటనే యుండి నీవు నన్నటఁ గలసికొనుము.

భ్రమ—మీరొక్కరు పోయెదరా?

గోవ—భయమేమి? నేను బోయెదను.

భ్రమ—శీఘ్రముగనే బసకు వచ్చి మీసామాగ్రి నంతయు సర్ది సిద్ధ పఱచి యుంతును.

గోవ—నేనే సిద్ధపఱచితిని. కాని మూటలసంచి నీయొద్దనే యున్నది కాదా?

భ్రమ—ఉన్నది. వచ్చి యిచ్చెదను.

గోవ—అక్కఱలేదు—నీవు తీసికొనిరమ్ము—నాయొద్ద నింకను సొ మ్మున్నది.

(గోవర్ధనుఁడు నిష్క్రమించును.)

మధు—(తనలో) పోవునప్పుడైన నావంక నవంత చూడకుండఁబోయి నదే. ఆహా! ఎంతగట్టిగాఁ బ్రవర్తించుచున్నదో! ఈమె రహస్యమును నేను నాభర్తకైన వెల్లడిచేయుట తగదని తోఁ చుచున్నది. వెల్లడిచేయకుండ నుండలేను. తన సేవకుఁడైన యీభ్రమరుని నేను పట్టుకొనఁదలఁచుటచేతఁ దనరహస్యము నాలో నిఁక దాఁచియుండదని యెంచి మమ్ముఁ ద్యజించి పాఱె

పోవుచున్న దేమో? ఇఁక నాకు నా రాణి కనఁబడదుకాఁబోలు? అయ్యయ్యో! నేనేమిచేయుదును?

భ్రమ—మధురికా! ఏమి! యట్లు యోచించుచున్నావు?

మధు—మనస్సున కేమో దిగులుగా నున్నమాట సత్యము. నాథా! ఈతని పేరేది?

భ్రమ—గోవర్ధనుఁడు.

మధు—(తనలో) అమ్మయ్యో! మాయమ్మ పురుషవేషమునఁ బెట్టుకొన్న పేరునుగూడ నిదియే. రామపుర రాజులకుఁ దఱచుగా నదియే పేరు. (ప్రకా) ఈతఁ డెప్పుడీయూరు వచ్చినాఁడు?

భ్రమ—అయిదాఱుదినములకంటె నెక్కువయై యుండదు. వచ్చిన దినముననే భృత్యుఁ డాకస్మికముగా మరణించుటచేత నామరు నాఁడే నేనీతని కొలువులోఁ జేరితిని.

మధు—అటులైన నీవీతనికి నాలుగైదుదినములనుండియేనా సేవకుఁడవు? ఏయూరనుండి వచ్చినాఁడో నీకుఁ దెలియునా?

భ్రమ—ఇచ్చటికి దాదాపుగా నాలుగామడలదూరములోనున్న కల్యాణపురమను నూరినుండి వచ్చినాఁడఁట.

మధు—ఇక్కడి కేల రావలయునో?

భ్రమ—విద్యాపరిపూర్తికొఱకు దేశయాత్రఁ జేయుచున్నాఁడఁట.

మధు—(తనలో) అది మాయమాట. (ప్రకా) కల్యాణపురముగూడ సముద్రతీరగ్రామమేనా?

భ్రమ—ఔఁ.

మధు—(తనలో) ఈమె యారేవున జేరి యిక్కడకు వచ్చియుండును. ఇచ్చటకు వచ్చుటతోడనే భృత్యుఁడు చచ్చుటయేమో బోధపడకున్నది. (ప్రకా) మనము కాళీపురము వెళ్లువఱకు నీతఁడు

మనకొంటి కక్కడ నుండునా ?

భ్రమ—ఉండ కేమి ?

మధు—ఈతని కెప్పుడైన నీనాల్గుదినములలో నీవు స్నానముచేయిం చితివా ?

భ్రమ—ఈతఁడు పరాపేక్ష నేమాత్రమును గోరువాఁడుకాఁడు. అతని గూర్చి నీవంత గుఱ్ఱించియడుగుచుంటివేమి ?

మధు—ఈతనినిగూర్చి యొక రహస్యమున్నది. నీభార్యనగుటచే నీకుఁ జెప్పవలసినదే కాని కొన్నికారణములచే జెప్పఁదగినదికాదు. అయినను నోటిచివర నాడుచున్నది. దాని నాపలేనప్పుడు నేనే చెప్పుదును. అది చెప్పుమని నీవుమాత్రము నన్నెన్నఁడు నడుగ వలదు.

భ్రమ—అట్లు నే నడుగువాఁడను గాను. మన కిచ్చట నింక నాలస్య మేల ? త్వరగఁ బురోహితునిఁ జూచుకొని కల్యాణప్రయత్న ములఁ జేసికొందము రమ్ము.

మధు—(తనలో) సరస్వతీ ! చేయి దాటిపోయితివికదా ! మేమువచ్చు వఱకు నీవు కాళికాపురమున నుండుట నిజమేకదా ? హా ! సర స్వతీ ! అనుకూలుఁడగు భర్తను నేను సంపాదించుకొనినట్లే నీవుకూడ సద్భర్తను బడసి సుఖమెప్పుడు పొందుదువో ?

ఇది ద్వితీయాంకము.



శ్రీరామ.




# తృతీయాంకము.

ప్రదేశము—జగన్నాథపురము.

ప్రవేశము—ఒకభవనమున సరస్వతి.

సర—నే నాతని గాఢముగా వలచితిని. పురుషరూపమున నున్నను నే నాఁడుదాననుగదా! నా కాంతుఁడు వచ్చినాఁడు. కావున నేనాతని వలచితిని. ఇంతవఱకు సహజమే. ఆతఁడు నన్ను వలచుట—ముగవాఁ [illegible] వలచుట—యాశ్చర్యముగానున్నది. ఆతనివంటి [illegible] యుండుట మఱియింత యాశ్చర్యముగా నున్న [illegible] శృంగారనాటక మిట్లుండఁగా నిందులో నవాంతరనాటక మొకటి జరుగుచున్నది. అతని సవతిచెల్లెలు నన్నుఁ బురుషుఁడనుకొని హద్దులేకుండ వరించి యనుదినము రాయబారములచేఁ జంపుచున్నది. సవతితల్లిబాధకంటె, నడవిబాధకంటె, సముద్రబాధకంటెను నీబాధ యెక్కువగాఁ గానిపించుచున్నది.

గీ. జగతి యానందమయమను ♦ జనులమాట
సత్యమో కాదో చెప్పంగఁ ♦ జాలఁగాని

మెప్పు డేబాధకలుగునో ♦ యప్పు డదియె
యోర్చుకొనుటకుఁ దగనిదై ♦ యుంట నిజము.
బాధలన్నియు సమమని ♦ పలుకఁ దగదు
మనసునకుఁగల్గు సాఁగుడు ♦ మహిమ యదియె
ఒకఁడు కూర్చున్న లక్షకూ ♦ ర్చున్ననైన
సరిగ నింపు కుబేరపు ♦ ష్పకము వోలె.
బళిర! మగవాఁడు మగవాని ♦ వలచుటయును
భామ వేఱొక్క భామను ♦ వలచుటయును
సృష్టిలో వింతలగుచుండు ♦ నివ్వి రెండు
నాతలనె పుట్టఁగావలె ♦ నా! రమేశ.

అదిగో మగవాఁ డిచ్చటికిఁ వచ్చుచున్నాఁడు. ఈమేడ ప్రత్యే కముగా నాయుపయోగమునకై నిత్యఁయొద్దఁ దీసికొంటిని గాన గుట్టు నిలువఁబడియున్నది. కాని లేనియెడల నీసరికే బట్టబ యలై యుండును.

గీ. మోటమగవాని దుస్తుల ♦ ముడుతలందు
నడఁచి బిగియించి కట్టిన ♦ నాఁడుఁదనము
చటుకుమని మెట్లో తలచూపి ♦ పొటకరించు
నుదకమున నొక్కియున్న వా ♦ యువును బోలె.
వెలఁదుకతనంబు నడిపిఖేఁ ♦ బెట్టుపనికి
నింతగాలి చాలు రవంత ♦ యెండచాలు
నొడలిపొంగు చాలును గుండె ♦ దుడుకు చాలు
సిగ్గులొాగరు చాలును గంటి ♦ చెదరుచాలు.

(కళాలలితుఁడు ప్రవేశించును.)

ఓహో! వచ్చితివా రాజపుత్రా! నమస్కారము.

కళా—గోవర్ధనా !

గీ. మంజుమకరందమహితమౌ • మల్లెపువ్వు
పిలిచి పేరంట మిడినదే • భృంగమునకు ?
సరసమురభిళరుచిమద్ర • సాలఫలము
కీరమున కోరగను గన్న • గీఁటినదియొ ?

వచ్చితివా యని నన్ను బహుమానింపనక్కఱలేదు. ఇక్కడకు వచ్చుటలో నాప్రయత్న మెంతమాత్రమును లేదు. ఇచ్చటి నుండి కోటకుఁ బోవుటయందు నెంతప్రయత్నమైన నున్నది. ఆకష్టముఁ జూచి ఓహో యనఁదగినది. నీవెచట నుంటివో నే నట నుండవలసినవాఁడను. నీవందుల కంగీకరింపకపోవుటచేతఁ గోటకు నీయింటికి నడుమ నిట్లల్లలాడుచున్నాను. నాకు నీయం దున్నప్రేమలో సగమైన నీకు లేదేమో !

సర—(తనలో) కళాలలితా ! ప్రాణకాంతా ! నీదేహము కోటకు నా యింటికి నడుమనే యల్లలాడుచున్నది కాని !

గీ. ఇంతిసొట గట్టిగఁ గౌఁగి • లింతు ననుచుఁ
బైమగతనాన మానంగ • వలయు ననుచు
నాకనరకమధ్యమున మ • హార్తి నాదు
హృదయ మలలాడు నీబాధ • యెంతయయ్య ?

(ప్రకా) కళాలలితా ! ఏమంటివి ! నీకున్న ప్రేమలో నాకు సగఁబాలైన లేదనియా ? తండ్రిని బాసి, ఉన్నయూరిఁ బాసి, మహారణ్యమధ్యమునఁ బడి, సముద్రమునఁ జచ్చుటకు సిద్ధమై, దైవేచ్ఛచే నొకనిర్జనమగు ద్వీపమును జేరియుండఁగాఁ దుపా నువలనఁ బ్రాణాపాయదశ నొందినవారి నెవ్వరినైన రక్షించు నదుద్దేశముతో నీవు మఱునాఁడు నావయెక్కి వచ్చి నన్నుఁ

గాపాడి యిటకుఁ దెచ్చి యిచ్చట నన్నుఁ బోషించుచుంటివి కదా ! ఇంత మహాంధకారమున గింజుకొనినఁ గాని నీముఖచంద్రదర్శనము గాలేదే ! అన్నియాపదలు నీవలన నంతమొందినవిగదా ! నీయెడల నాకెంతయనురాగముండునో నేను జెప్పఁగలనా ? చెప్పిన నీవు దెలిసికొనఁగలవా ?

కళా—నేఁ జేసిన మేలునకు నీవు ప్రత్యుపకృతిగా నన్నెప్పుడు ప్రేమించుచుంటివో యప్పుడు నీప్రేమ స్వచ్ఛమగునదికాదు.

గీ. పూతమగురాగ మది స్వయం ♦ జాతమగును
నీకు రొండిని బైకము ♦ నాకు భుక్తి
నీకు సరిక్రొత్తగాగరా ♦ నాకు ముద్దు
నయివెలయు కుండమూర్పు లిం ♦ తైనఁ గాదు.
బంగరును జిమ్ముసూర్యుఁడే ♦ బదులు దీర్ప
గాలి పన్నీరు జిలుకునే ♦ కాంతువలన
వెండితొడుగిచ్చుఁ జంద్రుఁడే ♦ బేరమునకుఁ
బూలు మణిరాసు లిచ్చునే ♦ మేలు దీర్పఁ.
బైనినేకాదు సుమరాశి ♦ లోన నుండు
రాగతత్త్వము దానిసౌ ♦ రభమెుప్పమ్ము
గొంతుకనె కాదు మది సుతి ♦ తంతులుండు
వానిరాగమె నిజరాగ ♦ వైభవంబు.

నర—కళాలలితా ! అటులైనఁ బంచభూతములవలెఁ బరమాత్మవలె నకారణజాయమానదయానూనుఁడవగు నీకు నాప్రేమ నీప్రేమలోఁ సగఁబాలైన నున్నదో లేదో యని సంకోచమేల ?

కళా—గోవర్ధనా ! నాదట్టిశుద్ధరాగమని చెప్పలేదే. మాటవరుసకుఁ గృతజ్ఞత రాగమునకుఁ గారణము కాదంటిని.

గీ. వ్యాఘ్రతటకూపమున బహు ♦ స్వాదుజలము
గంగయొడ్డున బావిలో ♦ క్షారజలము
గలుగుఁ దఱచుగ నట్లురా ♦ గంబునకును
గారణంబు కృతజ్ఞత ♦ కాకయుండు.

అదిగాక రాగమనునది హృదయప్రకృతులఁబట్టి యుండునంటి నిగాని యది నీకుఁ దక్కువయని విచారించువాఁడను గాను. చెన్నఁగికొబ్బెరకాయలోఁ గడుపు గిట్టున నిండఁదగిన మధుర జలముండును. సామాన్యజాతికాయలోఁ దక్కువయుండును. దయ్యపుఁగొబ్బెరకాయలో మొదలే యుండదు.

సర—ఉండఁదగిన దెంతయో యున్నది. అది నీయధీనమే యయినది. కాని యాఁడుదానిని వలచినట్లుగా నీవలె మగవానిని వలచు నంతటి రాగరసము నాకు లేకపోయినఁ బోనిమ్ము.

కళా—నీవు సంపూర్తిగా మగవాఁడనని చెప్పఁగలవా?

సర—(తనలో) సంపూర్తిగాఁ గాదుకదా! రవంతయైన మగవాఁడనని చెప్పఁగలనా!

కళా— గీ. కుండబంతిలాగు ఫిరంగి ♦ గుండు నాడియ
వేగ మెదురేగు వీరాగ్రి ♦ వీరునకును
గాతరత యింతో యంతయొ ♦ కలదు; పిఱికి
పందయును ధైర్యలేశంబు ♦ చెందియుండు,
నింట దాతకుఁ గృపణత ♦ యీవిపైని,
నెంతపిసిఁడియుఁ బిడికిలి ♦ విడుచుఁ గొంత,
ప్రబలబుద్ధికిఁ గొనవెఱ్ఱి ♦ బాంధవంబు,
పిచ్చికేకలందును జ్ఞాన ♦ విభవము కలదు;
అట్టి మగవానిలో నైన ♦ నాఁడుఁదనము

కొలఁదిగనో గొప్పగనో లోనఁ ♦ గలదనుమ్ము.
మానవతిలోన నైనను ♦ మగతనంబు
తులమొ యరతులమొ పలమొ ♦ గలదనుమ్ము.
పూర్ణపురుషపురంధ్రులీ ♦ భువిని లేరు;
సృష్టిజీవాళి యర్ధనా ♦ రీశ్వరంబు;
అమరుగలిపెడువేళ నే ♦ యంశ మధిక
మగునో దానిచే భేదమౌ ♦ వ్యక్తులయ్యె;
అస్మదీయతత్త్వస్థమౌ ♦ నాఁడుఁదనము
నన్ను నీవైపునకుఁ ద్రోచు ♦ చున్నదేమొ?
యుష్మదీయతత్త్వస్థమౌ ♦ నువిదతనము
నన్ను నీసన్నిధికి లాగు ♦ చున్నదేమొ?

నర—కళాలలితా! సృష్టివిషయకమైన నీవిచిత్రాభిప్రాయము ననుసరించి నేను నీభార్య నగుదును గాఁబోలు నేమి?

కళా—అంతమాట యెందులకులే. నీవు నాకు భర్తవు. నాకంతవఱకుఁ జాలు. గోవర్ధనా! వివాహ మాడినఁగాని రాజ్యమును స్వీకరింపక ప్రతినపూనె దాని నేలింపుము. కన్యాన్వేషణప్రయత్నమున నెంతయో విసుగుఁ జెందియుంటిని. నేను జూచిన వధువు లెవ్వరును నాకు నచ్చియుండలేదు. తుట్టతుదకు నా యనురాగమున కింతకు నాస్పదమైన నీవు నాకు లభించితివి. ఘటన యెట్లున్నదో చూడుము.

నర—[illegible] మహానందము [illegible] నోయితి ననికదా నీకింత విచారము?

కళా—విచార మొంతమాత్రము లేదు సుమా. నేనే పూర్ణముగా నాఁడుదాన నైనయెడల నింతకంటె నెంత సొగసుగ నుండునో

యని యనుకొనుచున్నాను.

పర—(తనలో) హా! నీ వాఁడుదాన వగునెడల నాబ్రిదు కింకేమైన నున్నదా! ఆసాగ నేదో యనుగనక్కఱలేదు.

గీ. బోసిదగునోటిలో గారె ♦ ముక్కయేల
తీఁగె యూతకు వేఱొక్క ♦ తీఁగయేల
లొట్టకంటికిఁ జూపుడు ♦ గొట్టమేల
రమణి రమణితోఁ దార్చు దా ♦ ర్భాగ్యమేల?

(ప్రకా) కళాలలితా! నీ వాఁడుదానవగునెడల నెంతసొగసుగ నుండునో యని యంటివి. ఆసాగనేదో నాకు బోధపడలేదు. నీవు నాకంటె కాఁగినమగవాఁడవు కావున నేను నిన్నింతగాఁ బ్రేమించితిని గాని నీవాఁడుదాన వగునెడల నీమొగమువైపు చూతునో లేదో? నీవు నా కక్కఱకే రావేమో? ఆసంగతి నీకెట్లు తెలియును?

కళా—అయ్యో! అటులైన వలదుసుమా! అది మహాకష్టముకాదా. పోనీ నీవే స్త్రీవి కమ్ము. ఊఁ.

పర—ఒకవేళ మాటవరుసకు నేను స్త్రీ నయ్యెద ననుకొనుము. నీవు నన్నింతగాఢముగా వలతువా?

కళా—నిజముగా నా కెట్లైనను సరియేసుమా. మాటవరుసకే యక్కఱలేదు. మగవాఁడు ప్రయత్నించిన యెడల నిజముగా మగువ కాఁగలఁడు. మహామహిమసంపన్నమైన మనస్సున కసాధ్యమైనపని లేదు. పురుషుఁడు ప్రయత్నమున స్త్రీ కావచ్చును. పొలఁతియుఁ బురుషుఁ డట్లే కావచ్చును.

గీ. కత్తి విడిచిపెట్టి ♦ గరిటను జేపట్టి
గోనెసంచివెనుకఁ ♦ గూరుచుండి

చేతఁ గలమువూని ♦ చెవికి దుద్దులు పూని
యోరచూపు లోలికి ♦ యొదిఁగి కులికి
కనుల సన్నసైన ♦ కాటుకఁ దీరిచి
దంతములను గప్పు ♦ సంతరించి
బుగ్గలందుఁ బచ్చ ♦ బొట్టును బొడిపించి
కుత్తికంటు నాను ♦ క్రోవిఁ గూర్చి
అవిఁ దోడిగి గాగ ♦ రాను సింగారించి
సరిగయంచు పైటఁ ♦ జాఱనిచ్చి
కిసుకు కిసుకు మనుచు ♦ గిలుకు గిల్కుంచును
నట్టె యిట్టె త్రిప్పు ♦ లాడుకొనుచు
పురుషుమొగముఁ గనక ♦ పొలఁతులతోడనే
గవ్వలనుచు గచ్చ ♦ కాయ లనుచు
నాటలాడుకొనుచు ♦ నాడంగిమాటలఁ
జీర ఆవిక సొగసు ♦ చెప్పుకొనుచు
నాఁడుదాననసుచు ♦ మూఁడేండ్లు గడపినఁ
వొలుత నున్న వ్యక్తి ♦ తుడిచిపెట్టి
నలువతలలు వంగ ♦ నరుఁడు సమర్తాడు
జనుల మానసములు ♦ సంచలింప.

సర — నే నాఁడుదాన నగుటకొఱకు ప్రపంచమున నున్న లింగభేద మేల వ్యత్యస్తము కావలయును? సృష్టి యేల తలక్రిందైన ట్లుండవలెను? మొగము మార్చుకొని బ్రహ్మ యేల పరితపింపవలయును? నాకు జ్ఞానము వచ్చినది మొదలు నన్ను నే నెఱిఁగిన క్లైత్తిఁగియున్న నావంటి దొకతె యున్నది. దానిని నీకర్పింతును. మాటలాడక స్వీకరింపుము.

కళా—నీవంటి దనగా నాకు బోధపడలేదు. వంటి యనునది పనికి రాదు.

ఆ. వె. ముద్దుటుంగరాల ♦ మురిపంపుమొకమాలు
నల్లకుచ్చు లివియె ♦ నాకు వలయు,
నెంతొమెత్తుగాని ♦ మెత్తు తక్కువకాని
నడిమిఫలక మిదియె ♦ నాకు వలయు,
నగముసిడుచు చెట్టు ♦ సంపంగి యిదె ముకు
రంవుఁగొనలఁ బ్రతిఫ ♦ లింపవలయుఁ,
బాలముంజె దొండ ♦ పండు మధ్యమున నీ
నొక్కులోన మనసు ♦ చిక్కవలయు,
కిళల దిశలఁ జిమ్ము ♦ కాటుకపిట్టల
మూకభాష యిదియె ♦ నాకు వలయుఁ,
గువలయేశుచుట్టు ♦ గుడికట్టు కార నా
నందబంధనంబు ♦ నాకు వలయు,
నేది నీయందు నీవని ♦ యెన్నఁబడునొ
యదియె నాకుఁ గావలసిన ♦ యది సతంబు
దానివంటిది యదికాదు ♦ గాన వలను
నీవె మఱి నీవె మఱి మఱి ♦ నీవె వలయు.

సర—హా! అటులైన నావంటిదే నేనైనప్పుడు చూచుకొనవచ్చుఁ గాని అంతవఱకు నన్నే సంపూర్ణకాంతగా భావించి—

కళా—ఇది నీవు మనస్ఫూర్తిగా ననినమాటయేనా?

సర—సర్వవిధముల నామనస్సు నీయధీనమై యున్నది. కావున నాసంగతి నన్నడుగనేల?

కళా—అటులైన నిన్నుఁ బ్రేయసీ! ప్రాణప్రియా! యనిపిలువవచ్చునా?

సర—(మందహాసముఁ జేయును.)

కళా—అదిగో నవ్వుచున్నావు. సాధారణముగా నాటకములలో నాయకుఁడు నాయికాపాత్రమైన మగవానిని బ్రియసీ యనిపిలుచుటకు వెగటుపడును. వానివంటివాఁడేమైన తన్నుఁ బ్రియసీ యని పిల్చుచున్నాఁడని (స్త్రీ)పాత్రము సిగ్గుపడి కొంచెముగా నవ్వుకొనును. నీవుకూడ నట్లే నవ్వుచున్నావు. నామాటలట్టి మాయమాటలా ? నాబ్రదుకంత యనుకరణపుబ్రదుకనుకొంటివా ? కోఁతి కృష్ణవేష మభినయించినట్లే యనుకొంటివా ?

ఆ. వె. నాటకంపుఁదెరలఁ ♦ దాఁటి మందాకుంపుఁ
దెరచాటుమాటు ♦ తెరల దాఁటి
నీరుబుగ్గయైన ♦ నీలంపుఁదెర దాఁటి
తెరలు లేనిచోటఁ ♦ దెలుపిచోట
నాకసమున కెల్ల ♦ నాకాశ మగుచును
దివ్యదీప్తితోడఁ ♦ దేజరిల్లి
పైని లోన నేను ♦ వ్యత్యాస మొందక
రాగమొప్పు సత్య ♦ రాశియగుచు.

నాదట్టి పరిశుద్ధరాగ మని నే ననువాఁడను గాను జుమీ ! కాని,

ఆ. వె. తనువుకాంతి కాగి ♦ తంపుఁబొట్లములోది
డాలుకత్తి నూనె ♦ డబ్బతునుక
కోఁతిమైల గొఱ్ఱె ♦ గోడు మీసపుఁబస
కాకిరేకుతళుకు ♦ గద్దడాబు
నొసట వెక్కిరింపు ♦ నోటిపై నిగిలింపు
మనసునందు డొలక ♦ కనుల సలక

ఒడల మాయవేఁడి ♦ దుడుకుఁ జెందనినాఁడి
లోన భావనయ్య ♦ పైనఁ బ్రభుఁడు
నగు పాలుళిక్కిరాజ ♦ నని నవ్వినావేమొ
అట్టిట్టోపి ఫ్రాస ♦ కుట్టుబొంతఁ
బూని ప్రీతపార ♦ ముల వెన్క నందీయ
నప్పఁజెప్పు దాస ♦ రయ్యగాను.

సర—(తనలో) ప్రాణనాథా! నీవెంత సుకుమారహృదయుఁడవు. రవంత నవ్వితినని యెంత నొచ్చుకున్నావు. నీప్రేమరసము సముద్రమువలె లోఁతు దెలియనిదై యున్నది. ఎక్కడను మిథ్యాలేశమైనఁ బనికిరాని నీకు, లోన వెనుక దోఁపుడులంగా కట్టుపైనఁ బట్టులాగుగల వ్యక్తి స్ఫురించినది. నాథా! నీవు నట కుఁడవని నే నంటినని నీవిబ్బందిపడుచున్నావా? ఆమాత్రపు టౌచిత్యమున్నదాన నైనయెడల నాకీదురవస్థ యేల? నేను నట కాధమను; పూలతురాయి యుండవలసిన తలపై నీదిక్కు మాలినపాగఁ బూని యెండకన్నెఱిఁగి యుండఁదగని నేను బర పురుషుని యెదుటఁబడి శృంగారకథాకలాపమును వినిపించు చున్నాను. మగపోషాకులు తెచ్చుకొని సిగ్గు మన్ను జేసి పురు షపాత్రాభినయ మొనర్చుచున్నాను. పోనీ! యింతటితో దీనిన యెడలఁ బాడులోకముతోఁడిదే యనుకొందును. ఈతెయిత క్కులలో నన్నుఁ "గాంతగానే భావింపవలసినది. పురుషస్వ రూపము మిథ్య" యని స్పష్టముగా నేను వినిపింపవలసివచ్చి నది. ఉత్తమస్థితి పోయినది. నటకాధమస్థితిని బడితిని. అం దులో నైన ఘనత లేకుండ నటకు లందఱచేఁ జీ యనిపించు కొనఁదగిన యీపనిఁ జేసితిని. ఎందుకొఱకు? ప్రాణనాథా!

నీకొఱకు; నీకొఱకు; మెడలో గవ్వఁ గట్టించుకొని వీథిని బడిన కాకిని గాకులన్నియుఁ జేరి పొడుచును. రామరామ యని యననేర్చి యడవినిబడిన చిలుకమెడను బావురుపిల్లికంటె వేగముగాఁ జిలుకలే గొఱికివేయును. పడుచుపెండ్లామును దనవెంటఁదిప్పుకొనుచున్న ముసఁడుకాళ్లభర్త కూరివారిలో వరాకు మాడవం తన్నలు మిగిలినవం తల్లురు. పిల్లలు కోఁతికొఱకు ముష్టివానిని వెంబడించిన ట్లాతనివెంటఁ బడుచు వారు తిరుగుదురు. లోకమున సామాన్యముగా నిట్లు జరుగుచుండగా నాఁడుది పురుషవేషమున దేశమునఁ బడినసంగతి లోకమునకుఁ దెలిసినయెడల నింకేమైన నున్నదా? కావునఁ బురుషవేషమును దీసినఁగాని నాకు సౌఖ్యము లభించునట్లు తోఁపదు. కాని యొక పెద్దచిక్కు. ఈతనిహృదయ మాత్మతత్త్వమువలె నగాధమై యజ్ఞాతమై యున్నది. ఇతని కెక్కుడను మాయ మర్మము పనికిరానట్లు కనఁబడుచున్నది. రవంత సవ్వడినయినయెంతో యిబ్బందిపడినాఁడు. రాగతత్త్వమును నిర్ణయించునప్పు డేదో బట్టబయలని యాకాశమని పదో యర్థము స్పష్టముకాని మాటల నాడినాఁడు. నేను స్త్రీనని స్పష్టముగాఁ జెప్పి స్త్రీరూపమున సీతనియెదుటఁ బడినయెడల "నీ వెంతదూరమునుండి యిక్కడికి వచ్చితివో నాకు నీ వక్కఱలేద" ని నిరాకరించునెడలఁ బ్రాణములు నిలువవని విడువవలసివచ్చును. కావున నల పుష్యము పుసుంచువలె నెంతకష్టమైనను రవంత పాత్రదెక్కి నయెడల నంతయు జెప్పపాటులో మాయమగును. ఆతనిప్రేమ మెంతపొడుగుగ సాఁగినను రవంత వేఁడి యున్నంతసేపే యా సాఁగుడుగాని యది కొంత తగ్గినవెంటనే లక్కతీఁగవలె నెక్కు

డికక్కుడికే ముక్కలగును. అశ్వరోగవు రాకయుఁ బురుష రాగవుఁ బోకయు నెఱిఁగినవాఁ డెవ్వఁడు? అందులో నీతని వొక వింతతత్త్వమువలెఁ గానఁబడుచున్నది.

కళా—ఏమో యాలోచించుచున్నావు?

సర—ఔను. ఆలోచించుచునే యున్నాను. నీకుఁ బ్రేయసినగు నే నాఁడుదానిచర్య కనుగుణముగ రవంత నవ్వినందులకు నీవింత నొచ్చుకొనుట కేమికారణమో యని యోజించుచున్నాను. నాకు నవ్వువచ్చుటకుఁ గారణమున్నది కాని లేకపోలేదు. నేను నాయీడువ్యక్తితో నొకప్పుడు బొమ్మరింటను గూరుచుండి మిగుల బాల్యమున మగఁడు పెండ్లమాట లాడుచుండగా నీవి ప్పుడు నన్నుఁ బ్రేయసీ యని పిలిచినట్లే నామిత్రియు నన్నుఁ బ్రేయసీ యని పిలిచెను. నీపిలుపువలన నీపూర్వవృత్తాంతము జ్ఞప్తికి వచ్చినది. నాబ్రదుకున కెల్లప్పుడు ప్రేయసితనమే కాఁ బోలు నని భగవంతుఁడు నన్నిందులకే పుట్టించినాఁడు కాఁబో లు నని నాకు నవ్వువచ్చినది.

కళా—అంతేకద! ప్రియురాలా! నీమాటనుబట్టి చూచి యజ్ఞబాలురే గాథామాత్రముగ ప్రేయసీ యని పిలిచినప్పుడు నే నూరకుం డఁగలనా? రూపమున కనుగుణముగు నీకంఠరవమో? ఆహా! నీమాటలే మధురమైన గానమువలె నున్నవిగదా! ఇఁక నీగాన మెట్లులుండునో? నేను నీగానమును విని పరవశుఁడగు మహా భాగ్యము నెన్నఁడైనఁ గలుగఁజేసెదవా?

సర—పోనిమ్ము. ఇప్పుడు గానప్రశంస యేల?

కళా—ఇప్పుడే కావలసినది.

గీ. భోగయుతులకు ద్రవిణమే • పూజ్యతమము
యోగయుతులకు సాధన • ముత్తమంబు
రోగయుతులకు నౌషధమే • రోగహరము
రాగయుతులకు గానమే • రంజకంబు.

కావున గోవర్ధనా! ఒక్కపద మేదైనఁ బాడి పేరిమలత కసాధారణదోహదముఁ జేసి పుణ్యముఁ గట్టుకొందువా?

సర—నామాటలను బట్టియే నేను బాడఁగలనని మీరు గ్రహించుట తగునా?

కళా—నీకంఠరవము మహామధురముగా నున్నది. నాదేమును జూచుటక్కై తలపైఁ బెట్టి బొట్టనవేలితోఁ బైకి మీటిన బంగారు నాణె మెట్టినాద మిచ్చునో యంతకంటెఁ గంగును రంగునుగలదై యున్నది. నీవు పాడలేకపోవుట యేమి? సామాన్యముగా-

గీ. భుక్తిదములైన పనసలుండె • [illegible]
రక్తిదములైన కళలుండె • [illegible]
భోజనాదిసంపూర్తియే • పురుషుసొమ్ము
పానకమువంటి పాటయే • భామసొమ్ము.

సర—అది స్త్రీజనసామాన్యమునకు వర్తింపవలసినమాటకాని నాకెట్లు వర్తించును?

కళా—ఓహో! అదియా? ఇదిగో చెప్పుచున్నాను.

ఆ. వె. వేలుచెప్పులవాఁడు • విపులాయువగువాఁడు
[illegible]నోటివాఁడు • [illegible]
స్ఫుటతరంపు[illegible] • [illegible]వాఁడు నాయకుం
[illegible]ముక్కువాఁడు • హీనబుద్ధి.

సర—(గొంతుక తడుముకొని) నాముదిరిక సత్య మడుగనక్కఱలేదు.

ఐనను నాగొంతుముడిమాత్రి మేమంతయెత్తుగా నున్నది ?

కళా—అంతకన్న నెత్తైవి యుండవచ్చునులే. దయయుంచి ఏదీ ! మామిడిచిగురువగరున జీరవదలిన కంఠముతోఁ గోకిలమువలె నేదీ ? ఒక్కపదమునకు రెండుపదములఁ బట్టుకొందును. (కాళ్లు లంటఁబోవును.)

సర—వలదు వలదు. చేతనైనట్లు పాడెదను.

బేహాగ్—ఆది.

నాలో నెరియులేదు, నీలోన నున్నది
లాలింపవేల ? దయాలవాల॥ నాలో॥
నాలోపములన్ని చాలఁగ మన్నించి
నీలోకిఁ దీసికొమ్మా, జాలమేల॥ నాలో॥
వేఁడుచఁగలదెవి, వేణువు నూఁదెదు
జాణతనము నీదిరా ప్రాణనాథ॥ నాలో॥
కలువనుగలదెవి, కలువనవ్వించెదు
గిలిగింతయది, నీదిరా ప్రాణకాంత॥ నాలో॥

కళా— గీ. జాజిపూవులవాసనల్ ♦ సంతరించి
వండువెన్నెలశైత్యసం ♦ పద హరించి
చిన్నిపూఁదేనె సోఁకువుల్ ♦ స్వీకరించి
మదిని గదలించె నేమంద ♦ మారుతంబొ ?

గోవర్ధనా ! అమృతప్రవాహమట్లు పాడుచుంటివి !

సర—పాడుచుండుటలేదు- మౌనినైచితిని.

కళా—నిజముగా మౌనివైచితివా ? అదిగో! ఇంక వినఁబడుచున్నదే.

గీ. బట్టుకొంగున నత్తరు ♦ వలపువలెను
గాలియదఁగినసీటిలోఁ ♦ గరఁగుపటు

సవితగ్రుంకినసంజకెం ♦ జాయలీల
నీడుగీతము గాలిలో ♦ నిల్పి మొఱసె.

ఆహా! గోవర్ధనా! జగతి గానమయ మని తోఁచుచున్నది సుమా!

గీ. భావనాదూర మగుపర ♦ బ్రహ్మమందు
బహువిచిత్రింపుఁబ్రణవరా ♦ వము జనించెఁ
బ్రణవమున లక్ష స్వరము లు ♦ ద్భవములయ్యె
స్వరమునకుఁ గోటి శ్రుతులైన ♦ సంభవించెఁ
గైశికీకాకలీముఖ ♦ గతివిభేద
కోటులంతటఁ బ్రస్తార ♦ పాటవమునఁ
బంచభూతమనోముఖ ♦ స్వరవిభేద
భాగసంగతి రాగముల్ ♦ ప్రభవమందె.
రాగములెసుమ్ము సృష్టిలోఁ ♦ బ్రాణులన్ని;
షాడవపుటౌడవపుషాడ ♦ వౌడవంపు
భేదములకంటె శతకోటి ♦ భేదగతుల
కారణమున నెన్నియొ మేళ ♦ కర్తలయ్యె
మారరంజని కనకాంగి ♦ కీరవాణి
నంటి డెబ్బదిరెండు రూ ♦ పముల దాఁటి
కమఠ సింహాదిజనకరా ♦ గంబు లయ్యె
నెన్నియో! జన్యములలెక్క ♦ యెన్నఁదరమె?
భైరవికి మేఘరంజి దే ♦ వక్రియ యగు
రంజియును భార్యలయి కాఁపు ♦ రంబు గూర్చు
పోల్కి స్త్రీరాగకోటికిఁ ♦ బురుషరాగ
వితతి భర్తృత్వమును గాంచి ♦ వృద్ధిఁ జెందు;

గానమున కెల్లఁ దాళము ♦ ప్రాణమగును
దాళగతి స్వభావము ప్రాణి ♦ తతికి నెల్ల
నడచుటందును నూఁపిరి ♦ విడుచుటందు
నాడియందున లయగతి ♦ కూడియుండు,
నుసియు దెబ్బనుబట్టి యీ ♦ యుర్వి తిరుగు
గ్రహగతులు తాళగతిపరి ♦ భ్రాజితములు
కాలచక్రంబు తద్గతినో ♦ చ్ఛాలితంబు
గాన నీసృష్టి పరమాత్ము ♦ గానఫణితి.

గోవర్ధనా ! నేను జెప్పినది నీమనస్సున కేమైన నెక్కినదా ?

సర—ఎక్కకేమి? నీవు కళాలలిత రాగమవు. నేను గోవర్ధన రాగమను. నాది యేకతాళము- నీది త్రిపుటతాళము.

కళా—నామాటలు నీకు నచ్చలేదు కాఁబోలు !

సర—తెలియఁదగనిదానిని గూర్చి చెప్పినమాటలు నచ్చకపోవుటలో వింతయేమి ? దారితెన్ను లేనిసంగతి కావున నెవనికిఁ దోఁచి నట్లువాఁడు చెప్పును. నీవు గానప్రియుఁడవై యుండుటచేతఁ గాఁబోలు నీవు సృష్టి గానమంటివి. కవియగువాఁడు జగతి యంతయుఁ గవితామయమని చెప్పును. మాదిగవాఁడు ప్రపంచమంతయుఁ బరమాత్మ చేసిన పాదరక్షయని చెప్పును. వ్రేళ్ళ యుంగరములే సూర్యచంద్రులు. పైతగరపుపిసరులే నక్షత్రములు. నడిమియంతరమే గోదసీకుహరము. ఎక్కడికక్కడికే సరిపోవును.

కళా—నీవు చెప్పినదికూడఁ గొంతనిజమే కాని నీయభిప్రాయమేమో చెప్పెదవా ?

సర—సృష్టియంతయు స్త్రీమయము. పురుషుఁడొక్కడును లేఁడు.

ఇది నాయభిప్రాయము.

కళా—పరాత్పరుఁడైనఁ బురుషుఁడు గాఁడా ?

సర—కాఁడు. అందఱును స్త్రీలే.

కళా—ఏలాగున ?

సర—స్త్రీలపై వలపుగలవారు స్త్రీలకు వశులగుటచే స్త్రీలు; స్త్రీల వలపెఱుఁగనివారు స్త్రీల కక్కఱకు రాకపోవుటచేత స్త్రీలు.

కళా—ప్రపంచమంతయు స్త్రీమయమైన మన కేమిలాభము ? నేను స్త్రీనైన మనకు లాభము. నీవు స్త్రీవైన మనకు లాభము. గోవర్ధనా! నిజముగా నీమో మింతలావణ్యవంతమైయుండుట కేమికారణము ?

సర—సముద్రసంబంధముచేత.

కళా—కప్పదాఁటులు నైచెవవేల ?

సర—అదియు నందుచేతనే.

కళా—ఇంతసేపటినుండియు నీమోమువంకఁ దేఱిపాఱఁ జూచుటకుఁ బ్రయత్నించుచున్నాను. చూపు నిలువఁబడదే. అడఁచినకొలఁదిఁ జూపు చెల్లచెదరై పోవుచున్నది. ఎందువలన ?

సర—అది నీచూపులతారళ్యమహిమ గాని నామోములావణ్యమహిమ కాదు.

కళా—ఓస్ ! గడుసుదానవు. ఆమాత్ర మెఱుఁగకపోలేదు.

క్రొవ్వరాటకు నెగఁబ్రాకు ♦ కోఁతివలెను
గాజుతలుపునఁబడు మంచు ♦ కణికవలెను
వడఁకుతలను బెట్టిన నిమ్మ ♦ పండువోలె
నీదుమోమున నాదృష్టి ♦ నిలువదేల ?

సూర్యునైన నిట్టి ♦ చూడంగవచ్చును
జుక్కఁగ్రోడి నైనఁ ♦ జూడవచ్చు
గాంతి ప్రతిఫలించు ♦ కలఁగునీటిని జూడ
నౌను నీదుమోము ♦ గానరాదు.

సర—కానరానప్పుడు కష్టపడి కాంచుటయేల ?

కళా—దర్శనీయమైనవస్తువును జూడనివాఁడు ధన్యుఁ డెట్లగును ? కన్నులుండిన వాఁడెట్లు కాఁగలఁడు ?

ఆ. వె. నుదురు చూడఁబోయి ♦ నుదిటికంటెను ముక్కు
సొగసటంచు దానిఁ ♦ జూడఁ దివుర
సోగకనులు నాదు ♦ చూపుఁ గట్టిగ నీడ్చి
విఱిచి చెక్కులందు ♦ విసరివైచె.
ఎన్నొపూలనడుమ ♦ నేదియుఁ గ్రోలఁగ
స్థిరతలేక మొఱయు ♦ తేటవోలె
ఇన్నిసొగసులున్న ♦ నెదియును గనలేక
విలవిలంచుఁ జూపు ♦ నిలిచిపోయె.

ఇంతకష్టపడి యేల చూడవలయునంటివే !

ఆ. వె. చూడఁదగనిదాని ♦ జూచుమోదముకంటెఁ
జూడఁదగినదాని ♦ జూడలేని
జాలి మేలుగద ! ము ♦ సలిదాని 'ఊఁ'కంటె
చిన్నికులుకులాఁడి ♦ 'చీ' పసందు.

సర—(తనలో) అద్ది ! నానాథుఁ డక్కఱకువచ్చు శృంగారపుదారిలోఁ బడుచున్నట్లున్నది. నేను గాంతనని కొంత స్పష్టపడుచున్న ట్లున్నది. ఇదివఱకున్న యాకాశపురాణపుమాటలకు నిప్పటి యబలానురాగపుమాటలకుఁ గొంత భేదమున్న ట్లగపడుచు

న్నది. నాకు మగవాఁడైన సరే యాఁడుది యైనసరే యనెడి వాని కిప్పుడు చిన్నికుఱ్ఱకులాఁడి చీకొట్టుటలు కావలసివచ్చి నట్లు కనఁబడుచున్నది. ఇతఁడు తెలివిగలవాఁడు. యోగ్యుఁడు. గంభీరానురాగము గలవాఁడనుట స్పష్టము. కేవల ధారా శాంతఃకరణము గలవాఁ డగుటచే మాయామర్మగ్రాహమునఁ గొంత యసమర్థుఁడు. ఎన్నిమడతలలోఁ బెట్టి దాఁచి పెట్టెల లోఁ బెట్టినను మొగలిపూవుపరిమళము పైకి రాకుండ నడఁప నగునా? మొద్దుబొంతచే నాఁడుదానియొడలినీటు మాటుసేయ వచ్చును గాని కంటిపోటెట్లు గ్రమ్మనచ్చును. అట్టి నాయాఁడుఁ దనము నానాథు నావరించి నీరు కచ్చికలోని కెక్కిన ట్లెక్కు చున్నది. ఇది మందికే నచ్చినదో చెట్టకే వచ్చినదో యెట్లు తెలియవచ్చును? (ప్రకా) కళాలలితా! ఈగొడవయేల మఱి యేమైనఁ జెప్పరాదా?

కళా—నీకంఠరవము నీవదనకాంతియే నన్ను మిగులఁ దహదహలాడిం చుచున్నవి. అవి మగవాని కున్నట్లులేవు.

సర—అవి యీవేళనే లేవా! నీవు నన్ను జూచునప్పటికే లేవా!

కళా—మొదటినుండియు నాకుఁ దెలియలేదు. మందబుద్ధినైన నాకిప్ప టికిఁ దెలిసిన దనుకొనుచున్నాను.

ఆ. వె. వింటియల్లెత్రాడు♦వంటిది మగగొంతు
వీణతీఁగ సుమ్ము ♦ వెలఁదిగొంతు
వనజనేత్రిగొంతు ♦ బంగారు గంటయా
బొంగులు మనెకిఁబోడుగు ♦ పురుషుగొంతు
బ్రహ్మహీరకాంతి ♦ రమణీముఖచ్ఛవి
స్ఫటికకాంతి పురుష♦వదనశోభ

యెఱ్ఱ పురుషవక్త్రి ♦ మెట్టగన్నెరుపువ్వ
లలన మొగవుఱిగి గు♦లాబిపువ్వ ;
తులము మల్లెలోనఁ ♦ గలిగిన మృదులత
నందివర్ధనంబు ♦ నందుగలదె ?
కడిమిపువ్వులోనఁ ♦ గల విచిత్రద్యుతి
కదళి పుష్పమందుఁ ♦ గనఁగఁదగునె?
సొగసులన్ని మించి ♦ సొగసుల కోటీర
మైనతళుకు తళుకు♦లోని తళుకు
మొలకకులుకులొలుకు ♦ కలకల కలదందు
నాఁడుదాని మొగమె ♦ యాఁడుమొగము.

సర—కళాలలితా ! ఒకయొకటె యొకటియను నట్లు లెక్కమప్పఁ జెప్పితి వేమి ?

కళా—అంతకంటెఁ జెప్పుటకు నావలనఁగానవ్వు డేమిచేయవలసినది ?

సర—చెప్పుమని యెవరు నిన్నుఁ దొందరచేసినారు ?

కళా—ఇదివఱకే చెప్పవలసియుండఁగ నిప్పుడు చెప్పుటకూడఁ దొందరయగునా ? చీఁకటిలోనైన వృషభము గోవు నిట్టె గ్రహింపఁ గలదుగదా ! పద్మముకుళము:లోఁ బడియున్నను భృంగిని దెలిసి కొని యాపుష్పముచుట్టు భృంగము దిరుగుచు మొఱబెట్టునే. ఆమాత్రమైన సేమ జేయలేకపోయితినే ! పసికున్నపన నాకనుల ల లేకపోయెనే ! ఈకన్నులతో నాకేమిప్రయోజనము ? మన్మ థుఁడు గ్రుడ్డివాఁడని యందురు. అది యసత్యము. అతఁడు సహస్రాక్షుఁడు. పాపమాపుణ్యాత్ముఁడు నన్నుఁ దగినచోటనే చేర్చినాఁడు. నేనే యింతవఱకు గ్రుడ్డివాఁడనై తినికాఁబోలు అవిగో చెవులకుఁగుట్లు ! అడ్డబాసరంధ్రమదిగో ! గోవర్ధనా !

నిజముగా నీవు నావంటి మగవాఁడవు గావుగద! అవిగో చెక్కు
లెఱుపెక్కుచున్నవి. కావు. మగవాఁడవు కావు. మగవాఁడవు
కానప్పు డింక నాఁడుదానవు కాక యేమగుదువు?

నర—(తనలో) ఆఁడుదాననగుదునుగదా యని తాత్కాలికముగా నుబ
లాటపడుచున్నాఁడు. కాని యాఁడుదాననే యని స్పష్టముగాఁ
దెలిసికొని శాంతిపడినపిమ్మట మాత్రము నన్నుఁ జూచి వెగటు
పడునని నాకు భయముగానున్నది. రామపురరాజు కూఁతు
రేమి! మగవేసమేమి? దేశాటనమేమి? సముద్రయానమేమి?
ఈచర్య మగవాఁడు మెచ్చఁదగినదే నాకు? కావున స్త్రీననియొప్పు
కొనను. ఎప్పుడైన నెక్కడనైన స్త్రీరూపమున నీతనిఁ జూచి
వరింపఁబడుదును. ఇప్పుడుమాత్ర మట్టితొందర పనికిరాదు.

కళా—ఆఁడుదానవేకద! ఆఁడుదానవేకద! మొగమెత్తి నావంక నొ
క్కసారి చూడుము.

నర—ఏల చూడవలయును?

కళా—ఆఁడుదానవేకద! ఒక్కసారి గట్టిగఁ గౌఁగిలించుకొననిచ్చెదవా!
ఏదీ? (మీఁదికి రాఁబోవును.)

నర—ఆఁగు. స్నేహధర్మము ననుసరించి పరిహాసార్థముగాఁ బ్రియసీ
యని పిలువనిచ్చితిని. నవ్వులాటగా నారంభమైన దింతవఱకు
ముదిరినదా? కళాలలితా! యిఁకఁజాలు; నాకుఁ దల నొచ్చుచు
న్నది. నేనుబోయి పండుకొనెదను. (లోనికిఁబోవును.)

కళా—అయ్యయ్యో! ఇది యేమిమర్మము! మగవాఁడే కాఁబోలు. నేను
దీసికొనిన చనవునకే కోపము గలిగి లేచిపోయినాఁడు. మగవా
నిని బట్టుకొని యాఁడుదానివని ముట్టిమ్మనఁగ నెట్టిపురు
షునకైన నెట్టిమిత్రునకైనఁ గోపము రాదా? అయ్యయ్యో!

ఎంతబుద్ధిలేమి సిద్ధించెను ! మగవాఁడే కాఁబోలు. ఆఁడుదని యింతభ్రమసితినేల ? అయ్యయ్యో ! చెవికుట్లుచూచి యడ్డబొ సరంభ్రముఁ జూచి యాఁడుదని నిశ్చయింపవచ్చునా ? ఆఁడు పిల్లలులేని దంపతులు తమ మగపిల్లలకు ముద్దుకొఱకట్లు నే యింపవచ్చును. పాపటఁజూచి యాఁడుదని గ్రహించునెడల నిప్పటిమగవారిలో నూటికిఁ దొంబదిమంది ఆవికకట్టుసరకు క్రిందికి రావలసినవారేకదా ! అయ్యయ్యో ! మొగపుఁబేడితన మాఁడుతనమగునా ? కంటి లేడితన మాఁడుతనమగునా ? ఎటు వచ్చినను గంఠరవము వదనలావణ్యము నన్నిడ్చి నేలఁగొట్టినవి. ఆఁడువానికిఁ దప్పనట్టి సౌభాగ్యము లుండవు. అందుచే నాతఁ డాఁడుదియేఁ కాఁగూడదా ? స్త్రీని గానని యాతఁడనునప్పు డంతకంటె నా కెక్కువదెలియునా ? స్త్రీనైయుండినయెడలఁ గోపించి పాఱిపోవు టెందులకో ? హా ! మగవానికేమి? సుధా మధురమైన యాకంఠమేమి ?—సుప్రసన్నమైన యాసోయగ మేమి ?—ఏమో—సత్యకాలపుటూహము !

గీ. ఖరనిభారావమైన యం • గనలు లేరొ
 కోకిలారవ పురుషులు • గూడ లేరొ ?
 పురుషులందున శీతాంశు • ముఖులు లేరొ
 ముదితలందు మృణ్మయపాత్ర • ముఖులు లేరొ ?

స్త్రీత్వపురుషత్వనిశ్చయమున కివిచాలవు. ఇచ్చట నెవ్వరులేరు గద? (అటునిటుఁ జూచి) ఎందుచేతనో కాని వక్షము నితంబము గూడ కొంత నెత్తుగానే కనఁబడినవి. ఆమాటలు గూడ నోరు జాఱినవిగావు. అదృష్టవంతుఁడను. ఇంతకంటె నప్రతిష్ఠయు న్నదా ! ఈమాట గోడదాఁటినయెడల నింతకంటె నగుఁబాటు

న్నదా! అయ్యో! ఎదుటఁబడిన వ్యక్తి యాఁడుదో మగదో తెలిసికొనలేని నేను బ్రపంచతత్త్వమును గూర్చి ముచ్చటించి యుంటినిగాఁబోలు. యథార్థముగా నాఁడుది కనఁబడినను మగవాఁడనియే యెంచి తలవంచుకొని దాఁటిపోవువాఁడే యీ దుష్టదినములలో నదృష్టవంతుఁడనుకొందును. ఈకాలమునఁ బై వేషములఁబట్టి యాఁడుదానిని నిర్ణయించుట మాత్రము బహుకష్టము. కొందఱకుఁ గంటికిజోళ్లు—కాలికిజోళ్లు—నెత్తికి టోపి—చేతిలోఁ గఱ్ఱ—మెడలో శ్రీరామరక్ష—మొలలోఁ బొడుముడబ్బి—నేను బొరపాటుపడుచున్నాను. గోవర్ధనుఁడు నిజముగా మగువకాని మగవాఁడు కాఁడు. అతఁడు మగవాఁడే యైనయెడల నాతనియందు నాకీవల పేలకలిగియుండును? నామనస్సే నాకు సాక్షి. అతఁ డాఁడుదికావుననే నామనస్సింత కరఁగిపోయినది. నాప్రేమము బీదలపై ననురాగమువలె నున్నదా? జనసామాన్యముపై నున్నసోదరానురాగమువలె నున్నదా? ఇట్టి మనోవికారము నే నెన్నఁడెఱుఁగను. ప్రేమించుట కాఁడుదని యెఱిఁగియుండవలయునన్నమాట యక్కఱలేదు. జ్ఞానమునకు సహజనైఖరికి సంబంధములేదు. సూదంటురాతికి సూదిని వాకర్షించుటలోఁ దెలివితోఁ బనియేమున్నది? పైమట్టమునుండి నీరు క్రిందికిఁ దెలిసియే దిగుచున్నదా? ఈమె యాఁడుదికాని మగవాఁడు కాఁడు. తగిన యవకాశమును జూచి మఱల వచ్చి యీమెననునయించి దయాపాత్రమనగుదును. ఇప్పుడేమియు మాటలాడక కోటకుఁ బోవుటకంటెఁ దగిన పనిలేదు. హా! గోవర్ధనీ! ప్రాణకాంతా! (నిష్క్రమించును.)

ఇది తృతీయాంకము.

శ్రీ రామా.




# చతుర్థాంకము.

సరస్వతి గదిలోఁ గూరుచుండును.

గదిప్రక్కను కళాలలితయు దాసి కురంగియుఁ బ్రవేశింతురు.

సర—ప్రాణకాంతా! కళాలలితా!

కురం—అమ్మా! కళాలలితా! ఇప్పు డాగదిలోనుండి వచ్చినమాటలు వింటివి కాదా!

కళా—'ప్రాణకాంతా! కళాలలితా!' యను నమృతమధురాక్షరములు వినఁబడినవి కాదా? ఆతఁడన్నమాటలేనా యివి?

కురం—సందేహమేమి? చూచితివా! పైకి బిఱ్ఱబిగియుచున్నాఁడు లోన మొఱ్ఱోయనుచున్నాఁడు. ఒక్కొక్కమగముండకొడుకున కిదే తెగులమ్మా. ప్రాణములు కటకటలాడించుచున్నాఁడమ్మా యమ్మ నుంచుకొనిన దేవాంగి సరిగ నిదేమాదిరి. వీధియరఁగుమీఁద గూరుచుండి లోపలి కెన్నిసారులు బతిమాలుకొనినను రాఁడు. ప్రాణములువిసిగి తుదకు లోనఁ దలుపువైచుకొనిన తరువాత విరహబాధచేత వీథియంతయుఁ బరవళ్లుద్రొక్కుచుఁ దెల్లవాఱువఱకు నొక్కటే యేడుపు. ఇదివఱకు నూఱుపర్యాయములయినను నీయాజ్ఞచే సతనియొద్దకుఁ బోయి నీ

మనస్సు నాతనికి బట్టబయలు చేసితి. ఎంతసేపటికి " నుహూఁ హూఁలే కాని ఊఁ " లేదే. ఇప్పు డొకఁడు గదిలోఁ గూరు చుండి 'పారిణకాంతా! కళాలలితా!' యని యఱచుచు న్నాఁడు. రమ్మన్నప్పుడు రాక తీవరింపేల? మంచముమీఁదఁ గూరుచుండి మదనతాపమేల?

సర—(తనలో) కళాలలితా! పారిణకాంతా! ప్రపంచమున నాకు నీవంటి యిష్టవస్తువు లేదు. నీకు నాపై నున్న యనురాగ మ సాధారణమని యెఱుఁగుదును కాని—

కురం—వింటివా? నీకొఱకు కేడ్చుచున్నట్లు స్పష్టమేనా?

కళా—కాని యనుచున్నాఁడు. కురంగీ! తరువాత నేమిచెప్పునోయని భయముగా నున్నది.

కురం—'కాని' యేమిరా నీమొగమని సాగఁదీసి దాడమీఁదఁ గొ ట్టినయెడల దేశోపకారమగును. దేవతలు మెత్తురు. నానెత్తు రు నావారపోసినాఁడు. ఇంకను—కానియఁట- చేఁను మేయు నుగాఁబోలు. గలిజేరువేరా? నేలవేమా! నిక్షేపములాగున నోటికివచ్చిన వెన్నముద్దను గుటుక్కున మ్రింగక-కానియఁట! బంగారుబొమ్మ ప్రక్కలోనికి సిద్ధమైనప్పుడు-నిర్భాగ్యత కాక పోయినయెడల-కాని కాని యని యేడ్చునేమి?

కళా—కురంగీ! నీ వాతని నేమియు ననకుము. ఆతని కేమియభ్యంత రమున్నదో?

కురం—ఆఁ! ఆఁ! బాగుగాఁ జెప్పితివి! నాకు స్ఫురించినదికాదుసుమా! పట్టెదద్దయ్యయేమో! ముందుగా నది తెలిసికోవలయును. పట్టె బట్టలగుమ్మటమేమో? ఈవైపులనే మనము పుట్టకముందొక పంగనామాలయ్య యుండువాఁడట. అతఁడు పెండ్లి యనఁగా

విషూచిరోగముకంటె నెక్కువగా జడియువాఁడఁట. ఏదో కొంతచదువుకొని యేకాకిగాఁ గాలక్షేపము చేయఁగా నితఁడు సిసిందిరీనిగ్రహము గలవాఁడని—

కళా—సిసిందిరీనిగ్రహము కాదు. ఇంద్రియనిగ్రహము.

కురం—అదే కాఁబోలు. ఊరివారందఱితని కొక చిన్నిచావడికట్టించి నెలకొకజాతర చేసి నైవేద్యాలు పెట్టించి చుట్టు రామభజనచేయుచు ద్రిప్పెదువారఁట. ఇంత మహాపురుషుఁడు లేఁడని దేశమంతయు మాఱుమ్రోఁగినది. తుద కతఁడు వట్టి అద్దిద్ది ముండకొడుకని మాయిక్కమ్మ కనిపట్టినది.

కళా—అబ్బా! పోనిమ్ము. ఈదిక్కుమాలినకథ లెందులకు?

కురం—కథ కాదమ్మా! నిజముగా జరిగినదే. జన్మ బ్రహ్మచారులలో నేమి పడుచుఁదనమున రెండవపెండ్లి వలదనువారిలో నేమి పెద్దమనుష్యులు లేరని నేను జెప్పను. కాని పెద్దమ్మ లెక్కువ. ఈచూపుకుగుఱ్ఱాలు గుగ్గిళ్లు తినుటకుఁ దప్ప వినియోగింపవు. ఈతఁ డాజాతిలోనివాఁడేమో కనిపట్టవలసియున్నది.

కళా—వెఱ్ఱిచదువులు చదువకు. సమయాసమయము తెలియఁగకుండ నెందులకావదరుట? ఊరకుండుము.

కురం—అమ్మా! మీరు చెప్పినతగువానిమాత్ర మాణిక్యస్వరూప[illegible]ము గూర్చి నాకు భయముపట్టుకొన్నది. ఆతని మొగములోఁబొంకమే కాని బింకమగపడదు. ఆరంగున్నదే అదేమో జాఱుగా నున్నది కాని ఎమురెక్కుగా లేదు. నిజమైన మగవానిరంగు నలుపులో మసరైన నల్లకుందువలె నుండవలెను. ఈదిలుకురెక్కల గంధకపురంగువారు—కోతిపిట్టమామిడిపండురంగుల వారున్నారే—వీరు తఱచుగా గోడలమీఁద పటములాగున నింటిసింగారమునకుమాత్రమే యని మా పిన్నమ్మ చెప్పినది.

## చతుర్థాంకము.

కళా—ఛీ! ఛీ! ఒక్కటేమతిలేనిధోరణి! మనమిప్పుడెవరియింటనుంటి మో! ఎందులకువచ్చితిమో? ఏలాగునఁ గార్యమును సఫలముఁ జేసికోవలయునో? యీసంబంధమైన చింతయు బెంగయు నేమియులేకుండ నూరక వాగెదవేల?

కురం—అన్నిచింతలు నన్నిబెంగలు నాకు వదలిపోయినవి. ఈతనిని నీకు స్వాధీనపఱచుట నాతరము గాలేదు. అందుకొఱకేగాదా నీపనిని నీవే చూచుకోయని నిన్నిక్కడకుఁ దెచ్చితిని? నీ చిత్రఫలకమును జూచుటకంటె నిన్నుఁ జూచినయెడలను, నాసంధానసంభాషణ వినుటకంటె నీమాటలే యాతఁడు వినినయెడలను నీకు మనోరథసాఫల్యము గలుగునేమోయని యెంచి నీచే నింతపని చేయింపవలసివచ్చినది! కొందఱు వస్తువునే చూడవలయును గాని నాసిప్రతిమను జూచినయెడల వస్తువు గ్రహింపలేరు. మా పెద్దమ్మ రాజుగారి పురోహితుని బొమ్మనుజూచి గోత్రప్రాప్తులనుకొనినది. మాయక్క కొండముచ్చుబొమ్మను జూచి ఈయూరి పెద్దకోమటి యనుకొనినది. ఈమాటలు నీవు నమ్మక వెఱ్ఱిధోరణియందువు. ఆమనుష్యులస్వభావమది. పటము చేతికిచ్చినయెడల నుత్తరమేదో, తూరుపేదో, గ్రహింపలేరు. కడుపుముడత యేదో రొండి మారేడుకాయయేదో గ్రహింపలేరు. ఈతఁడట్టినిర్భాగ్యులలో నొకఁడని నానమ్మకము. చతురతర సంయోగమైనఁ గాని యొకఁడు చదివినయెడల నొకనికిఁ దెలియదు. కంఠముతోఁ బాడినప్పుడే గాయకుని గాన మొక్కఁడనుభవింపఁగలఁడు. కన్నులున్న గ్రుడ్డిప్రకృతులకుఁ జెవులున్న చెవిటిప్రకృతులకుఁ బ్రపంచమున హద్దేమి? పద్దేమి!

కళా—నీ వాచాటతవలె—ఇఁక నోరుమూసికొనుము. కాని యిప్పుడు మనము చేయఁదగినదేమి?

కురం—ఏమియులేదు. అచింతచెట్టుబరికె యొక్కటికిలాగి యెదుటఁబడి మదనపిశాచము వదలున ట్లుత్తరదక్షిణాలక్రింద మోదవలయును. నేను బెండ్లిచేసికొనునప్పుడు నవ్వులతోను, బువ్వులతోను, మాటలతోను, బాటలతోను బెండ్లికొడుకును స్వాధీనపఱచుకొనను. జుట్టు పాయఁదీసి చావఁగొట్టి మఱి సప్తపాదాలు ద్రొక్కింతును. మగజాతి వట్టి మొండిజాతి. అందులోఁ బెండ్లికొడుకుజాతి యున్నదే దాని కెప్పుడు మింటిచూపేకాని మంటిచూపులేదు. పెండ్లికూఁతు రీక్షించి చెంపకాయ కొట్టినప్పుడే కాదా నా మేనమామకుఁ దల కుడిభుజముమీఁదికిఁ దిరిగిపోయినది. అప్పటినుండి హరియనువడకుఁ గాకివలె నాతనికిఁ బ్రక్కచూపేకాని యెదుటిచూపేది? పీతవలె నడ్డునడకయే కాని బొజ్జున కెదుటినడకయేది?

సర—(లోనుండి) ఎవరక్కడ యలికిడి చేయుచున్నారు?

కళా—కురంగీ! నీవు ముందు గదిలోనికిఁబోయి నేను వచ్చియుంటినని సమయమును జూచి చెప్పుము.

కురం—అలాగే.

సర—ఎవరువారు మాటలాడరేమి?

కురం—అమ్మా! నేను గురంగిని.

సర—ఏల తిరిగి వచ్చితివి?

కురం—ఏలవచ్చితినో చెప్పుటకే (గదిలోనికిఁబోవును) గోవర్ధనా! నమస్కారము.

సర—ఏమి చెప్పఁదల చితివో వేగముగఁ జెప్పుము.

కురం—నీవు మగవాఁడవో కావో నిన్నడిగి తెలిసికొనవచ్చితిని.

సర—(తనలో) ఎప్పుడు నిది యిట్టిమాట లాడలేదే! ఎందుచేతనో చెప్పుము. 'కళాలలితా! ప్రాణకాంతా' యని యిదివఱకు నేను బిగ్గఱగా విలపించిన విలాప మిది వినియున్నదాయేమి? ఆహా! యెంతప్రమాదము! మర్యాద దక్కించుకొని యీ యూరుదాఁటి పోలేనుగాఁబోలు. ఒకవేళ గాలము గావలచిన తన రాణిపై నాకు వలపులేదని యిది సన్నెత్తిపొడుచుచున్నదేమో? తెల్లవాఱకుండఁ బాఱిపోనైన వలయును. బ్రదుకిక్కడఁ బరిసమాప్తిమైనఁ జేసికొనవలయును. అంతకన్న వేఱు దారిలేదు. (ప్రకా) నీకు నే నిన్నాళ్లనుండి యిచ్చిన చనవుచేఁ దగని స్వేచ్ఛతీసికొని యిట్లు కాఱులుప్రేలుచున్నావు జాగ్రత్త.

కురం—జాగ్రత్తయని నీవు నన్ను బెదరించుచుంటివా? బెదరుటకు నాతప్పేమి? నాదొంగవేసమేమున్నది? దాఁచి దాఁచి లోపలఁ బ్రాఁతిపెట్టి పైకిఁ బౌరుషపు బచ్చెనమునఁ గప్పుకొనుటకు నాకు లోన మొఱ్ఱ గఁదగనిగుట్టేమున్నది? కళాలలితవాక్యముల వలన నింతకుముందే నీగుట్టు బట్టబయలైనదికాదా?

సర—(తనలో) అయ్యయ్యో! నాకును గళాలలితునకు నొక్కయర గంట క్రింద జరిగినసంభాషణ మిది యేప్రక్కనైనఁ బొంచి యుండి వినినదేమో! నన్నాఁడుదానిఁగనే భావించుమని నే ననుట యాతఁడు నన్నుఁ బ్రేమసీయని పిలుచుట మొదలగు ససందర్భమంతయుఁ గనిపట్టెనని కాఁబోలు! ఇఁక నేమున్నది? కాని తనకాంతుఁడు నన్నుఁ గౌగిలింప యత్నించుట నేనునిరాకరించి గదిలోనికిఁ బోవుట కూడ నెఱింగియుండఁ బహుశుండదా? అంతమాత్రముచే నేను మగవాఁడనని యెటుగ నిది నిశ్చయించునో

నుట కవకాశ మేమియున్నది? అది యాండుదాని బెట్టు, బిగిం పని యనుకొనును. ఇంతకు నింక నాకోంపమునిఁగినది. ఇది వట్టి నోటిమొట్టపునుండ. అయ్యయ్యో! ఇఁక నే నేమిచేయు దును. (ప్రకా) నీకేమి మతిపోయినదా. పో ఆవలికిఁబో!

కురం—మతి పోనే పోయినది. పోదా? మాఅమ్మగారికి నీపై వలపు నిష్ఫలమై పోవ నాకు మతిపోదా? ఆమె పదిదినములనుండి యీబెంగచేత నన్నము మాని వైచి జీనఁబులు నిలుపుకొనుట కు మాత్రమి రవంత మజ్జిగ ద్రావి కాలక్షేపము చేయుచుండఁ గా నాకు మతిపోదా? నేను జేఁతకానివాఁడను—కొజ్జావాఁడ ను—ఆడంగియబ్బన్నను—నాకొఱకు నీ వాసపడి రావలదని నా చెవిలో రవంత యేడ్చినయెడల నామె కీబాధయుండదే— నా కీకష్టపునుంట యుండదే—నీకీ యల్లరియుండదే— మగ వాఁడననియే యాసపెట్టి నన్నింతకాల మేఁపుత్రిప్పించుకొంటివి?

సర—(తనలో) అమ్మయ్య! బ్రదికితిని. ఇది నాలిహాస్య మేమియు నె ఱిఁగినట్లు లేదు. ఇఁక భయములేదు. (ప్రకా) ఏమీ! నిన్ను నేను ద్రిప్పించుకొంటినా? నీవు కష్టపడి రావలదని కూడఁ జె ప్పియుండలేదా?

కురం—నీవు రమ్మనువాఁడవు నేనువచ్చుదాననా? గోలకొండపాదుషా రమ్మనినను నేను 'పోపో' యనుస్వభావముకలదానను. నీచొాలు, డాబు, అంగి, నడుముకట్టు, మొలలోని కైజారు, నెత్తిటోపి యుఁ జూచి నీవు మగవాఁడవనుకొని మాయమ్మ యాసపడి నన్నుఁ బంపుటచేత నిన్నినాళ్ళు నీచుట్టును వచ్చితిని. నీరం గేదో తెలిసినది. మలపనగాన్నియసయ్యవు ముప్పొద్దుల దేవతార్చ నకుఁ దక్క నంతకంటె బసికిరావు. ఇట్టి పనుచువారు ముసలి

యాఁబోతులవలె భూభారమునకు మాత్రమే.

సర—ఛీ! ఛీ! మీ రాణి కక్కఱకువచ్చినవాఁడు మగవాఁడు, లేనివాఁ డాఁడుదియునా? స్త్రీపురుషభేదగ్రహణమున కిట్టిసూత్రమును గల్పించితివి! అట్టె వాగక పో.

కురం—పంచదారచిలుకను దినలేనివాఁడు మధుమేహరోగి యని యొప్పుకొందువా? పాలు త్రాగకుండునది మట్టిపిల్లియనుట కేమైన సందేహమా? అప్సరసవంటి సౌందర్యముగల మా రాణి తనయంతఁ దాను వార్త నంపినపిమ్మట వెనుకాడిన నిర్భాగ్యుఁడు తురకల యంతఃపురములందుఁ బర్దాకాఁపుగా నుండఁదగినవాఁడు కాఁడా? సన్న్యాసులునైతము మా రాణిని దలఁచుకొని తహతహలాడఁగా గంగిరెద్దంత మగదుస్తు పైని సింగారించి విగ్రహపుష్టి తప్ప మఱేమియులేక 'బసవన్నా! పాలుద్రాగరాదా?' యని నేననఁగఁ దల నడ్డముగ నూఁపినవాఁడవు నీవే మగవాఁడ వైనయెడల నిఁక మేమెవరము?

సర—వట్టి వోటుముండవు. నీతో మాటలాడినవానిది తప్పు పో పో.

కురం—నేను పోను.

సర—పోకపోయినయెడల నిన్ను వీథిలోనికి గెంటించెదను.

కురం—నిన్ను నడివీథిఁబెట్టి యల్లరిచేయనియెడల నేను దేవాంగికిఁ బుట్టినదానను గాను. నే సందుల కొక్కతెనే రాలేదు. మా రాణిని గూడఁ దీసికొనివచ్చితిని. అప్రక్కనున్నది.

సర—అయ్యయ్యో! అంతఃపురకాంతాశిరోమణి కింత శ్రమమేలయిచ్చితివి?

కురం—శ్రమమిచ్చినది నీవా? నేనా? నీతిరస్కారమూలముననే యామె వచ్చినప్పుడు శ్రమ నేనిచ్చియుందునా! నీకొఱకే యా

మె వచ్చియున్నప్పుడు శ్రమమిచ్చినవాఁడవు నీవుకావు కాఁబో లునేమి!

సర—కాని అయ్యయ్యో! ఇప్పు డామె యేలరావలయును?

కురం—ఎందులకా! నీవామె నింతయలక్ష్య మేలచేయవలయునో కనుఁగొనుటకు. నీవామె నిప్పుడైన వరింతువో లేదో కనుఁగొనుటకు. ఒక్కటేమాట. నీవు మగవాఁడవైనయెడల నామెను వరించి త్వరలో వివాహము చేసికొనఁ బ్రయత్నింపుము. లేదేని నే నెంతపని చేయుటకైన సిద్ధముగా నున్నాను. నే నల్పురాలను. మొండిదానను. ప్రాణము విసుగుటచేఁ దెగించియున్నదానను. నేనే నీకంటె నెక్కువ మగవాఁడ నని, నీవాఁడుదాన వని యీరాత్రి జగన్నాథపుర దేవస్థానమున వేయికాళ్లమండపమందు శిలాశాసనము వేయింతును.

సర—(తనలో) వీరితో మంచిమాట చేసికొని తెల్లవాఱకుండ నెక్కడకైనఁ బాఱిపోయినఁ గాని మానప్రాణములు దక్కవు. నే నాఁడుదాన నని స్పష్టముగా నొప్పుకొనినయెడలఁ గళాలలితుని వలన నా కుపద్రవముగాదా? (ప్రకా) కురంగీ! ఏమగవాఁడు నీయెదుటఁ బనికివచ్చును?

కురం—నన్నధిక్షేపించుచుంటివా! ఏయాఁడుది నీయెదుటఁ బనికివచ్చినది? సౌందర్యముచే దిగ్విజయముచేయఁగల మారాజ్ఞీమణియే నీయెదుటఁ బనికిరాలేదే.

సర—అట్టి తొందరపడకు. పనికిరాకపోవుటకుఁ గారణము లేకపోలేదు. కళాలలితుఁడు నాకుఁ బ్రాణమిత్రుఁడు. అతనిచెల్లెలు గదా యని సందేహించుచున్నాను.

కురం—అయిన నేమి? అతఁడు మాకేమి పెట్టవలయునా? పోయ

వలయునా? అతనియాస్థాన మాతనిది. మాయాస్థానము మాది. మాయమ్మకు వివాహాదులఁ గూర్చి సర్వస్వాతంత్ర్యమున్నది.

సర—కాని నిర్జనద్వీపమున మరణించుటకు సిద్ధమై యుండఁగా నాకంఠమున నీరుపోసి నాబ్రతుకు నిలువఁబెట్టిన ప్రాణమిత్రుఁడు గదా యామహాత్ముఁడు.

కురం—అటులైన ప్రాణమిత్రులు బావమఱఁదులగుట మఱింత మంచిది కాదా! శత్రువే కాని చెల్లెలిని బెండ్లిచేసికోఁగూడ దని శాస్త్రమున్నదా యేమి? కాని మారాణియందు నీకు నిశ్చలమైనప్రేమ మున్నది కదా?

సర—ఆమెకొఱకుఁ బరితపించుచున్న నన్నిట్లడుగుటే నాకు బాధయని యెఱుఁగవా?

కురం—ఇంతకుముందు 'కళాలలితా! ప్రాణకాంతా!' యని యామెకొఱకే కదా నీవు సంతపించితివి?

సర—(తనలో) అమ్మయ్యో! ఈమాటలుకూడ నీముండ వినినదా! (ప్రకా) ఆపరమాత్ముఁడే నాహృదయ మెఱుఁగును. నీతో నేమిచెప్పిన నీకు నమ్మకము?

కురం—నాకు నీయం దిప్పుడు నమ్మకము కలిగినది. నీవిప్పుడు మగవాఁడవై ప్రకాశించుచున్నావు. ఈయూర నిదివఱకే యీఁడువా రెక్కువగానున్నారని మాయమ్మ చెప్పినది. ఉన్నయిల్వురు మగవారు కూడ నీవలెనే యప్రయోజకులైనప్పు డేకోస్త్రీనుండి మగవారిని దిగుమతి చేయవలసినది? కాని మారాణి యచ్చట వేచి యున్నది. ఆమె నిక్కడికిఁ బిలుతును.

సర—ఎంత యుపచారము వచ్చినది! నేనామె నెదుర్కొని యిటకుఁ దీసికొనివత్తును. ఏదీ! ఆమె యగపడదేమి? (గదివెలుపలి

కిద్దఱు వత్తురు.)

కురం—అమ్మా! అమ్మా! అతలుపుచాటున నిలువఁబడినది కాంబో లు. నేను దీసికొనివత్తును. (అట్లు చేయును. సిగ్గు నటించుచు రాణి యచ్చట నిలుచును.)

నర—కళాలలితా! నీయింటిలో నీకు స్వాగతమిచ్చుచున్నాను. నిన్నిటకు రప్పించునంతటి మహాకఠినాత్ముఁడను క్షమింపుము. ఇట్లా దయచేసి యీపీఠమును నీస్పర్శముచేఁ గృతార్థమునుగాఁ జేయుము.

కురం—అమ్మా! ఈతఁడు నీయెడల మహానురాగము కలవాఁడు. నీకై పరితపించుచున్నాఁడు. నీవాతనితో మాటలాడుము.

నర—నీదాసియగు కురంగి నాహృదయమును నీకు నీహృదయమును నాకును దెల్పినది. ప్రేమ వెల్లడియగువఱకే సిగ్గు. ఆ యవశిష్టము తీఱినది కావునఁ గొంచెము సిగ్గు విడిచి మోమెత్తి చూచి—(తనలో) అహా! మాటలకుఁ దడుముకొనుటయైపోవుచున్నదే! ఎంతగింజుకొనినను బ్రియుఁడు ప్రియురాలితో మాటలాడు మాటరక్తి రాదేమి? అయ్యయ్యో! సిరాబుడ్డిలో సిరా యున్నప్పుడుకదా కలమునకు నలుపు.

కురం—(అవ) ఇప్పు డింక నీవు బిఱ్ఱబిగియుదువా యేమి? అమ్మయ కొడుకును జెడఁదిట్టి యిక్కడ కీడ్చుకొనివచ్చుసరికి నాతలప్రాణము తోఁకకు వచ్చినది. ఇప్పుడు నీకుఁ దెగసాఁగుడా? అఁదు దానికి సిగ్గిచ్చినందుల కాబ్రహ్మగానిని మూతిమీఁదఁ గొట్టిన యెడల ముందుసృష్టియైన నింతకంటె బాగుగా నుంచును. నాకు సిగ్గనఁగ నొడలుమంట. మగవాఁడు మనకంటె నెక్కుడ? ఆతనికి సిగ్గులేకపోవుటయేమి? మనకుండుటయేమి? అయి

నను నీకిప్పుడు పని లేనిదే భర్తయొద్ద సిగ్గెందులకు ? మాయ
మ్మనమ్మ నంతలోనికిఁ బోయి పైవారు చూచిపోవుదు రేమో
యని కనులు మూసికొనెడి దఁట !

నర—కళాలలితా! ఇంతకాలము నాయనురాగమును గప్పిపుచ్చి నిన్ని
టకు రప్పించుటచే నేను నీయెడల మహాపరాధ మొనర్చితిని.
(తనలో) ఈవచ్చుమాట వెనుకఁ జెప్పినదే కాఁబోలు. పైము
క్క తోఁపనిదే ! లోపల రవంత వాయుచలన మున్నప్పుడు
కదా నీళ్లమీఁదఁ జిత్రవిచిత్రమైన బుద్బుదములు. లోపల
నిమ్మళము నీరుపోసినట్లు నిండుగ నున్నది. అలుకులేదు. ఉలుకు
లేదు. ఏదో మాటలాడకపోయిన యెడల మౌనమునకులోప
మని యేడ్చినయేడుపింతకంటె సొగసుగా నుండునా ? (ప్రకా)
కళాలలితా ! నీవు క్షమించితినను సుధామధురాక్షరములను
వినుటకు వేచియున్నాను.

కురం—(అప) ఈసారి నీవాతనితో మాటలాడని యెడల నేమైనను
గానీ నన్నుఁ గట్టగట్టి, కల్లురోలైనను కుక్కమీఁద విసరివైచిన
ట్లాతనిమీఁద బాఱవైతును.

కళా—(అప) నీవు మొఱకుముండవు. అంతపని చేసినను జేయఁగల
దానవు. నే నాతనితో మాటలాడుదును. అతనినిగాని నన్నుఁ
గాని నీవు దుర్భాష లాడక యూరకుండుము. (ప్రకా) గోవ
ర్ధనా ! క్షమింపు మని నన్ను నీవు కోరుచున్నావు. క్షమింపఁ
బడుదానను గాని, క్షమించుదానను గాను.

నర—నీవలనఁ దప్పేమున్నది. ఎంతకోపమైన నాయందున్నది. (తన
లో) పెండ్లికొడుకునకు మగతనపులోపముకంటె నెక్కువ లోప
ముండునా ? అగ్నికి వేఁడిలేనప్పు డింక నగ్ని యేమి ?

గీ. పైకిఁ దరవారి, కమ్మరు ♦ బంధుఁ గలిగి
లోన సతిసాట నాకెంత ♦ లోపమొక్కొ!
పరుషశబ్దాఘబడబడా ♦ ర్భటిని గల్గి
భావబలశూన్యమైన కా ♦ వ్యంబువోలె.

కళా—గోవర్ధనా! నీయం దేదియు లోపములేదు. మనుష్యులయిష్ట ములు ప్రకృతిభేదములఁ బట్టి యుండును. నీపై నొకకాంత కిష్టముండవచ్చును. నీకామెయుందు లేకపోవచ్చును. అంత మాత్రమున కామెగుణము లేదు. నీలోపము లేదు. నీకంటి వైఖరి యది. అది నీలోపముకాదు. కాని యాకాంత నీచే నిరాకరింపబడినప్పటికిని నిన్నే ప్రేమించి యంతఃపురకాంత యయ్యును వంశమర్యాద విడిచి రాత్రిభాగమున నీయెదుటఁ బడి మాటలాడుటయున్నదే. ఇది యాకాంతకు మహాలోప ము. ఈతప్పును నీవు క్షమింపవలయును.

సర—(తనలో) కళాలలితా! నీవు నాకంటె సహస్రగుణము లెక్కువ బాగుగా మాటలాడుచున్నావు. పైవసకనువైనరసము నీలోన నున్నది. మంచి మామిడిపండవు నీవు; లక్కచిలుకను నేను. అది యాలాగున నుండనిమ్ము. ఇంతమాత్రమునకే నీవిది లో పముగా నెంచునప్పుడు నామాట నేనేమి యనుకొనవలసినది? అవతలి మేడనుండి యీమేడకు—అదియైన నీమేడకే—వ చ్చుటయే నీకు లోపమైనప్పుడు దేశాలకు దేశాలు, సముద్రా లకు సముద్రాలు దాటిన మందభాగ్యురాల నైన నామాట నేమి చెప్పుకొనవలయును? అర్ధరాత్రమున వచ్చినందుల కింత యిబ్బంది పడుచుంటివే! రేయింబగళ్లు—ఒకటా—ఎన్నో? అట్లు యాత్రచేసిన యీ యధమురాలి దోషమునకు హద్దు

కలదా ? వంశమర్యాద విడిచితి నని నీవింత బాధపడుచుంటివి కదా ! నేను విడిచిన దొక్క వంశమర్యాదయేనా ? పురుషుఁడనై జాతిమర్యాదను గూడ విడిచితినే. ఇఁక నాబ్రదుకునకు సార్థకత యేమైన నున్నదా ? మొదట నీవంటి యాఁడుదియే యయి యాఁడురూపము చెడుటచే మగతనము రాకుంటచే నుభయభ్రంశము నొందిన మగపేరంటాలితో రవంత మాటలాడినందులకే యింత నగచుచుంటివే ! ప్రత్యక్షపురుషునితో నొకగంటక్రిందనే భాగవతమాడిన యీ లజ్జాశూన్యరాలిమాటనేమి చెప్పెదవు ! నీవు కోరినట్లు నేను నిన్ను క్షమింతును. నీకు మనశ్శాంతి యగును. క్షమింపుమని నే నెవనిని ప్రార్థింతును ? ఈసంగతు లేమియు నామగనితోఁ జెప్పుకొనుటకు వీలులేదే. ఇఁక నెట్లు ? కళాలలితా ! నాలోపము లెఱుఁగక పోవుటచే గదా నీవు నన్నింతగా మన్నించుచున్నావు. ఒకని హృదయ మొకనికి ప్రత్యక్షమగునట్లు బ్రహ్మ చేయుటచే బ్రదుకులు దక్కుచున్నవి గాని యట్లే కానిచో నొకనిపై నొకఁడుమ్మి, యొకని నొకఁడు తన్నుకొని నరులందఱొక్కపగటిలోఁ జచ్చుట కేమైన సందేహమా ?

కురం—గోవర్ధనయ్యా ! ఇంతసేపును గారముతిన్న బాలింతరాలివలె గ్రుక్కిళ్లు మ్రింగుచు నూరకుంటి వెందుచేత ? చదువులేని శుంఠవలె మెమ్మె యనెదవేమి ? కంచుగంట మ్రోఁగినట్లు కంగుమని మాటలాడవేమి ?

సర—కళాలలితా ! నీలోపముల నేను క్షమింపవచ్చును. నాలోపములు నీవు క్షమింపవచ్చును. నమను నోటికివచ్చినట్లెల్లఁ దిట్టుచున్న యీకురంగిని క్షమించుటెట్లు ?

కళా—పరమవిశ్వాసవంతురాలు ప్రాణమిచ్చునన్న ను మాటలాడ క యిచ్చును. నోటియొట్టపుఁదనము మాత్రి మెంతయైన ను న్నది. దానిమాటలను నీవు నన్నుఁబట్టి పరిగణింపవలదు.

కురం—మగవాఁ డాడంగియుండక గొడుకిగుటకంటె యాఁడుది మగవాఁ డగుట దేశమునకు మంచిది. పనికిమాలినసిగ్గును వదలివైచి యాఁడుది మగలక్షణములతో గ్రూంకరించినప్పుడే ప్రపంచ ము సముద్రపుఁబోటువలె ముందునకు నడచును.

కళా—కురంగీ! ఆ మదానికి మగవానికిఁగూడ సిగ్గుండవలసినదే. మగ వాఁడనగ సిగ్గులేనివాఁడని నీయభిప్రాయముకాఁబోలు. ఆఁడుది సిగ్గువిడిచినయెడల మగవాఁడగునని యనుకొనుచున్నావు కాఁ బోలు. పశువగును. గోవర్ధనా! నిన్ను బతిమాలుకొనుచు న్నాను. దానిమాటలవలన నీవిబ్బందిపడవలదు!

సర—కాని కళాలలితా! నిన్ను బ్రాణకాంతాయని పిలుచుటకు నా కనుజ్ఞ యిచ్చెదవా?

కళా—నన్నడుగకుండ నాయనుజ్ఞ నిదివఱకే తీసికొంటివని వినియుం టినే.

సర—అటులైనసరే; ప్రాణకాంతా! కళాలలితా!

కళా—గోవర్ధనా యేమి?

కురం—అదిగో గోవర్ధనాయని యందువేల? నిక్షేపములాగున ప్రాణ నాథా! యని పిలువుము. ఇంతమట్టునకు వచ్చిన తరువాతఁ గూడ నింక గోవర్ధనాయేమి? ఆపనికిమాలిన పేరేఁక మానఁగూ డదా? ఎవనితో నెప్పు డేమిపనివచ్చునో యని మాపెద్దమ్మ కనఁబడిన మగవారినందఱను బావగారూ యని పిలిచెడిదఁట.

కళా—ఎంతసేపు చెప్పినను ముసలిపెద్దమ్మల పిన్నమ్మల దిక్కుమాలిన మాటలేకదా.

కురం—ఇదిగో మతిమాలిన మీపడుచు చిన్నమ్మలమాటలకంటె మా తేవిరైన బాగుగనే యుండును. క్రొత్తమగఁడు క్రొత్తపెండ్లాము సరిక్రొత్తగాఁ గలసికొనినప్పటి సంభాషణము కోమటి దుకాణపు సంభాషణలాగున నున్నది. మీశృంగారాలాపకలాపములు సంగీతములాగేయుండునో, సత్యనారాయణప్రసాదములాగే యుండునోయని చెవులు నిక్కఁబెట్టుకొని నోరుతెఱచుకొని నిలుచఁబడితిని. నాటకాలలో నయితము మగఁడు పెండ్లము కలసికొనునప్పు డీయమ్మ యాతనిమీఁదఁ గన్నువేయుట—అతఁ డీమెమీఁదఁ జేయివైచుట—యామె యొత్తిగిలుట—యాతఁడు తత్తరించుట—ఈయమ్మ నుతిలోఁగలియకుండ నొకపద్యముచదువుట—అతఁడు తాళములేకుండఁ గొంతకీర్తనపాడుట—విరహబాధచేత నీయయ్య కన్నులొత్తుకొనుట—ఆయమ్మ మెత్తఁబడుట—ఆయమ్మ చెక్కుపైఁ జేయియడ్డముపెట్టుకొనుట—ఈయయ్య ముద్దునకై మూతిపొడుగుసేయుట—మొదలైన వింతవింతచమత్కారములతోఁ గన్నుల వైకుంఠముగా నుండెడిదే. ఒక్కరాత్రిదంపతులయందే—ఇద్దఱు మగవారైన దంపతులయందే—యింతయుత్సాహముండఁగా బేడబొమ్మలవలె మీయందేమియుఁగదలికయున్నట్లగపడదేమి ?

సర—(తనలో) మేముకూడ నొక్కరాత్రిదంపతులమే.

కళా—కురంగీ! మాకీ శాంతసంభాషణమే తగియున్నది. ముచ్చిబంగారమున కెంతతళుకైన నుండును. కల్లదంపతులకే యెన్నిగడబిడలైనను; దైవసన్నిధానమున సత్యబద్ధులై పవిత్రమైన గృహస్థాశ్రమమును స్వీకరించు వధూవరులకుఁ గులదేవతల

యాశీర్వాదనినాదములు తప్ప వేఱేమియు నక్కఱలేదుసుమీ!

సర—(తనలో) ఆహా! ఎంత బుద్ధిమంతురాలవు! రూపమునకుఁ దగిన గుణము నీకున్నది. నీగొంతుకోయనెంచిన పరమకిరాతురాల నైన నన్ను నీవెంతగానమ్మియున్నావు! నీయాస యంతయు నీ రాత్రితోడనే యంతమగును. నేను నీయెడల మహాపాపమును జేయఁదలఁచియున్నాను. నాదుర్గతి యిట్లున్నది. నావలన నీ దుర్గతి యట్లున్నది. నేను క్రమముగా నొకతప్పునుండి మఱి యొకతప్పునకు లోనయేటఁ బడి కొట్టుకొనిపోవుచున్నాను. ఆఁడు దాననని మొట్టమొదట నొప్పుకొనినయెడల నాకింతదురవస్థ వచ్చియుండదేమో. అట్లొప్పుకొన్నయెడలఁ బుట్టిమునిఁగిపోవు నని యిట్లు చేసినాను. ఇది యీవిధముగా మునిఁగినది మఱి లేదు. ఈయవస్థలో నీమెయెడల శృంగారచేష్టలగపడుటలేదని కురంగి నన్ను దెప్పిపొడుచుచున్నది. అది చెప్పినట్లు కళాలలిత మీఁదఁ జేయివేయవలయునుగాఁబోలు. ముద్దుపెట్టుకొనుట మాత్రము నావలనఁగాదు. ఏదోసమయమును జూచి చేయి వైచెదను. వేసినసేమి వేయకున్ననేమి? సీతాఫలము గనులు తెఱచినసైనఁ జూడఁగలిగి యేడ్చునా? ఎంతబలాత్కార శృం గారప్రారబ్ధము తటస్థించినది. (ప్రకా) ప్రాణప్రియా! నీవు సముద్రప్రయాణ మెప్పుడైనఁ జేసితివా?

కురం—గోవర్ధనా! జడయల్లికగా మాట్లాడలేవేమి! ఒకమాటకు రెండవమాటకు సంబంధ ముండనక్కఱలేదా? సముద్రప్రయా ణపుమాట యిప్పుడెందులకు? గాగరాగుడ్డ గజమునకు వెల యెంతయో యడుగలేకపోయితివా? అంతకంటె సందర్భముగా నుండునేమో? ఒకమగవాఁడు తనకిష్టముకాని రెండవమగవా

నితో మాటలాడవలసివచ్చినప్పుడు పశువులసంతనుగూర్చి యొ
కమాట—కొంత సేపటికిఁ బాపికొండలను గూర్చియొకమాట-
మఱికొంత సేపటికిఁ బండ్లపొడినిగూర్చి యొకమాట నడిగి నోరు
మూసికొనినట్లు—నీవింత లంకెలేనిమాట లాడెద వేమి? సము
ద్రప్రయాణమా? ఊఁ. కోడిగ్రుడ్లపులుసుకాదేమి?

కళా—నీగొంతుగోయ! పో! నీవావలికిఁ బో! మూలముండ!

సర—ప్రాణప్రియా! దానిస్వభావ మదియని యంటివికాదా? ఏల
దానిఁ దిట్టెదవు! నిన్ను మాయూరు దీసికొని పోవునప్పుడు
నీవునడిసంద్రమును జూచి బెదరుదువేమో యని యట్లడిగితిని.

కురం—సప్తపాదాలు కాలేదుగాని సముద్రప్రయాణమా? ఇఁకముం
దు పుట్టఁదలఁచిన పిల్లవానికడుపుమీఁద సూదిపూలు వేయు
టా మానుటా యని యడుగలేకపోయినావా?

సర—(తనలో) నీయిల్లువల్లకాఁడుగాను. నీమాటలకుఁ గోపముపోయి
నవ్వువచ్చుచున్నదే? (ప్రకా) ప్రాణప్రియా!

గీ. ఈశ్వరకటాక్షమహిమచే • నిట్లు మనకు
మనసు లొక్కటిగాఁ గూడఁ • దనువు లింక
వేరుగా నుంపఁ బాపంపు • విధముగానఁ
గంజదళనేత్ర! నిన్నిట్లు • కౌఁగిలింతు.

(కౌఁగిలించును.)

కళా—(తనలో) హృదయమా! పరవశత్వమొందుము. రసనమా!
మూఁగవై యుండుము. సిగ్గా! ఒక్కనిముసమడఁగియుండుము.

కురం—(తనలో)నాకన్నులిప్పటికిఁజల్లఁగానున్నవి. మాయమ్మకిట్టిమగఁ
డుసిద్ధింపవలెనని నేను గాళికాదేవికెన్నిమ్రొక్కులో మ్రొక్కు
కొంటిని. తేపే పోయి యవియన్నియుఁ దీర్చుకొందును.

వర—(తనలో) ఈమెయొడలు పులకలచే నిసుకకాగిదమువలె నాయొడలికిఁ దగులుచున్నది. ఒడలు జలజలలాడుచున్న యుదరుగూడ నామేనికిఁ దెలియుచున్నది. కాని నేను వట్టి శిలావిగ్రహమువలె నున్నాను. నాయొడలు రవంత వేఁడిదైన నెక్కినట్లగపడదు. ఆమెయొడలిలో రాగసంబంధములగు విద్యుల్లతలు జలజలఁ బరుగువాని తళతళ మెఱయునట్లుంటయేమి? ఆమెయొడలి నంటియున్న నాయొడలిలో నిసుమంత యులుకైన లేకుంటయేమి? నేనే యిట్టియవస్థ నీమెకుఁగలిగించియుందునా? కాదు. నేను మగవాఁడనని యామె భావించుటయే యిందులకు కారణము. ఆహా! భావనాశక్తిమహిమమునకు హద్దున్నదా; భావనానందమే యానందము గాదా. దాని యనుభవము పూర్ణముగా నొక్కకవికే కలదు.

ఆ. వె. మల్లెపూవుఁ దూఱి ♦ మధుపంబుతోఁ బాడి
గంధవాహుతోడఁ ♦ గలసి వీచి
యబ్ధిలోన మునిఁగి ♦ యౌర్వవహ్నిని గ్రాఁగి
నీరుబుగ్గ యగుచు ♦ నింగి బ్రాఁకి
తోఁకచుక్కతోడ ♦ డీకొని శ్రమఁజెంది
సాంధ్యరాగనదిని ♦ స్నాన మాడి
తనువునిండ నింద్రి ♦ ధనుసురంగులఁ బూసి
కైరవాప్తసుధను ♦ గైపుచెంది
గోళగానరుతికి ♦ మేళవింపుగఁ బాడి
పాడి యాడియాడి ♦ పాడి సోలి
భావనామహత్త్వ ♦ పటిమను బ్రహ్మమై
పోవుకవికిఁ గోటి ♦ మ్రొక్కు లిడుదు.

(ప్రి) కళాలలితా! ఈకౌఁగిలి నింక విడువను.

ఆ. వె. విష్ణువునకుఁ బ్రీతిగఁ • బృథ్వీశుఁ డిల నుండు
బ్రహ్మప్రీతిగ గాధి • పట్టి గలఁడు
అవని నెవఁడు గలుగఁ • డర్ధనారీశున
కతనిప్రీతిగ నుండ • మవని మనము.

కుర—ఇప్పుడు నీవు మగతనపుమాట నాడినావు. నేను దలయూఁపఁ దగినమాట యిది యొక్కటియే.

నర—నా కింతకంటె గౌరవపత్రిక మఱి యేమున్నది?

కళా—ప్రాణనాథా! కళాలలితుఁడైన మఱియెవ్వఁడైన వచ్చునేమో మే మింటికిఁ బోవలయును. (వదలుచుకొనును.)

నర—(తనలో) ఈమె నాకంటె బలముగలది యగుటచే నిట్టె వదల్చుకొనినది. అదిగాక మగతనపు డాబుకొఱ కింతగట్టిగఁ గౌఁగిలింప యత్నించినను గౌఁగిటికి బిగియే రానిదే నేనేమి చేయఁగలను?

కురం—ముందు చేయవలసిన పని వినుఁడు. తెల్లవాఱకుండ బయలుదేఱి మనము కాళీపురమునకుఁ బోవలయును.

కళా—ఏల?

కురం—నీకు గోవర్ధనుఁడు మగఁడైన యెడల నానందెకడియము లమ్మవారి కిచ్చెద నని మ్రొక్కుకొంటిని.

కళా—ఎంతబాగుగా జ్ఞప్తికిఁ దెచ్చితివే! ఇష్టమైన యెడల నాపెండ్లి కాళికాలయములో జరుగవచ్చు నని మాతండ్రిగారి మరణశాసనములో నున్నది.

కురం—అటులైన గోవర్ధనా! అందఱమును గలసిపోయిన మంచిది కాదా?

సర—కళాలలితుఁడు లేకుండఁ బెండ్లియగుట నాకిష్టము కాదు.

కళా—ఇప్పుడు కాళికకు మహోత్సవములు జరుగుచున్నవి. తేపో యెల్లుండియో కళాలలితుఁడు గూడ నక్కడికి వచ్చును. ప్రతి సంవత్సరము తిరుణాళ్ల కతఁడు తప్పక పోవును. ఇష్ట మున్న యెడల మన మాతని నక్కడఁ గలిసికొనవచ్చును.

సర—(తనలో) నేను గూడఁ గాళీపురమునకే పోవుదును. ఎందుచేతఁ గళాలలితుఁ డక్కడకు వచ్చుటచేత-ఆమహాపట్టనములో నన్ను వీరు తిరిగి చూచుటయెట్లు? నేను స్త్రీవేషమునఁ గళాలలితునిఁ గాంచి యాతనిని బెండ్లిచేసికొందును. గోవర్ధనుఁ డెవఁడో, యెవరితోఁ బోయెనో యేమైపోయెనో యెవ్వరి కక్కఱలేదు. కళాలలితునితోఁ జెప్పకుండఁ బోవుదును.

(నేపథ్యమున)

కళాలలితుఁడుగారు మీకు వస్త్రనపల్లెర మంపినారు.

కళా—మేమీదారిని బోవుదుము. దయయుంపుము.

(కళాలలిత, కురంగియుఁ బోవుదురు.)

సర—(తనలో) ఇఁక మీదారి మీది, నాదారి నాది. (ప్రకా) సెలువు తీయుచున్నాను. సేవకా! (అల్లు చేసి) నీవు లోనికివచ్చి యీ గదిలో నుంపుము. నేనును లోనికి వచ్చుచున్నాను. (తనలో) అబ్బ! తలనొప్పి వచ్చినది. ఈ యుదుమనుఁడు నూరినాటకములో నిఁకఁ బురుషవేషము మాత్రము ప్రాణముమీఁదికి వచ్చునప్పు డు తప్పవేయఁగూడదు. బుద్ధివచ్చినది. ఇఁక నిక్కడనుండి పాఱిపోవలయును. తరువాత జరుగఁదగిన దేది? గోవర్ధనునకుఁ గళాలలితకుఁ బెండ్లియా! ఈచెవి కీచెవికి లంకె వేయవలసియున్నది. (నిష్క్రమించును.)

ఇది చతుర్థాంకము.

శ్రీ రామా.




# పంచమాంకము.

ప్రదేశము—కాళిపురమునఁ గాళికాలయవీథి నొక్కసత్రము.

ప్రవేశము—గోవర్ధనుఁడు.

గో—ఈకాళికాపురమున నకార్యకరణము లెన్నియైన నున్నవి. అందు లోను మహోత్సవములగుటచేఁ జెప్పవలసిన దేమున్నది ?

గీ. కల్లు ద్రాగుట ధర్మంబు • కాదుకాని
కాళికకుఁ జేయుతిప్పి • త్రాగంగఁదగును
ప్రాణిహింసను జేయఁ బా • పంబె కాని
యమ్మచలువకై యదియుఁ జే • యంగఁదగును.

గీ. ఎట్టిదురితౌఘమైన నీ • పొట్టకొఱకు
మతము పేరిట జరిగిన • మంచిదగును
నెట్టిఘోరాఘమైన నీ • మట్టికొఱకు
రణము పేరిట జరుగ శౌ • ర్యంబు సుమ్ము.

గీ. రమ్ము పగకాఁడ! లోకమి • రమ్ము టంచు
నాకు నీపైని వలపంచు • నమ్ము నంచుఁ
గంటఁ బడిన సుందరమ్ముల • నింటి కీడ్చి
ధనము దోఁచుకొంచును మష్ట • వనిత లివట.

నా సేవకుఁడు భ్రమరుఁ డింక రాకుంటచే నేనిట నొక్కఁడనే యుండవలసివచ్చినది. మధురికను బెండ్లిచేసికొని సుఖపడుచు నాతఁ డాలసించియుండునేమో ?

(నేపథ్యమున) గోవర్ధనప్రభూ ! గోవర్ధనప్రభూ !

గో—అదిగో ! మాటలోనే వచ్చినాఁడు. నేను బసచేసినసత్రమిదియే. ఆతఁ డెట్లు కనుగొని వచ్చినాఁడో ? బసలోనికిఁ బోవుదును. (పరిక్రమించును.)

(తెర యెత్తఁగ సత్రములో నొకగదియు వసారాయుఁ గనఁబడును.)

సేవకా ! భ్రమరా ! ఏమీ ! ఎవ్వఁడును మాటలాడఁ డేమి ? అదిగో యెవ్వరో వచ్చుచున్నారు. (కురంగి ప్రవేశించును.)

కురం—గోవర్ధనప్రభూ ! నమస్కారము.

గో—వచ్చితివా ? మధురికా ! పుత్త్రవతివికమ్ము. చూడు మధురికా! భర్తృసుఖ మయిదాఱు సంవత్సరము లవ్యాహతముగా ననుభవించి, యిఁకఁ బుత్త్రుఁడు గలిగిన బాగుగా నుండునని మనస్సునఁ దోఁచినతరువాత దైవకటాక్షమునఁ బుత్త్రిని గనుము. కాని నీభర్త యేఁడీ ?

కురం—(తనలో) ఈతఁడు నన్ను మధురికాయని పిలుచుచున్నాఁడేమి? బ్రహ్మచారిముండను నాకుఁ బతియు మైనదనుచున్నాఁడేమి ? పరసుఁడైన లేకుండ సంతానమెట్లు ? (ప్రకాశముగా) అయ్యా! పరధ్యానమున నుంటివేమో ? నావంక నిశ్చలముగాఁ జూడుము. నేను మధురికనా ?

గో—కావా ? అటులైన క్షమింపుము. నా సేవకుఁ డాతనిభార్య మధురికతో నిచ్చటికి రావలసియున్నది. వారికొఱకు నేను నిరీక్షించుచుంటిని. ఆమధురికవైన నే నొక్కనిముసము మాత్రమే

చూచియుంటిని. అందుచే నదియే నీవేమో యని యట్లంటిని.
కాని నన్ను గోవర్ధనా యని పిలిచినవా రెవ్వరు?

కురం—నేనే.

గో—ఆఁ! నీవు నన్నెట్లెఱుఁగుదువు?

కురం—నాతోఁ బరిహాసమేల? ఆవలిగదిలో బసచేసిన మాయమ్మ నీకొఱకుఁ బరితపించుచున్నది. నడు.

గో—నిన్ను జూచుటతోడనే కాలుసేతులు చల్లఁబడిన నాకు మీయమ్మతోడి సరసమా? నీ కమ్మయమ్మ లేదేమి?

కురం—నానోరు మంచిది కాదని యెఱుఁగుదువు. నీ కిదినఱకే తిట్లు చాల నైనవి. నాకు నీపరిహాసములు పనికిరావు. బిగిసినన్ని నాళ్లు బిగువనే బిగిసినావు. ఇంక నీమగతనపు బింకములు కట్టి పెట్టి చెప్పినమాట విని యటుపోయి యామెను లాలింపుము.

గో—నేను నీతోఁ బరిహాసము లాడునంతటి నిర్భాగ్యుఁడను గాను. నీవు నన్నుఁ జూచి మఱియొకఁడని భ్రమించుచున్నావు. నిశ్చయము; కావున నన్ను విడిచి పొమ్ము.

కురం—నిన్ను విడిచి నేను బోవుదునా? నిన్ను విడిచి మేమిటకు ముందు వచ్చినందులకే కాదా నీవు మమ్మిట్లు లాడించుచున్నావు? నీవు మాతోడనే బయలుదేఱుదు ననిచెప్పి రాలేదేమి? నీవు వత్తువో రావో యని దారిపొడుగునను మాకళాలలిత పలవించి పరితపించెను గదా! ఇంత దాక్షిణ్యము లేదేమి?

గో—ఎవరు? మీయమ్మ కళాలలితయా? కళాకలితయా? ఏమిచిత్ర మైన నామము!

కురం—ఎంత యెఱుఁగనట్లు మాటలాడుచున్నావు! నాకుఁ దలతిక్క యెత్తుచున్నది. ఇఁక జాలు! ఓ! గొప్పమగవాఁడవు బయలు

దేఱినావు! నీజాణతనము, నీపెంకితనము, నీతలబిఱుసుఁదనము మాయొద్దనే యగపఱుపవలయును గాఁబోలునేమి? ఈతెగనీలుగులు, నీగర్వాలాపములు మా రాణి తనంతఁ దాను నిన్ను వరించి నీకిట్టె స్వాధీన యయినందులకే కదా!

గో—(తనలో) హా! ఇదేమి? ఇదివఱకు వారనారీనిధిమర్యాద యనుకొంటిని. అయ్యయ్యో! రాణియనుచున్నదే! క్షత్రియవంశమర్యాద కేమియు భంగము రాలేదు కద! ఈముండ నన్నెన్నిదుర్భాష లాడినను వీలగునంతవఱకు లక్ష్యపెట్టక, యీసంగతి యేదో కనుఁగొనవలయును. ఏరాజపుత్త్రిక నేనుచ్చుఁడు మోసగించెనో—గుండెలు దడదడలాడుచున్నవి. (ప్రకాశముగా) ఇదివఱ కన్య యనుగ నిన్నుఁ గన్నతల్లి యనుకొంటిని. అబ్బో! రాణియే—రాణి యని పెద్దమాట లాడుచున్నావే?

కురం—పై దేశమునుండి వచ్చిన బంగిరాజవో, బురదరాజవో యగు నిన్ను మా రాణి కేవల [illegible] రాగమునఁ గోరినందుల కామె రాజ్ఞీత్వమునే పరిహాసించుచున్నావేమి? రాణి రాణి యని పెద్ద పేరా? నీబ్రతుకున కామెయాభిజాత్యము ననుమానించుచున్నావేమి? ఏమివిశ్వాసవంతుఁడవు! ఏమికాంతాగౌరవము కలవాఁడవు! ఏమినరుఁడవు! పరిహాసమున కొక్కటిరెండుమాట లాడవచ్చును. అంతేకాని తెగువఱ కొక్కటిబాగుటా? పుండగువఱ కొక్కటేగోఁకుటా? మూతి ముడుచుకొని యింటిలోఁ గూరుచుండుటచేత బిసియముగలవాఁడ వనుకొంటిని. మెత్తనివాఁడ వనుకొంటిని. ఇంత మోటపాకమా? ఇంత ముండివేసమా? లే! ఇఁక లే! గ్రుడ్లగూబవలె నట్లుచూచెదవేల? లే! నోరు మూసికొని యటుపోయి యామె పాద

ములపైఁ బడుము-లే-అదిగో-లెమ్మని చెప్పఁగ లేవఁడు? లేవక పోయినయెడల మూతిమీఁదఁ బొడిచెదను. నీమాత్రము గడు సుఁదనము—కష్టపడితనము—కఱకుఁదనము నాయొద్దనున్నవి. వదవద-నిన్నట్టె తిట్టవలదని మారాణి నానోరు నొక్కుటచే నిట్లింక సందేహించుచున్నాను.

గో—నీసందేహ మెచ్చటనో నాకుఁ గనఁబడలేదు. శివమెత్తిన చాకలిదానివలె గంతులువైచుచున్నావు.

కురం—ఆలాగేమి? ఆలాగేమి? వేఁపమండలు పుచ్చుకొని నీవీఁపు తట్టులుదేఱఁ గొట్టునప్పుడు కనఁబడును గురంగితమాషా.

గో—కొట్టుదువుకానిలే- నీపేరు కురంగియా? గొంతులు గోఱుకు గయ్యాళికిఁ గురంగి యని పేరా? సివంగి యని నిన్నుఁబిలిచినఁ గొంతవఱకు సరిపోవునేమో?

కురం—ఆఁఆఁ! ఏమి! నాపేరు కురంగియా యనికూడ ననుచున్నావా? చుక్కలలోనుండి యిప్పుడే యూడిపడితివి కాఁబోలు. మాయమ్మ వెఱ్ఱిపెద్దమ్మ తగనిమమకారముచేత నీయొద్దకుఁ బదేపదే పంపఁగఁ గాళ్లు లఱిగిపోయెనే! నీచుట్టుచుట్టు తిరుగలేక కన్నులు తిరిగిపోయినవే! నాకక్కఱలేదని మూలమూలలదాఁగి ముడుచుకొనిన నిన్ను ముందున కీడ్చి నిలువఁబెట్టి మారాణితో మాటలాడించితినే. బంగారుబొమ్మను నీబాహువుల కందిచ్చితినే-వెన్నయప్పమును నీమూతికిఁ గట్టితినే-ఉ-ఉ-నేను నీకుఁ జేసిన మహోపకారమునకు నాకాళ్లు కడిగి—

గో—ఛీ! ఛీ! నోరు మూయుము.

కురం—నీ ఛీఛీలకు బెదరువా రిక్కడ నెవ్వరులేరు. కృతఘ్నుఁడా! నాపేరే మఱచిపోయితివా? కురంగియా నీపేరు! అబ్బా!

గంజాయియుండ వేసికొంటివా యేమి?

గో—మాటలు తిన్నఁగరానీ! దొడపండ్లు విఱుగఁ గొట్టెదను-పో! ఆవలికిఁబో!

కురం—నేనుబోవను-మన్మిక్కడకు మోసముచేఁ దెచ్చియిట్లు మా గొంతుగోసెదవా? నిన్ను-నిన్నుఁ—గాళికాదేవికి బలినిచ్చిన నైనఁ బాపమున్నదా?

గో—నీవు పోయెదవా? గుడిమీఁదనుండి కాలిబంతి యెగిరిపడునట్లు తన్ననా?

కురం—సరే నీవు నన్నుఁ దన్నుదువో నేను నిన్నుఁ ద్రొక్కుదునో మన బలాబలములు చూచు కొనవచ్చును. మారాణిమాట నేమి చెప్పితివి?

గో—మీరాణిని నేనెఱుఁగను.

కురం—(గుండెలుకొట్టుకొని) అమ్మ. అమ్మ. అమ్మ. నిజముగా నీవె ఱుఁగవా? నీవుప్రమాణపూర్వకముగా నెఱుఁగవా? కాళికమ్మ గుడిలో దీపమార్పి చెప్పఁగలవా? అయ్యవార్లా కట్టినయింటి క్రిందనున్నావు. నా మొగమునంకఁజూడు. ఎఱుఁగవా ఎఱుఁగవా?

గో.—ఎఱుఁగను. ఎఱుఁగను.

కురం—సరే నడు. ఈమాటలు మారాణితో డనే చెప్పుము. లే.

గో—నేను మీరాణియొద్దకు రానక్కఱలేదు.

కురం—(ఏడ్చుచు) అక్కఱలేదా? గుండెలలోఁ బొడిచినవలెనాకి ప్పుడు జ్ఞప్తికివచ్చినది. నీవు మగవాఁడవు కావు. అక్కఱలే దని మొట్టమొదటినుండియు చెప్పులాడుచునే యున్నావు. కాని మారాణి కదేమి వెట్టియో పిశాచముకంటెఁ గట్టిగఁబట్టిన దమ్మా! మొదట నాకు నీమగతనమునుగూర్చి సందేహము

కంటఁగనేలేదు. కాని తరువాతఁగనిపించదమ్మా! నీశృంగారవనం భాషణంలో నైన నెక్కడ మగవాసనయే కొట్టలేదమ్మా! ఉప్పు లేని కూరలాగునున్న దేమిరా భగవంతుఁడాయని యేడువనే యేడ్చినానమ్మా! మాకొంప తీయుటకు నీవెక్కడ దాపురించితివి. అప్పుడే యీమొండిచేయి చూపలేకపోయినావా! ఒక్క యేడుపేడ్చి యూరకుందుము. ఇల్లుకదలి యింత యల్లరిఁబడకుండనుందుము. నీపై బండారము మండిపోను. నీమగపోడుములు మాసిపోను. నీనెత్తికట్టు నేలఁబడను. అమ్మా! అమ్మా! కళాలతికమ్మా! ఇటు రావమ్మా! కొంపమునిఁగినదమ్మా! గొంతు తెగినదమ్మా! (ఏడ్చును.)

గో—(తనలో) ఇన్నిపిట్లు తీని యూఁడు దాచనను బిరుదమార్జించుకొంటిని.

(కళాలతిక మేలుముసుఁగునఁ బ్రవేశించును.)

కళా—కురంగీ! ఏమి యీయల్లరి.

కురం—ఆపద్దయ్యేను మగతనము లేదు. నీకు మగఁడు లేఁడు. నాకమ్మవారి మొక్కు లేదు. ఇఁక నేమియు లేదు. ప్రపంచమంతయు నొక్కటే సున్నవడినదమ్మా! మాతల్లీ! (ఏడ్చును.)

కళా—(మేలుముసుఁగు రవంత తొలఁగించి చూచి) ఆహా! ప్రాణనాథా వచ్చితివా! నమస్కారము. నమస్కారము. నమస్కారము. నీవింక రాలేదేమనవలననో యనియు, వత్తువో రావో యనియు, నేను బొందిన తహతహ హారహరా! పగవానికైన వలదు. నాకన్నులలో నిప్పుడు చంద్రోదయమైనది.

గో—(నిలువుగ్రుడ్లు వైచుకొని స్తంభించి యూరకుండును.)

కళా—నాథా! నాథా! అట్లునిలువుగ్రుడ్లు వైచుకొని చూచెదవేల? ఏమి? ఏమి? మేలుముసుఁగుచాటున నీవు నన్ను గుర్తింపలే

కుంటివా? ప్రాణకాంతా! నీయెదుట నాకుమేలుముసుఁగెందు
లకు? (తీసి) మాటలాడవేల? మాటలాడవేల?

గో—(కన్నులుమూసికొని కొంతశాంతిపడి) మాటలాడెదను. మాట
లాడెదను. కాని యీదాసి నిక్కడ నుండకుండఁ బొమ్మని
చెప్పుము.

కళా—(అప) కురంగీ! నీవాతని నేమైన దుర్భాష లాడలేదుకదా!

కురం—అతఁడు వట్టి కొయ్యబొమ్మ. ఎందులకాభర్త? సువారములోఁ
గుండలు కడుగుటకా! నీకుఁ దలఁగడిగి నీళ్లుపోయుటకా?

కళా—(అప) వెఱ్ఱిమాటలాడక పో—ఇంటియొద్ద భద్రముగా నుం
డుము.

కురం—నీకే తెలియునులే. (కురంగి నిష్క్రమించును.)

గో—(తనలో)

గీ. వేయిమహతాబు లొక్కట • వెలిఁగిపోమె
వెలుఁగులో లక్షరుద్రవీణలు ధ్వనించెఁ
బాటలోఁ గోటిపద్మముల్ • పరిమళించె
మనసు గప్పిన వానిలో • మాయమయ్యె.

హా! ఇప్పటికిఁ గొంత కుదుటఁబడితినికాఁబోలు. కన్ను, ము
క్కు, చెవి, త్వక్కు కలియఁగలిసి యొక్కటేమైపోయి యేమో
యయినట్లయ్యెను. ఇట్టి వింతయవస్థమాత్రము నేనెన్నఁ డెఱుఁ
గను. ఒక్క తెప్పపాటుమాత్ర మట్టిస్థితియున్నదికాఁబోలు!
అదియే స్థిరముగా నుండినయెడల నంతకంటె మహాపదవియుం
డదు. ఇప్పు డావెలుఁగులోనుండి బయలువెడలి యాకాంత
కంటికి స్పష్టముగాఁ గనఁబడుచున్నది. ఆహా! మోహినిదేవత
యై యుండునా? హరహరా! ఎంతదుర్మార్గుఁడనో! పరస్త్రీ

కాంబోలు ! కాంబోలునేమి ? దాసీవాక్యములవలన స్పష్టమే యయ్యెనే !

కళా—ప్రాణనాథా ! నాదాసి కఠినోక్తు లాడినయెడల క్షమింపుము. దానిస్వభావమది. మనసు మంచిదే కాని నోరు బొత్తిగ మంచిది కాదు. ఇఁక దానిని నీయెదుటఁ బడనీయను. క్షమింపుము. కోపమును విడువుము. పరిసన్నుఁడవుకమ్ము. ఆతెలివితక్కువ దానిని నేను మందలింతును. నాథా! నీవిక్కడఁ గూరు చుండనేల ?

గో—ఈసత్రములోనే నాబస.

కళా—ఇంతసత్రములో నెక్కడ ? అదిగో మాగది. దానికి సమీపము ననేకదా ?

గో—ఆఁ ! కొంచెము సమీపముననే.

కళా—ప్రాణనాథా ! నీవు మాకంటె ముందేవచ్చితివా ?

గో—(తనలో) మాటమాటకుఁ బ్రాణనాథా యని సంబోధించు నీ మెను బరస్త్రీయని యెట్లనుకొనను ? ఆమెకు నేను భర్తను, నాకామె పరస్త్రీయా! నేను భర్తనని యెంతనమ్మకములేకుండ నన్నుఁ బ్రాణనాథా యని పిలుచునా ! వలచిన మానుజునిగూ ర్చియే పొరపాటుండునా ! గ్రద్దకన్నుకంటె- బాకుమొనకంటె- రవికిరణముకంటె- రాగవతికన్న తీక్ష్ణమగునప్పు డిట్టిపరిమాద మేలకలిగియుండును ? ఒకవేళ నిట్లు జరిగియుండునేమో! వట్టి మైమఱపుస్థితిలోనేగదా యీమెను నేను జూచితిని. అట్టిమతి యొక్క మైమఱపుస్థితిలోఁ జూచి పరాకుపడితినేమో ! హా ! యెంతమాట ! (ప్రకా) నేను వచ్చునరికి మీరున్నగదిలో నెవ్వ రును లేరు. అందుచే నేనే ముందు వచ్చియుందుననుకొందును.

కళా—ప్రాణప్రియా! నాపై నీ కనిష్టతలేదుకదా!

గో—ప్రపంచమును దుచ్ఛముగాభావించి ప్రాణము పోఁగొట్టుకొను వానికైన నీపై ననిష్టత యుండఁదగదు. నామాట వేఱె యడుగనేల?

కళా—ప్రాణకాంతా! పోనిమ్ము. కోపము లేకపోయినయెడల నంతే చాలును. కాని కోపములేనివాఁడవైన యెడలఁ దలవంచుకొని యే మాటలాడుదువేమి?

గో—(తనలో) అయ్యయ్యో! ఏమిప్రత్యుత్తరమీయఁగలను? అంతఃపురకాంత! రాజపుత్త్రిక! మేలుముసుఁగైనలేకుండ నాయెదుటఁబడి గాఢానురాగముగఁ బ్రాణప్రియా యని పిలుచుచుంట యేకాక నీకనిష్టతలేకున్న నాకంతేచాలునని యానందమొందుచున్న యీకాంతాశిరోమణి మనసు నొప్పించుటకంటె మహాపాతక ముండునా? నేను నీకు భర్తనుగానన్నచో డిల్లపడి కొయ్యనై మృతినొందునేమో? అందుదానికి రాగవిషయమగు నాశాభంగముకంటెఁ బాషాణప్రయోగము మఱేమియున్నది?

కళా—ప్రాణకాంతా! మాటాడవేమి?

గో—(తనలో) అయ్యయ్యో! ఆలోచించుకొననీయకుండఁ దొందరపెట్టుచున్నదే! ఆమెమనస్సెంత కొట్టుకొనుచున్నదో! ఏమి తహతహపడుచున్నదో! (ప్రకా) తలవంచుకొనియే మాటలాడెదవేల యని యడిగితివి. నా కట్లుమాటలాడుటయే యలవాటు.

కళా—ఔనుసుమా నిజమే. మొదట నేను నీతో మాటలాడినప్పుడు కూడఁ దలవంచుకొనియే మాటలాడితివి. కాని యెప్పుడు నదియే సిగ్గా?

గో—ఎంతసిగ్గుగలవానికైనఁ బరిచయము వృద్ధియైనకొలఁది సిగ్గు తగ్గిపోదా.

కళా—ప్రాణవల్లభా! నీకుఁ బెండ్లియగువఱకే సిగ్గు బాధించుచునే యుండును. కావున శుభముహూర్తమున వేగముగాఁ బెండ్లియవశిష్టము తీర్చుకొనిన మంచిది కాదా?

గో—(తనలో) ఈమె యిప్పటివఱకుఁ బరిశుద్ధకన్యాత్వమును వదలినట్లు లేదు. అందువలనఁ బరస్త్రీ కాదు. కొంత బ్రతికితినేమో! తలవంచుకొని మాటలాడునట్టిలజ్జావంతుని—దరుణులఁ జూచి వెనుకడుగువేయు భయస్వభావుని—నెవ్వనినో యీమె యొక్కసారి చూచి ప్రేమించి మాటలాడియుండును. ఆనిర్భాగ్యుఁ డందుల కర్హతలేనివాఁడగుటచే లంగాబెంగపెట్టుకొని యదియేపోకగా సంచరించియుండును. మగవాఁడగువాఁ డీమెను వదలి పోఁగలఁడా? ముక్కున్నచిలుక దొండపండు కొఱుకలేక బెదరి డొంకలోఁ దూఱునా? అదిగాక ఆతఁడాడంగివాఁడని మొదటినుండియు ననుమానించితినని కురంగి తన రోదనరాగములో నొక్క పెద్దసంగతి విసరియే వెళ్ళినది. ఆటవికబెదరు రసికశిఖామణి యదృష్టవశమున నాలాగున నుంటచే నీ రాగవల్లి నామెడకుఁ జుట్టుకొనినది. కావున నీవిచిత్రశృంగారనాటకమున నేనుఁ గూడ బాడిదఁ బూసికొని బొంతవేసికొని నిలువఁబడితిని. ప్రధానుఁ డెవఁడో కొంత మాటలకథ వినిపించి గొంతులేనివాఁడగుటచేఁ బైపాటకుఁ బనికిరాక తిరిగిరాకుండ నిష్క్రమింపఁగా వాని బదులుగా వచ్చిన తాత్కాలిక ద్వితీయపక్షనైలూషుఁడను. వెనుక జరిగిన కథయేదో తెలియదు. ముందప్పఁజెప్పవలసిన పాఠ మంతకంటెఁ దెలియదు. ఈపా

త్రము ప్రాణనాథాయని పిలుచుచుం దలవంచుకొనినైన నుండ
నీయదు. రవంత యూరకనైన నుండనీయదు.క్రొత్తవాఁడను.
గ్రంథమెఱుఁగనివాఁడను.తలవంచుకొనక యూరకుండక యిం
తట నేమిసేయఁగలను?

కళా—అదేమి ప్రాణనాథా! మాటలాడకున్నావు. పెండ్లిమాట చెప్పు
సరికి మఱియింత సిగ్గుపడుచున్నావు! అబ్బే! (భుజముమీఁద
జేయివైచును.)

గో—(తనలో) ఆహా! ఆహాహా!

ఆ. వె. అబ్బెమాట లాగ ♦ యంత్రవు వీవన
వేగతిరిగి గాలి ♦ విసరు పగిదిఁ
జెలువ బుజము నంటఁ ♦ జిత్తము గిఱగిఱఁ
దిరిగి యూర్పుగాలి ♦ పెరుగఁజేసె.
ఆహా!

గీ. బహుక్రతు లొనర్చి యర్పింపఁ ♦ బ్రభుఁడు కవికి
నగ్రహారాళి యొసఁగిన ♦ యంతకంటెఁ
దనకు సేవలొనర్చు శి♦ష్యునకు గురుఁడు
కృపను వేదాంత విజ్ఞాన ♦ మిచ్చుకంటె
నిష్టదేవత నాత్మఁ బ్ర♦ రించి తపసి
కీప్సితవరంబు లన్నియు ♦ నిచ్చుకంటె
నడుగకయె కాంత కాంతుని ♦ యంసమునను
గరముఁ జేర్చుటె యానంద ♦ కరము కరము.

ఈ యెడమబుజముమీఁద నీమె కర మెంతదివ్యముగ శోభిల్లు
చున్నది! ఏరాజు శిరముపైఁ గిరీట మిట్లు ప్రకాశించినది?
ఈమెతో నిదివఱకే రవంత టక్కుటిక్కున మాటలాడితిని.

ఇప్పుడదియుఁ గూడఁ జెడినది. ఇప్పుడేమందును ? (ప్రకా) కాంతాశిరోమణీ ! నీదయకు మహానంద మొందితిని.

కళా—ప్రాణప్రియా! ఇంత సేపాలోచించి తుద కెంతమాటఁ జెప్పితివి !

గో—(తనలో) సిగ్గువలన నేనువదలు గాన్నై నను దన్నుఁ గౌఁగిలింపలే దని యిట్లు విలవిల లాడిపోవుచున్నది. నేను గౌఁగిలింప లేక పోయితినని యంతకంటెఁ గొట్టుకొనుచున్నాను. ఏమి విధి యోగము ?

ఏనుగౌఁగిలింపకయున్న ♦ నేమి లెమ్ము ?
చేయిమాత్రి మచ్చటినుండి ♦ తీయవలదు.
సత్ప్రభుని జిహ్వపై నిల్చు ♦ సత్యమట్లు
నిశ్చలంబుగ నచటనే ♦ నిలువనిమ్ము.

అయ్యయ్యో ! రాగతరంగములఁ గొట్టుకొని యూఁపిరి సలుప కుండ నున్నాను. హాఁ ! పోనీ ! నాకీగొడవ యెందులకు ? ఛీ-తప్పించుకొని పోదునా ? ఆమె సెలవుగైకొనకుండ మోట తనమునఁ బోవుట మహాప్రమాదముకాదా ?

కళా—(నవ్వుచు) మనోవల్లభా ! నీవింత సిగ్గుకలవాఁడవగుటచేతనే కురంగి మొదటినుండియు నీవాడంగివాఁడవని యధిక్షేపించి నది సుమా !

గో—(తనలో) అబ్బ ! మంచి వంకస్ఫురింపఁజేసినది. నేనాడంగివాఁ డనని యొప్పుకొందును. ఇప్పుడు నేఁజేయుచున్నపని యాడం గితనము కాక యంతకంటె నేపరియోజకత్వమున్నది ? తెలివి యుండియుఁ బనిచేయని యవస్థలోనది తెలివితక్కువకంటె భిన్నమా? భాగ్యముండియు నక్కఱకు రానప్పుడదిభాగ్యహీనత కాదా? ఉన్నందులకుఁ బనియేనిదర్శనము. కాని మఱియొక బ్రా

థ- ఇప్పటికిఁ దప్పించుకొనుట కట్లాడిన యెడల ముందటి యాశకూడఁ బూర్ణానుస్వార మగునేమో ? ఏటి పెట్టి ! ఈమె యిటునన్నుఁ బట్టుకొనునని కలఁగని యిటకు వచ్చితినా ? ముందీమెతోఁ గలయిక నాప్రయత్నమునుబట్టి జరుగునా ? ఏది యెట్లు జరుగవలయునో యట్లు జరుగును. (ప్రకాశముగా) నేనాడంగినని కురంగి మొదటినుండి చెప్పుచున్నమాటలు సత్యములేల కాకూడదు ? అది యథార్థవాదిని యనియే నమ్మవలయును.

కళా—అగుఁగాక ! అట్లే యయినను బ్రిమాద మేమి ? నీవే నాభర్తవు. నామనస్సు నీయందు లగ్నమైనది. మనస్సునకు స్త్రీపురుషభేద మేమున్నది ? నిన్నుఁ గాదని మహేంద్రునైన నేను వరింతునా ?

గో—(తనలో) సెబాస్ ! సెబాస్ !

గీ. యక్షులార ! కిన్నరులార ! ♦ యమరులార !
అజమహాసృష్టి నెచ్చట ♦ నైనఁ గాని
యిట్టికాంతను గంటిరే ♦ యింకఁ బుష్ప
వృష్టిగురియక మీ రుపే ♦ క్షింతు రేల ?
నీతి-నిశ్చలంపు ♦ నీతి-యాలోకత్రి
యంబునందు నెచట ♦ నైన నున్న
నద్ది యాఁడుదాని ♦ యంతఃకరణమందుఁ
గన్ను లున్నవారు ♦ కానవచ్చు.
పూతత నొసంగునో వంశ ♦ పురుషులార !
తనువు నిచ్చిన మాతలి ♦ దండ్రులార !

ప్రజ్ఞనిచ్చిన యాచార్య • వర్యులార !
ఈమెను గ్రహింతు సెలవంద • జేయరయ్య.

(కౌఁగిలించును.)

కళా—(తనలో) హృదయమా ! ఆనంద మాశాభంగమువలెనే నిన్ను బాధించుచున్నదా ! శాంతి నొందుము. (ప్రకా) ప్రాణనాథా ! నన్నొక్కసారియైనఁ బ్రాణప్రియా ! యనిపిలువలేదేమి?

గో—ప్రాణప్రియా యని పదునాల్గుసారులు పిలిచిన నీకంటె నెక్కుడు గాటముగఁ గౌఁగిలించితినిగాదా ? పిలుపు గాలి కెగిరిపోవును గాని యిప్పుడు గాలి చొరఁబడుట కవకాశమేది ?

కళా—నాథా ! నీవు పూర్వము నన్నుఁ గౌఁగిలించినపుఁ డేమంటివో జ్ఞప్తి యున్నదా ?

గో—(తనలో) అయ్యో ! నాయజ్ఞత బయలగును గాఁబోలు ! అక్షరములు చదువకుండ మాటలు చదువనారంభించిన క్రొత్తశిష్యున కొక్కసంవత్సరము దాఁటిననైన నన్నివర్ణములగుర్తు లేనట్లు నడుమనుండి కలిగినదగుటచే నాకథాజ్ఞానము పచ్చిపచ్చిగ నేడ్చుచున్నది. ఇఁక కొంతకాలము పోయినతరువాత సందర్భమును బట్టి పూర్వగాథను గ్రహింపఁగలను గాని యిప్పుడైనను నేనుగాని వాఁడెవఁడోయన్నమాట నేనెట్లు చెప్పఁగలను ? (ప్రకా) నిన్నుఁ గౌఁగిలించినప్పు డేమంటినో జ్ఞప్తియున్నదా యని యడిగితివి. పూర్వమేదో పరమేదో వర్తమానమేదో యేమియుఁ దెలియని యవస్థలో నేనుంటిని. నన్నిఁక నేమియు నడుగకుము.

కళా—ఇఁక నొక్కమాటమాత్ర మడిగెదను.

గో—అడుగుము. తోఁచినయెడలఁ జెప్పెదను. లేకున్న క్షమింపుము.

కళా—మనపెండ్లి యెప్పుడు?

గో—(తనలో) అప్పుడే పెండ్లియా? ఆయూడంగివాని సంగతియేదో కొంత చూడవలదా? (ప్రకాశముగ) నాసేవకుఁడింక రాకున్నాఁడు. అతఁడు వచ్చినపిమ్మట యోజింపవచ్చును.

కళా—అలాగే—చూడు మఱియొక్కమాట మనపెండ్లిలోఁ గురంగి పెండ్లికూడఁ గానీయ వలయును.

గో—దానిచేతిలో మగఁడు దక్కునా?

గీ. చంటిపిల్ల దక్కఁగ లేదు ♦ జనకుచేత
వెఱ్ఱిదాతచేతను రాజ్య ♦ విభవముడఁగుఁ
గనకకళ నశించును స్వర్ణ ♦ కారుచేతఁ
జెలువుఁడు నశించు రాకాసి ♦ చేతిలోన.

కళా—అబ్బే! మెత్తని మనస్సుగలది. దానికిఁ గూడఁదగిన మగఁడు దొరకిన బాగుగా నుండును.

గో—పురుషలోక మంతయు వాఁడుమలయూళముగాఁ గనఁబడు నావీర శిరోమణికిఁ దగిన భర్తయెవ్వఁడు దొరకును? చూడు ప్రాణేశ్వరీ!

కళా—ప్రాణేశ్వరా! చూడు ప్రాణప్రియా యనుమాటకంటె ప్రాణేశ్వరీ యనుమాట సొగసుగా నున్నది సుమా! నీవెప్పుడు నన్నట్లే పిలుచుచుండుపుగాదా! నాకామాట యిదివఱకు స్ఫురించినది కాదు.

గో—నీయిష్ట మెట్టులో యట్టులే పిలుతును. నీవిప్పటికి నీగదికిఁ బొమ్ము. నేనుబోయి నాసేవకుఁడెచ్చట నైన నాకొఱకుఁ దిరుగుచున్నాఁడేమో కొన్నికొన్ని సత్రములఁ జూచి వత్తును.

కళా—ప్రాణేశ్వరా! తిరుగ నెప్పుడు వత్తువు?

గో—(చిటుకవైచి) అంతలో రానా? (నిష్క్రమించును)

కళా—ఈమాత్రమునకై కురంగి యెంతయల్లరిచేసినదో! హా! గోవర్ధనా! ప్రాణేశ్వరా! వేగముగ వచ్చెదవుకదా!

(నిష్క్రమింపఁగ, వెంటనే స్త్రీవేషమున సరస్వతి ప్రవేశించును. ఆవీథిలోనే మఱియొక చివర.)

సర—గోవర్ధనత్వము వదలిపోయినది. ప్రాణేశ్వరత్వము దానితోడ నేయెగిరి పోయినది. స్వస్వరూపముతో నే నుంటిని. మగవేషముననుండఁ గురంగి చెప్పినచెప్పులు పైకిఁగానఁబడని కళాలలితలోలోని తొందరలు తలఁచుకొనఁగ నవియెల్ల సహింపఁ గలిగితినో యని నాకేయాశ్చర్యముగ నున్నది.

గీ. తెమ్ము తేకున్నఁ గారకుఁ ♦ బొమ్మటంచు
నఱచు ఋణదాతకోఁతల ♦ నందవచ్చుఁ
గానియక్కఱఁ దీర్పఁగ ♦ లేని యప్పు
డువిదపొడుచు శూలపుఁబోటు ♦ లోర్వవశమె?
పరులదురవస్థలకు నవ్వ ♦ వచ్చు నద్ది
యొక్క యాడంగితనమె యీ ♦ యుర్వియందు
బంధువుల శుభంబులకుఁ దా ♦ పంబు మదికిఁ
దార్చునది యొక్క చూలాలి ♦ తనమె భువిని.

అట్టి సంకటావస్థ వదలినదని సంతోషింపవలసినదే కాని యరక్షితనై స్త్రీవేషమున నుండుట మఱియింతప్రమాదమేమో? కూడ వచ్చిన యొక్కదాసియుఁ బోయినది. నానాఁడును కళాలలితుఁడు నన్నిప్పుడు చేసునో! ఎప్పు డాతనితో సుఖయింతునో? ఉన్న దేదో విడిచినదానికిఁ దొందరపడి యాపోయిన దేదో తిరిగి రావలయు నని యేడ్చుట బుద్ధిహీనుల లక్షణమే

కాదా! స్త్రీలకు నందులో రాగవతులకు వివేచనశక్తి యుం
డకపోవు టాశ్చర్యమేమి?

(నేపథ్యమున) సరస్వతమ్మా! సరస్వతమ్మా!

సర—(అటునిటు చూచుచున్నది.) ఎవరు నాపేరినే పిలుచుచున్నారే!

(నేపథ్యమున) అటుకాదు; నేను మధురికను. ఇదే మాబస. ఇది
గో వచ్చుచున్నాను.

సర—పోనీ! నమ్మినదాసి తోడున్నది కదా! ఇఁక భయము లేదు.

(మధురిక ప్రవేశించును.)

మధు—(కౌఁగిలించుకొని) అమ్మా! మగవేసము తీసివైచితివా! సం
తోషమే. మగవేసపు బిగింపున మీయంగవర్తులత కనఁబడిన
దికాదు కాని యిప్పుడు కన్నులపండువుగాఁ గనఁబడుచున్నది.
మేము మీకొఱకే నిరీక్షించి తిరుగుచున్నాము.

సర—మే మనుచున్నావు నీకుఁ బెండ్లి యయినదా?

మధు—భర్త దొరకినాఁడు కాని పురోహితుని మూఢదోషమువలన
మాకు గాఢాశ్లేషము లేదు. నిజముగాఁ బెండ్లి కాలేదమ్మా!

సర—కాని నాకొఱకు నిరీక్షించుచున్నా మని చెప్పితివే? నేనిటకు
వత్తునని నీకెట్లు తెలిసినది?

మధు—మమ్మిచ్చటికి రమ్మని మీరే కాదా భీమపురమునఁ గాఁబోలు
చెప్పి మీరు ముందు బయలుదేఱి వచ్చితిరి.

సర—ఆఁ! నేను నీతో నట్లు చెప్పితినా? ఎవరు చెప్పఁగ నేను చెప్పితి
నని భ్రమించుచున్నావో సుమా?

మధు—(తనలో) ఈమె మగరూపున నాడిన మాటలుగాని చేసిన చ
ర్యలుగాని తిరుగ విననొల్లదు. నేను, భ్రమరుఁడు మావివా
హమును గూర్చి మాటలాడుకొనుచునుండఁగా నీమె యచ్చటికి

వచ్చి నన్నెఱుఁగనట్లే నటించెను. నావేరేదనికూడ నడుగుటకు సాహసించెను. ఇప్పుడు స్త్రీవేషమున నావృత్తాంతమంతయు నెఱుఁగనట్లు నటించుచున్నది. ఈమె యిట్టిగడుసుది యని నే నెఱుఁగకపోయితిని. గడుసుఁదనము కనఁబఱచుట కవకాశము రానంతవఱ కందఱు బేలలే (పరిహాసముగ) ఎవతెనో చూచి మీరని భ్రమించితినా ? నాకేమి కన్నులు లేవా ? బుద్ధిలేదా ! మీతోఁ గూడఁ బెరిగిన నేను మిమ్మెఱుఁగనా ? ఒకతెనుజూచి మీరని భ్రమించుటకు నేను బిచ్చిదాననా ? అమ్మా ! ఇచ్చట నీవు నేను దప్ప మఱెవ్వరున్నారు ? మీరహస్యములు నేను వెల్లడించుదాననా ? అమ్మా ! మీసెలవుపై మీకొఱకిచట నిరీక్షించుచున్నాము. వచ్చితిరి. మహాసంతోషము.

సర—నీవు దాసివయ్యును నన్నుఁ బరిహాసించుచుంటివి! జాగ్రత్త.

మధు—నీవు సరస్వతమ్మ వగుదువా ? సరే. నీవు గోవర్ధవేషమువేసి నావనుట నీకు సమ్మతమేకదా ?

సర—ఔను. కాని నేను జెప్పనిమాటలు చెప్పితినని నీవననేల? నన్ను భీమపురమునఁ జూచితినని యసత్యమాడ నేల ?

మధు—భీమపురమో ధర్మపురమో నాకుఁ దెలియదు. ఈగ్రామము లపేళ్ళు నాకు గుర్తులేదు.

సర—అదిగో ! తిరుగ వ్యత్యస్తముగాఁ జెప్పుచున్నావు.

మధు—ఎటువచ్చినను గ్రామనామమును గూర్చియు మీరు చెప్పిన మాటలను గూర్చియు మన కీవివాదమేల ? మీరు చెప్పినను జెప్పకున్నను మిమ్ముఁ గలిసికొనవలసినదాననే కాదా ! క్షమించి మాబసలోనికి రమ్ము. పోవుదము.

సర—నాకిట్టి నాలుకమడతమాటలు పనికిరావు. మనసులో బెంగపె

ట్టుకొని నే నేమ్చుచుండఁగా దాసివైనదానవు నన్నుఁ బరామ
ర్శించుటకు బదులుగాఁ బరిహాసింతువా? నేను గోవర్ధనస్వ
రూపమున భీమపురము రాలేదు.

మధు—అది యేదిక్కుమాలిన యూరో అమ్మా! నాభర్తయూరు. భ్రమరా! నీవిటు రా.

సర—అతఁ డేల?

మధు—ఆయూరిపే రేదో చెప్పును.

సర—ఏయూరను గూడ నిన్ను నే నిదివఱకుఁ జూచియుండలేదు.

మధు—అయ్యయ్యో! ఇది మఱింత విచిత్రముగానున్నది. చాలులే అమ్మా! (భ్రమరుఁడు ప్రవేశించును.)

భ్రమ—ఆ! ఆ! ఇదేమి. ఇదేమి. ఓహో మీరా? గోవర్ధనప్రభూ! నమస్కారము.

సర—ఆఁ! ఆఁ! నీ వెవఁడవు? నన్ను గోవర్ధనప్రభూ యని పిలుతువేల?

భ్రమ—మీయిష్టానుసారముగ మీరు కాంతావేషధారణ మొనర్చినను నాకు మీరు గోవర్ధనప్రభువులే. మేమపేక్షించునది మీకొలువుగాని రూపముకాదు

సర—(అప)తుచ్ఛురాలా! నేను గోవర్ధనవేషధారిణి నైతినని నీవు నీభర్తతోఁ జెప్పితివా?

మధు—(అప) అమ్మా! నీపాదములతోడు. చెప్పలేదు. చెప్పుటకెన్నిసారులో రహస్యము నాలుకవఱకు వచ్చినది. నాప్రమాణముగా నేను జెప్పలేదు.

సర—(అప) చెప్పకున్నయెడల నేను గోవర్ధననాముఁడనని యాతనికెట్లుతెలిసెను? మీరహస్యములు నేనువెల్లడించుదాననా అని

యిప్పుడంటివికదా! ఇట్లు నామర్యాదతీసివేయుట నీకుఁదగునా! బానిసా! పలుగాకీ! (ప్రికా) భ్రమరుఁడా! నాపేరు గోవర్ధనుఁడని నీకెట్లు తెలిసెను?

భ్రమ—మీరు చెప్పుటచేతనే తెలిసెను.

సర—నేను నీతోఁ జెప్పలేదు. నిన్నుఁజూడలేదు. నీవెవఁడవో నేనెఱుఁగను.

భ్రమ—నేను మీయొద్దఁ జేసినకొలువునకు నాకు జీతమీయవలసియుండుట కింతకావలయునా! బాబూ! చాలు. చాలు. ఇదిగో మీమాటలసంచి, ఇందులోనే లెక్కపత్రిముంచినాను. మీసంచి మీరుతీసికొనుఁడు నాజీతము మీరీయనక్కఱలేదు.

సర—నేను నీకు సంచి నిచ్చియుండలేదు.

భ్రమ—మీరిచ్చియుండలేదు. మీయొద్దనుండి నేనె మీయొప్పుదలపై మీపెట్టెలోనుండి తీసికొంటిని.

సర—అది నాసంచికాదు, నాయొద్ద నీవు తీసికొనలేదు.

మధు—(అప) ఇప్పుడావెనుకవరాలు లేవియు నామెను జ్ఞప్తిచేయక యున్నా! పురుషరూపముగఁ జేసినవస్త్రలామె యేమియు నొప్పుకొనకుండనున్నది. భావము వెలాగునఁ గనఁబడుచున్నది. ఎందుల కామెను మఱికొంత సేపునుపు.

భ్రమ—(అప) నేను న్యాయబుద్ధిగలవాఁడను. నాకొకనికోపమునకు లక్ష్యములేదు. ఊరికేపుబానిసవు కావున నాతనికొల్వులో నీవుండుము.

మధు—(అప) అనఁ దనెకవేల? అవును యుసుము. వానికొలువులో నేనెందుల కుండను?

భ్రమ—(అప) నీమొగము. ఆతఁడు గోవర్ధనుఁడు. అఁడుదియనిభ్రమింపకు.

మధు—(అప) సరిసరి! చాలులే! నాకంటె నీకెక్కువ తెలియునా? మగవాఁడైనయెడల నాఁడువేష మేల ధరించును?

భ్రమ—(అప) ఒక్కొక మగవానికదియొక ముచ్చట.

సర—మీారిద్ద ఱాలోచించి కుట్రచేసి నన్నిట్లు బాధింతురా! పొండు. మీారెవ్వరు నాకక్కఱలేదు.

భ్రమ—ఇదిగో మీాసంచి; మీాకొలువు నాకక్కఱలేదు. (సంచి పాఱవేయును.) మధురికా! ఇచ్చట నీవు సాక్షిణివి. పైనఁ బరమాత్ముఁడు సాక్షి. (పోఁబోవును.)

మధు—(అప) నాథా! కోపపడకుము. ఉండుము.

భ్రమ—(అప) నీవాతనియొద్ద నుండుము నే నుండను. మనసంబంధ మింతమాత్రమునఁ దెగునని యెంచకుము. నీవు బసకెప్పుడు వచ్చెదవు?

మధు—(అప) ఈమెను శాంతపఱచి బసకుఁ దీసికొనివత్తును. ఈలోన నీవు సంతకుఁ బోయి యీామెవర్ధనలోనికి మంచిమంచి కూరలను దెమ్ము. (పోవును.)

భ్రమ—ఏమో! గోవర్ధనప్రభూ! నమస్కారము.

సర—(తనలో) నాగోవర్ధనత్వము నానాఁటఁ దెలియఁగును. అనన్నిటైన నే నాఁడుదాననను నిశ్చయము లేదు. ఈముండ నాకొంప తీసినది. (ప్రకా) పో! నీవుకూడఁ బో!

మధు—తుపానుగాలి తీవ్రత్వము నన్ను వెనుక నీసన్నిధినుండి వేఱుచేసెను గాని నీకోపతీవ్రత యట్లు చేయఁగలదని యెంచకుము.

సర—అంతకంటెఁ దీవ్రమగు తుపానుగాలి నాహృదయమున వీఁచు

చున్నది. నాయాపద లింతట నడఁగవని నాకుఁ దోఁచుచున్న
ది. నారహస్యములను వెల్లడించు నీవు నాకక్కఱలేదు. నాబ
సను నేను జూచుకొందును. నీవు పొమ్ము. (పోఁబోవును.)

మధు—అమ్మా! సరస్వతమ్మా! అమ్మా! సరస్వతమ్మా! నావలన
నేరమేమియు లేదు.

(నేపథ్యమున) భటులారా! ఈపక్కనుండి యొకఁడు నాపక్క
నుండి యొకఁడు వచ్చి వారిద్దఱను బట్టుకొనుఁడు.

మధు—అమ్మయ్యో! అదియేమి? ఈసంచికొఱకు దొంగలు వచ్చు
చున్నట్లున్నారు. (సంచి తీసికొనును.)

సర—ఆకంఠరవము మునుపు వినినదివలె నున్నది.

(ఇద్దఱుభటులతో జయరామసింగు ప్రవేశించును.)

జయ—నీవాపెండ్లికూఁతురుగారిని బట్టుకొమ్ము. నీవీదాసిని బట్టుకొను
ము. ఈముండయే యింతకును మూలము.

(అట్లు భటులుచేయుదురు.)

పెండ్లికూఁతురుగారూ! మనలఁ గాదనికిదా పరుగెత్తుకొనివచ్చి
తిరి? తుదకు మనమే గతి యయినది. చూచితిరా సింగారిం
చుకొని సిద్ధముగా నున్నాము. ఇఁక నొక్కగడియలోనే పెం
డ్లి, పునస్సంధానము, గర్భాధానము. భటుఁడా! అవి రెండు
నొకటా! దేని కని వేఱా! నీభార్యకేకాని నీకుఁ దెలియదు
కాఁబోలు; పుత్రోత్పత్తియుఁ గావలయును. మనము తలఁ
చుకొన్నతరువాత భూతభవిష్యద్వర్తమానములు మూఁడును
గట్టుగట్టి కాశికావడికిఁద మోయవలసినదే. మనము నీకొ
క్కదానికి వచ్చులేదు గాని మనహోరు దిగ్దంతుల చెవులలో
మ్రోఁగుచున్నది. భటుఁడా! నీ వీమెను దీసికొని మనమేడ

మీఁద గదిలో నుంచుము. అప్పట మన భృత్యుఁడు సారం
గుఁ డున్నాఁడు. ఆతని కప్పఁజెప్పుము. మనము నిష్క్రమింతుము.
(భటుఁడొకఁడు సరస్వతిని నోరుమూసి తీసికొనిపోవును.)
భటుఁడా! నీ వామెను మూఁతిపైఁ గొట్టుము. మనమే కొట్ట
వలసినది కాని దాసిదానిని జేయి చేసికొనుట మాత్రము మన
వంశమర్యాదకుఁ దగదు. తిరుగఁబడి కొట్టినపు డెవఁడైనఁ
జూచునెడల రాజమర్యాద కిది తగదు. (భటుఁడు కొట్టును.)
నీసొమ్మేమి పోయెనురా! గట్టిగఁ గొట్టు! (కొట్టును.) దీనిని
గట్టకట్టి కోటకందకమునఁ బాఱవేయుము పొమ్ము.

(భటుఁడు ముఘురికతో నిష్క్రమించును.)

ముందు ప్రతిసంవత్సరపూరాత్రి జయరామజయంతి జరుగఁ
దగినంతచర్య జరుపుదుము. వెనుకటి జయంతులవారందఱు
తప్పుదారిగా నట్టిఘనత నొందిరే కాని యిది యపూర్వబుద్ధిని
జేయు చర్య. దాసిముండను గోటకందకమునఁ బాఱవేయిం
చినవాఁడు సూర్యచంద్రవంశ్యులలో నెవ్వఁడైనఁ బొడకట్టుచు
న్నాఁడా? ఇంక ముందుచర్యలోఁ గ్రొత్తపెండ్లికూఁతురుతో
మన సరసమున్నదే, అది చిక్కైన పట్టు; పూర్వశృంగారశా
స్త్రములలోఁ గ్రొత్తయధ్యాయ మొకటి దానినిబట్టి నగిసపరి
శోధకమండలివారు ప్రత్యేకతాళ్ళమీఁదఁ జెప్పవలసియుం
డును. మనబుద్ధి కసాధ్యమైనపని లేదు. పెండ్లికూఁతురుగా
రప్పుట, మన మిచ్చట నుండుటచేత మన్మథునికి విరహబాధ
యొక్కుఁగా నుండునని శేషధర్మములలో నున్నట్లు వింటిని.
ఆమెను జమత్కారముగాఁ గాలు పట్టుకొని, కనఁబడకనఁబడ
నట్లుగాఁ బైటవాటున—

గో—పోనిమ్ము. ఇవియన్నియు నాకేల? నాసంచియిచ్చి పొమ్ము.

భరిమ—నీసంచి నీమెదుటనే గిఱగిఱదిప్పి పాఱవైచితిని. నాజీతము నీవీయఁబోయితివి. పోనీ! నేనంతగతిలేనివాఁడను గాను. నీవే బాగుపడుము.

గో—జీతముకొఱకు సంచి యట్టిపెట్టుకొందువా? ఇదిగో నీసొమ్ము. (ఈయఁబోవును.)

భరి—నాకక్కఱలేదు. నీతో ఋణసంబంధము నేను వదలుకొంటిని. (నిష్క్రమించును.)

గో—భరిమరా! భరిమరా! (కూడఁబోవును.)

(నేపథ్యమున) గోవర్ధనా నావెంటరాకు-(గోవర్ధనుఁడు నిష్క్రమించిన వెంటనే వెనుక తెరయెత్తఁగ నావీధిని మఱియొక్క భాగమున నొకమేడమీఁద సరస్వతి ప్రవేశించును.)

సర—హా! భగవానుఁడా! ఎంతగతిసిద్ధించెను! భటునిచే నీడ్చుకొనిరాఁబడి యిక్కడ నుంపఁబడితిని. ఇఁక నాతఁడు నాగదిలోనికి వచ్చును గాఁబోలు. ఒక్కఁడు వచ్చినయెడల భయములేదు. ముందు భటులనంపించి మంచమునకు నన్నుఁ గట్టించివేయునేమో! ఏమి యుపద్రవము జరుగునో? నాదాసిచేఁ బరిభవింపఁబడితిని. దానిభర్తచే నిందింపఁబడితిని. పెండ్లిచేసికొనుటకొల్లక విడిచివచ్చిన యధమునిచేతఁబడితిని. ఈపెద్దమ్మ తెలివితేటలకట్టిపని చేయఁదగిన వాఁడుకాఁడు. మానవతితల్లి ప్రోత్సహించి వానినిటకుఁ బంపియుండును. మేమిక్కడనుండుమని యాతఁడు యెఱిఁగియుండఁడు. కాని యీకాళికాదేవి యుత్సవములు లోకప్రసిద్ధములగుటచే నివి చూచుటకు వచ్చియుందునేమోయని తగిన పరివారములతో నాతని నామెపంపియుండును.

ఇఁక ముందుగతియేమి? హా! కళాలలితా! నీభార్యనుగానున్న నాకిట్టి దురవస్థవచ్చినది. సరస్వతినైనయెడల నీతో నెక్కువ సుఖపడుదునని గోవర్ధనస్వరూపమును విడిచితిని. హా! భగవానుఁడా! రక్షించు. రక్షించు. రక్షించు.

(పిమ్మట గోవర్ధనుఁడు ప్రవేశించును.)

గో—ఎక్కడ వెదకినను గానఁబడఁడు. ఏమైపోయినాఁడో! చెడఁద్రాగి యున్నట్లున్నది. కాళికోత్సవము లగుటచేఁ దక్కువజాతివారు దఱచుగాఁ ద్రాగుచుందురు. మాడలసంచియను పేరేకాని దానిలోఁ బదిమాడలైన లేవు. విశేషధనమున్నయెడల నాల్గుదినముల పరిచయముమాత్రమే యున్నవానికప్పఁజెప్పియుందునా? పోయినఁబోవును. ఇఁక [illegible]నలాభమేమి? బసకుఁబోయి నాద్వితీయప్రాణమగు కళాలలితను గాంతును. పాపము! నాకొఱకు వేచియుండును. వాఁడెవఁడో మాఁడంగివాఁడగుటచే నాకీమహాలక్ష్మి సిద్ధించినది. ఈప్రపంచమునం దెక్కడఁ జూచిన నొకని యశక్తిచే వేఱొకఁడు బాగుపడుచున్నట్లు కనఁబడుచున్నది.

గీ. జ్వరితులంఘనమునుమందు • వైద్యువిందు
వాదియొకరి భిక్షుఁడెవ్వాఁడు • వాదిలప
రాజుతలమ్రొక్కియేమంత్రి • కవల పెట్టి
క్షోరలమ్మెదె పేదపూ • జారినోము.

అనఁగ నావలెనే యుంటచేత నెఱుఁగకుండ నాకు మహోపకారము చేసిన యామాఁడంగి వానినెంతయుఁ గొనియాడఁదగును. ఎప్పటికైన నాతనిఁ జూడ వేడుకపడుచున్నాను. అతఁడెక్కడనున్నాఁడో?

సర—(మేడమీఁదినుండి) ఎవరునాయనా! ఇక్కడ-ఇక్కడ దిక్కు మాలిన దాననై యున్నాను. మర్యాద పోవనున్న యీఁడు దానిని రక్షింపఁగలవా! నాయనా!

గో—ఆఁ. ఆఁ. అదేమి? (పైకిఁజూచి) అమ్మా! వచ్చుచున్నాను. భయపడకుము. పదిబారల త్రాఁడు పైననున్నదేమో చూడుము.

సర—నాయనా! మూరెడు త్రాడున్నయెడల నీకు శ్రమమిచ్చెదనా?

గో—(తనలో) అయ్యో! ఇది యాత్మీయబాధవలెఁ గానిపించుచున్నది. కాని పరబాధవలె నెంతమాత్రమును లేదే! ఒడలు వడఁకుచున్నది. హృదయమునఁ జేయివెట్టికెలఁచినట్లున్నది. (ప్రకా) అమ్మా! వచ్చుచున్నాను. నేనాపెద్ద మఱ్ఱిచెట్టెక్కి మేడఁదరిగ వ్యాపించిన యాకొమ్మమీఁదనుండి మేడవసారాలోనికి దుమికెదను. దీపమున్నయెడల నెవ్వరైనఁజూతురు. అదిగాక అమ్మా! అంతఃపురకాంతవు నీకంటికిఁ బురుషుఁడగపడఁవగదు. అదిగాక నేనునుగులకాంతను గలవాఁడను బరకాంతనుజూడను.

సర—అలాగే-(దీపమార్పఁబోవును.)

గో—అమ్మా! ఇంకనార్పకుము. నుఱ్ఱిమొక్క మూలస్థలమును జూడనిమ్ము. (చూచి) అమ్మా! ఇంక దీపమును ఘనమొనర్పుము.

సర—(ఆర్పును.)

గో—ఇదిగో-ఱెప్పపాటులోవత్తును. (గోవర్ధనుఁడు నెక్కిపోవును.)

సర—ఇతనిమాట యెందువలననో నాకు విశ్వాసపాత్రముగానున్నది. అదిగాక యీతఁడు—మాటలాడగ నేను మాటలాడినట్లే యున్నది. కానిమ్ము ఈయాపదనుండి విముక్తిఁగలుగ వచ్చును. ఆహా! ఆపత్కాలమున నిశ్చలభక్తితో వాక్రోశించు నుత్తరనిమిషముననే యిదిగో వచ్చుచున్నానని యేమహాను

భావుని నోటనుండియో యాజగద్రక్షకుఁడే పలుకును గదా! నన్నింకఁ బిలువలేదేమి నన్నింకఁ బిలువలేదేమి యని పూప రమాత్ముఁ డాపన్నుల నంటిపెట్టుకొనియే తిరుగుచుండును గాఁబోలు. (గోవర్ధనుఁడు మేడమీఁదికి వచ్చును.)

గో—అమ్మా! వచ్చితిని.

నర—నాయనా! నమస్కారము.

గో—అమ్మా! నీవెవతెవో నే నెఱుఁగను. నీపూర్వవృత్తాంతమును జెప్పుమని నే నడుగుచుండుటలేదు సుమా! నిన్నెవఁడో బలాత్కరింపనున్నాఁ డని నీమాటలవలన నాకర్థమైనది. అంతేనా?

నర—అంతే.

గో—అటులైన నేఁ జెప్పినమాట విందువా?

నర—నాయనా! సందేహమేమి?

గో—నే నిప్పుడే మేడక్రిందిభాగమును గూడ బహు జాగరూకతతోఁ జూచినాను. భటులు నిద్రించుచున్నారు. అకార్యరుఁ డింక నద్దమునొద్దఁ గూరుచుండి మీసాలు వడివేసికొనుచున్నాఁడు. ఇఁక నొక్కపావుగంటలో నిక్కడికి వచ్చునని యనుకొందును. నిమ్మళముగా వీథితలుపు తెఱచియుంచినాను. ఇప్పుడు నీవును నేనును గ్రిందికిఁ బాఱిపోవచ్చును. కాని నేనట్లు పాఱిపోను. నే నిచ్చటఁ గొంతసేపుండి యీనిర్భాగ్యుని శిక్షించి మఱి వత్తును. నేను స్త్రీవేషమున నీస్థానమున నిల్చి కొంతయల్లరి చేసి శిక్షింపఁదలఁచితిని. నాయొద్ద స్త్రీదుస్తు లేవియులేవు. ఇక్కడ నేమైన నున్నవా?

నర—నాయనా! నాకెట్లు తెలియును? ఉండవనియే నానమ్మకము.

గో—అందుకొఱకు నే నొక్కసంగతి చెప్పుచున్నాను. సిగ్గుపడకుము

నీవు నాసహోదరివి—ఇదిగో! ఈమంచముమీఁది దుప్పటిని నీవు చుట్టఁబెట్టుకొని—

సర—ఆఁ.

గో—అమ్మా! సందేహింపకుము. కన్నుగనఁబడని చీఁకటిగానున్నది. నీవు చుట్టఁబెట్టుకొని నీవస్త్రమును అవికతోఁగూడఁ జుట్టబెట్టి నావంకఁబాఱవేయుము. నీవస్త్రములను నేను గట్టుకొని నాపురుషవస్త్రములను నీవైపునఁ బాఱవైచెదను. నీవు వానినిధరించి స్వేచ్ఛగాఁ గ్రిందికిఁబోయి వెలుపలఁబడుము.

సర—(తనలో) అయ్యో! తిరిగి పురుషవేషమా? (ప్రకా) అంతకంటె వేరుసాధనమేమియులేదా?

గో—ఏమియులేదు. ఆలస్యము కానీయకుము.

సర—పోనీ! నీవాగదిలో దాఁగియుండుము. అతఁడు నాకుఁదొందర గలుగఁజేయునని తోఁచినవెంటనే కేకవేసెదను. అప్పుడువచ్చి యాతని శిక్షింపుము. తరువాత మనమిద్దఱము పోవచ్చును.

గో—నిన్నాతఁడేమియు నననేకూడదు. నేనే యాతనిచేఁ బ్రాణప్రియాయని పిలిపించుకొందును. నాకాఁడువేసము వేయుటకుత్సాహముగనున్నది.

సర—(తనలో) నాకు మగవేసమునందు ముచ్చట యెట్లో నీకాఁడువేసమందట్టి ముచ్చటయున్నదానాయనా! నాతమ్మునివలెనున్నావు. ఏదీ యంతయదృష్టమా నేను బుట్టగనే మాయమ్మ పరలోకగతురాలైనదే.

గో—అదిగాక అమ్మా! అతనిని శిక్షించుటలో నల్లరియేమియుఁ గాఁగూడదు. వారుపైకివత్తురు. నేనివియన్నియు యోచించివిడిచినవియే. నేను జెప్పినట్టుచేయుము. తల్లీ! సందేహింపకుము.

నర—అటులైన ఆమంచముమీఁది దుప్పటిని నీవు ముందుచుట్టఁబెట్టుకొని నీవస్త్రముల నిట్లు నావంకఁ బాఱవేయుము. నేను వాని నాప్రక్కగదిలోనికిఁబోయి కట్టుకొని నావస్త్రముల నీకు విసరివైచెదను.

గో—అమ్మా! అటులే. ఇదిగో నీవలె నేనుగూడ నీచాటునకుఁబోయి నావస్త్రములూడ్చి, యీదుప్పటి కట్టుకొందును.

గో—(అట్లుచేసి తన వస్త్రములను విసరివైచును.) అమ్మా! విసరివైచితిని.

నర—(తీసికొని, గదిలోనికిఁ బోయి, తనవస్త్రములను విసరివైచును.)

గో—(నడుము కట్టుతో లాల్చితో నీవలకువచ్చి యామె వస్త్రములను దీసికొని చాటునకుఁ బోవును.)

(కొంతసేపటికిద్దఱుకూడ గదిలోనికి వత్తురు.)

గో—అమ్మా! నిన్నెఱిఁగినవారెవరైన నీగ్రామమున నున్నారా?

నర—నీకంటె నాకు నిష్కారణ బంధులెవ్వరు!

గో—అటులైన నీవు క్రిందికిఁజప్పుడుకాకుండఁబోయివీథిలోనికిఁబొమ్ము. కాళికాలయమునకు సమీపముననే యొక్కసత్రమున్నది. దాని లోఁ దూర్పుభాగమున మూఁడవగది నాబస. నీవచ్చటికిఁ బొమ్ము. తాళమిదిగో. నాకొఱకచ్చట వేచియుండుము. సాధ్యమైనంత శీఘ్రముగా శత్రుశిక్ష యొనర్చివచ్చెదను.

నర—పాప మాతని జంపెదవా?

గో—ఏదియో చేసెదను. పొమ్ము. ఆలస్యమగుచున్నది. నేనుగూడ నీతోఁ గ్రిందికి వచ్చి వీథితలుపు తిరుగ లోన గొండ్లెముపెట్టి పైకివచ్చి నాభర్తగారికొఱకు వేచి యుందును.

నర—సరే రమ్ము. (ఇద్దఱుపోవుదురు.)

గో—(తిరుగవచ్చి) ఇఁక దీపము వెలిఁగింపవలసినదేకదా! (వెలిగించును.) ఇక్కడ నద్దమేమైన నున్నదేమో! నావేష మెట్లున్నదో చూచుకోవలయును. సెబాస్! అదిగో అద్దము. (తీసికొని యద్దములోఁ దన్నుఁ జూచుకొనును.) సెబాస్! సెబాస్! గోవర్ధనుఁ డిక్కడికి గోవర్ధనమ్మయైనది. ఇదియేమి? ఱవిక తిరుగవేసి తొడిగికొంటినికాఁబోలు. ఇప్పుడు సరిగాఁ దొడుగుకొనవలయునా యేమి? ఉఁ. ఈమాత్రపు సరసత కిది చాలదా? ఆహా! ఱవికతోఁ, బైటతో, మొగమంతయు భేదించినట్లు కనఁబడుచున్నదే! మొగము భేదించినందులకు నాకంత వింతగలేదు. ఏమో స్వల్పముగా మనస్సుకూడ భేదించినట్లు కనఁబడుచున్నదేమో! మగవారెవ్వరైన వత్తురేమో యను నలుకు పైటజారినదేమో సర్దుకోవలయునని యులుకుగూడ నాకర్మమువలన సిద్ధించినట్లున్నదాయేమి? (పైట సర్దుకొనును.) ఇది వట్టిభ్రమము. అట్లేల జరుగును?

గీ. పురుషుఁ డెన్నఁడు పురుషుఁడు ♦ పొలఁతి పొలఁతి
ప్రకృతి యెల్లెడ నిర్వికా♦రంబు నిజము
రమ్యలోఁ బురుషుఁడు సమ♦ర్తాడఁ డెపుడు
జర్మనీ స్త్రీలకైన మీ♦సాలు లేవు.

ఈఱవిక నాకుఁ గొంచెము గుత్తముగా నుండుటచేత బాగుగనే యున్నది. సాముచే గడిదేఱివడితిరుగు నీవంపులపై సీయూను పచ్చిగుడ్డ స్తంభపు రాటలకుఁ గట్టిన కొబ్బెరయాకుల యల్లికవలెనున్నది. ఇదియు నొక సొగసుగనే యున్నది. కాని తామరపాకున బిసములు పొట్లముకట్టవచ్చునుగాని గసిగలట్లు. కట్టవచ్చునా? ఇంత కాశిపట్టుచీరఁ గట్టినందులకు మొకాలో రవ్వంత

నానుపోఁచమైనలేదే. సాధారణముగా నిప్పటి యాఁడువారి యలంకరణవైరాగ్య మిట్లున్నది. కావున బాధలేదు. నిరుపయోగమని యెంచి మగవాఁడు యజ్ఞసూత్రమును దీసివైచినట్లు మగువలలోఁ గొందఱు సాహసినులు మంగళసూత్రమును దీసివైచుచున్నారని కింవదంతి కలదు. అట్టి నూతనాచారపరాయణలలో నేనుగూడఁ జేరుదును. ఎటులైన నింత బోడిమెడతో నుండుట బాగుగానుండదు. కావున పైటచెఱఁగు బాగుగాఁ గప్పుకొనెదను. లోపలనున్న రత్నాభరణములు మొదలగునంగును పై కిసరచాటుగఁ బ్రకాశింపఁ జేయుటకుఁ బడుచువాండ్రపైట విలాసముగా నుపయోగపడుచుండఁగా నాపైట-బోడిదాని నెత్తిపై ముసుఁగువలె లోని శుద్ధమోడితనము దట్టముగాఁ గప్పుటకై యున్నది. కాని-(ప్రకా) ఎవరిప్పుడు తొంగి చూచినవారు.

(నేపథ్యమున) అమ్మా! నేను పెండ్లికొడుకుగారి దాసుఁడను.

గో—ఎందులకు వచ్చితివి?

(నేపథ్యమున) మా బాబుగారు తమ దర్శనమునకై వత్తురఁట. సెలవుకొఱకు నిరీక్షించుచున్నారు.

గో—ఆఁ! ఇదివఱ కెవరిసెలవును గొని యింతవఱ కాచరించెనో వారిసెలవునే పొంది రమ్మని చెప్పుము.

(జయరామసింగు ప్రవేశించును.)

జయ—రమ్మనుటయే కావలసినది. మన మిప్పుడుచేసిన చమత్కారము నీవు గ్రహింపలేవు కాఁబోలు! మనమే యిప్పు డాప్రక్కనుండి మాటలుగొనుచున్నప్పుడు మనసేవకుఁడువలె నిన్ను సెలవడిగి మాయచేసినది. పిల్లికూనకూఁత మొదలు సింహపుబొబ్బ

వఱకు మన కన్నికూఁతలు కంఠపాఠము. దూడ చచ్చిన గేదె యటుల పఱచినందులకు పశుసంరక్షకసమాజమువా రిచ్చినపదక మిదిగో! విద్యావిషయము వచ్చినప్పుడు ప్రభువులము కదా మనకెందుల కని మొగఁజేఁపువారము కాము. గాడిదెకూఁత, పై వారికిఁ బెద్ద బ్రహ్మవిద్యలాగునఁ గనఁబడును గాని యది వట్టి పేలపిండి. వడ్రంగిపిట్టకూఁత మాత్రము కూఁతలసార్వభౌమ మని సాంఖ్యశాస్త్రజ్ఞు లొప్పుకొనినారు. నాటకాంతం కవిత్వ మన్న ట్లాకూఁత కూసినవాఁడు రెండుకనుల శుక్రాచార్యులవా రనుట కేమైన సందేహమా! స్వస్వరూపప్రకటనము యోగ శాస్త్రమం దెంత ముఖ్యమో భోగశాస్త్రమందు గూడ నంత ముఖ్యమే. ఈయుపోద్ఘాతముతో మన మిఁక గ్రంథరచన కుప క్రమింతుము కాని కృత్యాద్యవస్థలోనే కవికిఁ జావుతప్పి కన్ను లొట్టపోవుట. పెండ్లికూఁతురుగారూ! పెండ్లికొడుకుగారు స్వ యముగా దయచేసినారు. అంత తప్పనిసరియైనప్పు డెప్పుడో తప్ప గర్భాధానకృత్యము సాధారణముగా రాయబారులచే జరిగింపఁదగినది కాదని అహమస్మి యని మనమే వేంచేయవలసి వచ్చినది. స్వగృహే యన్నపట్టుదల దర్భశయ్యకే కాని పు ష్పశయ్యకు గాదని పరిష్కరింపఁబడినది కావున నిదిగో మన ము నిషేకతల్ప మధిష్ఠించుచున్నాము. (నారాయణా నారా యణా యని కూలఁబడును.) ఇక్కడికి గర్మప్రారంభ మైనద న్నమాట. ఇఁకఁ బ్రారబ్ధము ననుసరించియే ఫల మపేక్షింపఁ దగినది.

-(తనలో) ఈతఁ డిట్లు మాట్లాడుచున్నాఁడేమి? త్రాగియున్న చిహ్నము లేవియు నగపడవు. బుద్ధివైఖరియే యిట్లై యుం

డును. ఇట్టి పరమనిర్భాగ్యుఁడు కాంతను బలాత్కరింపఁబో యినాఁడే! మాటను బట్టి వెఱ్ఱిముండకొడుకు; చేష్టను బట్టి పరమకిరాతుఁడు. బుద్ధిలేనివాఁ డింతమోస మెట్లు చేయఁగలి గెను? కావున బుద్ధిగలిగినవా రెవ్వరో యాతని నిందులకుఁ బ్రోత్సహించిరేమో యని సందేహము కలుగుచున్నది. వారి కేమి లాభమో నేను జెప్పలేను. ఈతని నింకఁ బరీక్షించెద ను. కాంతాగౌరవఘాతి యగు దొంగయేమో! ఈతనిని వధిం చెదనని మొదట నిశ్చయించుకొంటిని. ఇఁక నాలోచింపవల యును. శృంగారసంభాషణలోనికి దిగినతరువాతఁ జూచుకొన వచ్చును. ఇఁకఁ బ్రారబ్ధము ననుసరించియే ఫల మపేక్షింపఁ దగిన దని యాతఁడు మంచముమీఁదఁ గూలఁబడినాఁడు. ఇఁక మాటలాడక కూరుచుండునేమో! నేనే మాటలాడుదునా యేమి! అది స్త్రీకిఁ దప్పుకాని నాకేమి? స్త్రీనైన నిట్టివెఱ్ఱి ముండకొడుకుతో మాటలాడినఁ దప్పులేదనుకొందును. అయి నను దిట్టవలసినప్పు డీయాలోచన మేల? (ప్రకాశముగా) అయ్యా! మీరు ప్రభువులు. కాంతల మర్యాదను గాపాడ వలసిన మీరే యిట్టిదుర్నయ మొనర్చుట తగునా?

జయ—(మంచముమీఁద గొంతుగూరుచుండి కునికిపాటులు పడుచు న్నాఁడు.)

గో—(తనలో) అయ్యో! అయ్యో! కునికిపాటులు పడుచున్నాఁడే!

గీ. చదువునందునఁ గునికెడు ♦ జనుఁడు గలఁడు
మాటలందునఁ గునికెడు ♦ మనుజుఁ డుండు
భోజనమునందుఁ గునికెడు ♦ పురుషుఁ డుండు
నడకయందునఁ గునికెడు ♦ నరుఁడు గలఁడు; ... కాని

కోయ్యవలెను పెండ్లి ♦ కూఁతురు నిలఁబడఁ
బుష్పశయ్య నెక్క ♦ పూర్వరంగ
మందె కునికిపాటు ♦ లొందు గర్భాధాన
వరుని నెచట గాన ♦ వసుధలోన.

ఆహా! ఇతఁడు షండుఁడేమో? అట్టివాఁడే యైనయెడల నీబ
లాత్కారప్రయత్న మేల? ఎవ్వఁడైన నేమి? విచిత్రస్వభా
వుఁడు; ఈమందభాగ్యుని నాకన్నులారఁ జూచితినిగాన సరిపో
యినదికాని యేనాటక కవియైన నిట్టిపాత్రమును సృష్టించిన
యెడలఁ గవికిఁ బ్రకృతిజ్ఞానము లేదని యవిమర్శముగ నాత
నినిందించి పాపముకట్టుకొని యుందునుగదా! ఆహా! హద్దు
లేని సృష్టిలో నెట్టిచిత్రవిచిత్రాతిచిత్ర మహావిచిత్ర ప్రకృతు
లున్నవో! అద్దీ-కునికిపాటులు తీవ్రముగానున్నవి. అనంతశ
యనమునఁ బాషండశవమువలెనున్నాఁడు. అదిగో! మంచపు
పందిరిస్తంభము కణతకుఁ దగులుటచేఁ బిశాచవిముక్తిని జెం
దినాఁడు.

జయ—(కన్నులు దెఱచి తలకొంచెము కదలిచి పాదమిట్టియట్టియా
డించి కూనరాగమున నిట్లు పాడును.)

"శరీరే ఝర్ఝరీభూతే వ్యాధిగ్రస్తే కళేబరే।
ఔషధం జాహ్నవీతోయం వైద్యో నారాయణోహరిః॥"

గో—(తనలో) అమ్మముండకొడక! కన్నులు తెఱచి కూడఁ దల, వెను
కటివలెనే యూఁపుచున్నాఁడు. వెనుకఁగూడ నెఱిఁగియుండియేఁ
యూఁచినట్లు నే ననుకొనవలయు నని; విలాసముగాఁ గాలుకద
ల్చుచున్నాఁడు. తలకదలిచినట్లే కాలుకూడ విలాసముగాఁ
కదల్చినట్లు నే ననుకొనవలయునని; కాని కుక్కపిల్లకూఁతవలె

నీకూను రాగమేమి? అందులోఁ గాయిలామంచముమీఁది
కర్ణామైన యీదిక్కుమాలినశ్లోకము గర్భాధానపు మంచము
మీఁద నెందులకు? (ప్రకా) అయ్యో! మాటలాడకున్నారు.
సర్వధర్మము లెఱిఁగినమీరు, కాంతనుహరించుట యెందులకు?

జయ—స్త్రీని దెచ్చుటకు మూఁడుకారణములు. బాల్యము, పడుచుఁదనము, వార్ధకమని మగవాని కామూఁడుకారణములఁబట్టియే మూఁడవస్థలు. మగవాఁడు తనబాల్యమందే స్త్రీనిదెచ్చినయెడలఁ బాలుత్రాగుటకు, ఇదియొక కారణము. పడుచుఁదనమునందే తెచ్చినయెడలఁ బ్రక్కలోనికి; ఇది రెండవకారణము. వార్ధకమందే తెచ్చినయెడల వంటకొఱకు. ఇది మూఁడవకారణము. ఇప్పుడు మనము త్రిశంకుస్వర్గమువలె నడిమికారణమున వ్రేలాడుచున్నాము. పురాణము లెఱిఁగియున్నతరువాతమాత్రము స్త్రీహరణమునకుఁ గారణము లడుగఁదగదు.

గో—సీతను హరించిన రావణుఁడేమయ్యెనో యెఱుఁగవా?

జయ—అది మనము కనులారఁజూచిన యంశము కాకపోవుటచేత పూచిపడి యిదమిద్ధమని నిశ్చయింపఁజాలము. పోనీ! స్త్రీహణముననే రావణుఁడు చచ్చినాఁడని మాటవరుసకు నిశ్చయింపుము. వాల్మీకి దేనిని హరించి చచ్చినాఁడు? కళత్రవియోగమైన తరువాత మనతాత పైస్త్రీమొగమెఱుఁగకుండ నింటిలో వంటచేయు గొల్లదానిని బెట్టుకొని కడుపులోఁ జల్ల కదలకుండ ఋషివలెఁ గాలక్షేపము చేసినాఁడు. ఆతని తపస్సునకు నింద్రియనిగ్రహమునకు భంగము కలుగఁజేయవలయునని యూరిలో గొందఱు యత్నించిరి. కాని మనతాత కట్టుకట్టముచే నాగొల్లదికదలుటకు వీలులేనికుంటిదగుటచేత నాతని తపస్సు సాంగిక

తలమగువటకు నిర్విఘ్నముగాజరిగినది. శుకమహార్షిచావలేదా. ఒక్కనిగ్గుగలమాట; గర్భములో శృంగారరసమున్నంతకాలము మనుజునకుఁ జావులేదు. మనశృంగారసంభాషణము నీవిదివఱకు వినియుండవు. ఇప్పుడు నీకట్టిపుణ్యము లభింపనైయున్నది. గువ్వపిట్టలు కులికినట్లు కాఁకరపువ్వ వత్తులు వెలిఁగినట్లుండునని నీవంటివారిచ్చిన యోగ్యతాపత్రికలున్నవి. ఇఁకఁ బచునవన్నియు మన్మథబాణములని నిశ్చయపఱుపుము. అక్షయతూణీరమగుటచేతఁ బుంఖానుపుంఖశ కడ్డులేదు. ఇఁకఁ గాచికో.

గో—(తనలో) వీఁడు విశ్వామిత్రసృష్టిలోని ముండకొడుకేమో! శుద్ధబుద్ధిహీనుఁడు. త్వరగ రెండు లెంపకాయలు గొట్టి సాగనంపిన బాగుగా నుండునేమో?

జయ—చంద్రినిదేహ మమృతమయమైన ట్లదేహమున్నదే, ఇది యంతయు శృంగారరసమయము. నీవు కనలేదుకాని యప్పుడే మనగర్భకోశములో రెండు సాత్త్వికభావము లంకురించినవి. అప్పుడనఁగా నెప్పుడు? నారాయణ నారాయణ యని యాశయ్యపై నాఘట మెప్పుడువ్రైచితినో యప్పుడే; మొదటనే-ప్రళయమను సాత్త్వికావస్థ మెదటినుండి బయలుదేఱినది. ప్రళయమనఁగా నీకుఁ దెలియకపోవచ్చును. స్త్రీనిజూచి యవశత్వమునొందుటే ప్రళయము. అది క్రమముగా గన్నులఁబట్టి గిఱ్ఱునఁ దిప్పినది. అది చూచి నీవు కునికిపాటులని భ్రమించియుందువు. ఈభావముమాత్రము శృంగారరసములోఁ దలమున్కలైన ముండకొడుకునకుఁ గానిముందుగా నెన్నఁడు కలుగదు. సాధారణముగా మొదటఁ గలుగవలసినది స్తంభము;

కాని యొక్కచమత్కారమును మనమిచ్చట జరిగించినాము. ఈయవశత్వములోఁ బందిరిమంచపు స్తంభము మనకంతకుఁ దగిలించికొని యసలు స్తంభములేనిలోపమును దీర్చి శాస్త్రగారవమును నిలువఁబెట్టినాము. పెండ్లికూఁతురుగారిని బ్రాణకాంతాయని పిలుచుట యేదో యొక్క వెఱ్ఱిపూర్వాచారముగా జరుగుచున్నది. కాని యిది ప్రాణములోఁ జేరిన యంశము కాకపోవుటచేత నేనట్లు పిలువను.

గో—(తనలో) నేనింక సాహసించెదను. రోఁతగానున్నది. (ప్రకా) ఇది నీప్రాణములోఁ జేరిన యంశమని నిశ్చయముగానమ్ముము. నీవు పొరపాటుపడుచున్నావు. జాగ్రత్త.

జయ—అభిప్రాయభేదములు పశువులలోవలెనే మనుష్యులలో నప్పుడప్పుడుండవచ్చును. ఎద్దునకు వట్టిగడ్డి ప్రియముకావచ్చును. ఆవునకుఁ జెంగలిగడ్డియే కాని యిష్టముకాకపోవచ్చును. ఇవి మనము గణింపము. ఎవరికిష్టి వారే తినునప్పుడింకఁ జిక్కు లేదు. పెండ్లికూఁతురుగారూ! (అని దీర్ఘముగా బిలుచును.)

గో—నక్క యేడ్చినట్లంతపిలుపేల?

జయ—మగవానికి వలపులేదు కావునఁ బిలుపే దీర్ఘముగా నుండఁదగినదని కళాశాస్త్రమర్యాద. పెండ్లికూఁతురుగారూ! మీరిట్లు పెండ్లికొడుకుగారియొద్దకువచ్చి యీయెడమచేయివైపునఁ గూరుచుండి- ఈకుడి యెడమల పట్టున్నదే- పెద్దపులివేసములకుఁ గంటెఁ బెండ్లికొడుకుల కెక్కువ-కాదు కూడదని కుడిప్రక్కనే మోటతనముచేఁ గూరుచుంటివేని-ముందుగాఁ జెప్పుచున్నాను. ఇద్దఱిలో నొకరు దక్కరు.

గో—ఆపనిని నీకొనరించుటకు సిద్ధముగా నున్నాను. చీర అవికమర్యా

దను గాపాడుట కింక నూరకుంటిని.

జయ—మర్యాదకొఱకే మనమును సందేహించుచున్నాము. సాధారణపుఁ గుటుంబములలోని పెండ్లికొడుకైనయెడల వెంటనే పెండ్లికూఁతును జేరును. మనము ప్రభువులలోని వారమగుటచేత మనయొద్దకుఁ బెండ్లికూఁతురు రావలసినదే. అన్యథా జరిగినయెడల రాజమర్యాదకు లోపము. మొదటిమాట యామెది, మొదటి ముద్దామెది. ఊరకే పెండ్లికొడుకు తటస్థముగాఁ జచ్చినట్లుండవలసినదే. పెండ్లికొడుకు రవంతకదలి స్వతంత్రించినాఁడనఁగ నింకఁ బ్రభుగౌరవమునకుఁ బరశురామప్రీతి యైనదన్నమాటయే. మన పెద్దతాతగారు తనభార్యను భార్యయని యొప్పుకొనినయెడలఁ బ్రభుత్వస్వాతంత్ర్యమునకెక్కడ లోపముకలుగునో యని యెన్నఁడొప్పుకొనలేదు. ఆమెకూడ నట్టిపట్టుదలతోడనే కాలక్షేపముచేసినది. మా వారు మొదటినుండియు మర్యాదకొఱకుఁ బడిచచ్చినవారు కాని మఱియొకటి కాదు.

గో.—నీవుకూడ నటులేచావవచ్చును. అందుకొఱకు నేనేవత్తును. (మంచముకొద్దకుఁ బోవును.)

జయ—సెబాస్! పెండ్లికూఁతురుగారూ! మీరిఁక గుడిహస్తముతో నొక్కసారి మనచెక్కిలిపై ముద్దులకొడిముక్కు నలిపినట్లు— ఏదీ? సందేహింపకుఁడు. మీకిట్టిపనిలోఁ బూర్వానుభవము లేకపోవుటచేత నేను జెప్పవలసి వచ్చినది.

గో—(గట్టిగ లెంపపైఁ గొట్టును.)

జయ—(దావ పట్టుకొని ఉండుఁడు.) పెండ్లికూఁతురుగారూ! తొందరపడకుఁడు. పాకము కొంచెము ముదిరినది. (కన్నులొత్తుకొ

నును.) ఇదిగో చూచితిరా. అశ్రువను సాత్త్వికభావము. ఇది వఱకు రెండు. దీనితో మూఁడు. శృంగారశాస్త్ర మెన్నటికస త్యముకాదు. కొందఱు మోటపెండ్లికొడుకులు ముందుగా బెండ్లికూఁతురుగారలను కౌఁగిలించుకొందురు. ఇది పౌరుషము నకుఁ దత్ప్రతి-ప్రభుత్వమునకు శిరశ్ఛేదకముగు పని. ఏయేభా వము లెంతవఱకుఁ గలిగినవో యని ముందు భావపరీక్ష చేయ వలయును. పెండ్లికూఁతురుగారూ! ఇఁకముందు మీరుచేయ వలసినపని యేది ?

గో—పెండ్లికొడుకుగారి సమీపము ప్రక్కను కూరుచుండు మనిగదా మీయాజ్ఞ.

జయ—ఒక్కమంచముమీఁద నాతో సమానస్థానమునఁ గూరు చుండుట నాకుఁ గొంచెము లోపము కావున నొక్కపద్యస్థల యుక్తిచేసెదను. ఆకాళ్లవద్ద యిటు పెట్టుము దానిపైఁ గూరు చుండును. మీకంటె నొక్కయంగుళమెత్తునైనఁ గూరుచుం డినఁ జాలును. (గోవర్ధనుఁడు వైచిన తలగడపై జయరామసిం గు కూరుచుండును.)

(గోవర్ధనుఁడు ప్రక్కఁ గూరుచుండును.)

గో—పెండ్లికొడుకుగారూ! ఇఁకముందు జరుగవలసినదేది ?

జయ—పెండ్లికొడుకుగారినుంచి బాగుగా మఱఁగినావు కావున నుత్తర క్రియాచరణమున కుబలాటపడుచున్నావు. ఒక్కనిమిసము శాం తింపుము. అదిగాక యిదివఱకుఁ గలిగిన సాత్త్వికభావము-అశ్రువు న్నదే-ఇది యింక నాఱలేదు. భావమునకు భావమునకుఁ గొం చె మెడముండినఁ గాని సాంకర్యము కలుగును. ఒక్కనిమిసము మర్యాదను గూర్చి మాటాడుకొందము. ఇంతవఱ కేదియో

చెప్పుచుంటిని పరాకుపడితిని. ఈయ స్వభావముమాత్రము కొంచెము పటుత్వముగాఁ బడినందువలన బుద్ధి కొంచెము చెదరుచున్నది. ఇదివఱ కేది చెప్పుచుంటిని?

గో—(తనలో) వీఁడు చిన్నతనమునుండియు నెక్కువ గారాబముగాఁ జదువురాని తల్లిదండ్రులచేతఁ బెంపఁబడి పాడుచేయఁబడినవాఁడని తోఁచుచున్నది. వ్యాధి ముదిరిపోయినది. దీనికొక్కచికిత్స యున్నది. దినమునకు మూఁడుమారు లీతనిఁ గొట్టుచుండినయెడలఁ దాత్కాలికశాంతి యగును. ఒక్కలెంపకాయతో రవంతమరలు మొగముపట్టినట్లు కనఁబడుచున్నది. (ప్ర) పెండ్లికొడుకుగారూ! మాతండ్రిగారని యేదో యారంభించి మానివైచినారు.

జయ—ఔను- మాతండ్రిగా రొకప్పుడు క్రిందఁ దివాచిమీఁదఁ గూరుచుండియుండఁగా నొక తెలివితక్కువదాసి యెత్తుపీఁట నెక్కి గోడకు వెల్లవేయుచుండెను. అదిచూచి పోయెరా రాజమర్యాద యని చటుకున సమీపముననున్న నిచ్చెనపైకి మాతండ్రిగారెక్కఁబోయి నిచ్చెన జాఱఁగఁ బడిపోయిరి. కణతను దెబ్బతగులుటచే నీవు నేను మాటలాడుకొనునంతలో దేహము చాలించిరి. మనము మర్యాదకొఱకుఁ బడి చచ్చినవారమని నేఁజెప్పినమాట యందుకొఱకు. * కుడియెడమ లేకాక యెత్తుపల్లములు కూడఁ బ్రభువుల కాయువుపట్టులైన కళాస్థానములు. అందు కొఱకే నేను దలగడయో యని దేవులాడితిని.

* గో— పెండ్లికొడుకుగారూ! నా కీపూర్వపుగోడవలేల? ఇఁక ముందు మాటయేమి?

జయ—నీవు పెండ్లికొడుకుగారివైపునఁ దీయనీటికిఁ జేఁప యెక్కిన

క్లెక్కుచున్నావు. నీకుడిచేయి నామెడమీఁదినుండి చుట్టుకుదురువాటముగా రానిచ్చి కొంచెముదరికిఁ జేర్చుకొనుము. చూడు వెనుకటివలెఁ గాక లేఁబాకములోనే వర్ధింపవలయును జుమీ!

గో—(అట్లుచేసి) ఇదిగో పెండ్లికొడుకుగారిని దరిచేర్చుకొనుచున్నాను.

(గట్టిగ సందిట నొక్కును.)

జయ—ఉఁ-ఉఁ-ఉఁ-ఉఁ. (ఉక్కిరిబిక్కిరియై గ్రుడ్లు తేలవేయును.)

గో—(తనలో) నిర్భాగ్యపుముండకొడుకు చచ్చునేమో వదలెదను.

(వదలును.)

జయ—(కన్నులుమూసికొని కుడిచేయి ఆఁగుమాఁగుమనిన ట్లూఁచి గద్గదికతో) ఆఁగు, ఆఁగు రవంతకుదుటఁబడనీ! చూచితివా! నీవు బాగుగాఁ గనిపట్టితివికదా! ఇప్పుడు కలిగిన భావమే వైస్వర్యము. దీనికే గద్గదిక యని యందురు. ఎనిమిదిభావములకు నాలుగుగుణములు మనకు వచ్చినవి. ప్రథమతరగతిలోఁ గృతార్థతయన్నమాట. ఇఁక భానము లక్కఱలేదు.

గో—మృతియనునది కూడ నొకభావమేకాఁబోలు! అది నీకెప్పుడు వచ్చునో!

జయ—అది పెండ్లికూఁతురుగారి తత్త్వమునుబట్టి యుండును. అయినను నది సాత్త్వికములలోనిది కాదు. సంచారులలోనిది. మొత్తముమీఁద నిప్పటికి కట్టిత్తొందర లేదనుకొందును. ముందు మహారాజయోగదినము లున్నవి. ఇదివఱకు మనము చూచిన స్థలములలో మన్మథుఁ డింతదూకుడు కనఁబఱుపలేదు. తలప్రాణము తోఁకకు వచ్చునేమోయను భయము గర్భగోళమునందుదయించినది. ప్రసవబాణములు వదలి మన్మథుఁ డిప్పుడు బడితె వేట్లు లారంభించినాఁడు. మంచమెక్కనప్పు డతనిని

ధ్యానింపక పోవుటచేత నిట్టియెదురెత్తునకుఁ గారణమై యుండు
ను. నీకు మన్మథునిమీఁదిపాట యేదైన వచ్చునా?

గో—ఏడువవలసినప్పుడు పాటయెందులకు?

జయ—మనకుఁ బాటయని యేడుపని రెండా? ఒక్కటేశాస్త్రము. అది పాటయేయనుము. నీయిష్టము. ఏడుపేయనుము. నీయిష్టము. ఒకసారి మాదాసికిఁ దేలుగుట్టినది. అందువలన నదియొకమూలఁ గూర్చుండి యేడ్చుచుండెను. నే నొకమూలను పెండ్లికూఁతురుగారిని దలఁచుకొనుచుఁ బరవశుఁడనై పాడుకొనుచుంటిని. తేలుమంత్రము వేయువాఁడు రేచీఁకటిలో వచ్చి నాకు మంత్రమువేసి చక్కఁబోయినాఁడు. అల్లాశ్చర్యపడితిమి. ముందున్నది చమత్కారము; దాసిదాని తేలుబాధ టక్కున శాంతించినది.

గో—పెండ్లికొడుకుగా రూరక మాటలు చెప్పుచు నాలస్యముచేయుచున్నారు. ఊఁ; ఈలాగైనయెడల నాకక్కఱలేదమ్మా (మురిసి లేచును).

జయ—పాపము పెండ్లికూఁతురుగారికి సరిక్రొత్త కాఁబోలు. తగినపెండ్లికొడుకొకటచే నన్నిముచ్చటలు చెప్పపాటులోఁ దీరును. కాచికో. నారాయణా నారాయణా—యెత్తు మన్మథుఁడా పెండాయెత్తు. ఇదిగో వధూవరులు కలిసికొనుచున్నారు. దేవతలు పుష్పవృష్టి కురియవలసిన సమయము! (కౌఁగిలించుకొనును.)

గో—కుసుమవృష్టి కాదు. గుద్దులవృష్టి (జయరామసింగును మంచము మీఁదనుండి లాగి క్రిందఁ బడఁద్రోచి త్రొక్కును.)

జయ—నారాయణ! నారాయణ! భూశయనవమా యేమి చెప్పుమా? కాక గిట్టునఁ దిరిగి సంచాయలలోఁ బడియుండునా! ఓహో!

పెండ్లికూఁతురుగారు సప్తపాదాలు త్రొక్కుచున్నారు కాఁబో లు! భార్యయు భర్తయుఁ బరస్పరమనుటచేత నెవ్వరైన నేమి లెండు. కాని నిమ్మళము-నిమ్మళము- పెండ్లికూఁతురుగారూ! ఇక్కడి కెన్నిపాదాలైనట్లు? అబ్బ! అబ్బ!

గో—ఇఁక గొంతుకమీఁద వేయుదానితో సైదు.

జయ-గ్రుడ్లుమీఁదికి వచ్చుచున్నను నింక రెండు తరువాయియున్నవా? అబ్బో! ఏడడుగులే యెంతకుఁ దెమలకుండ నున్నవేమి? ఒక్క నిముస మాఁగు. మన్మథుని ధ్యానింపకపోవుటయే యింతపుట్టి మునుకకు బీజము. (అని పలికి యీదిగువకీర్తన పాడును.)

మోహనరాగము—ఏకతాళము.

సుమశర-కాయజ-సరోజగృహాత్మజ-కరుణను జూడు.

(సంగతులతోఁ గష్టమునఁ బాడును.)

గో—ఓరి దౌర్భాగ్యుఁడా! ఇప్పుడు నీకు మన్మథధ్యానముకంటె మన్మథహరుఁడగు హరునిధ్యానము కర్తవ్యము. భూశయనసమయమున మోహనరాగముపైఁ గృతియా? ఇఁకఁ బాడినయెడల నోరు నొక్కెదను.

జయ—నాటకమర్యాద ననుసరించి పాడుచున్నాను. సగము చచ్చిన తరువాత పాడిన నాటకపాత్రల నే నెఱుఁగుదును. ఆమర్యాద ననుసరించి నేను బాడితిని.

గో—నిర్భాగ్యుఁడా! ప్రకృతిమర్యాదననుసరించి నాటకమర్యాదయా! నాటకమర్యాద ననుసరించి ప్రకృతిమర్యాదయా! ఉత్తరక్షణమున నీప్రాణము లెగురుటకు సిద్ధముగా నున్నవికదా? నీకెందులకురా పాట. పశువా! (తన్నును.)

జయ—అప్పుడే యంతవఱకు వచ్చినదా? (ఏడ్చును.)

గో—ఛీ! పిఱికిపందా! నిన్నుఁ జంపుట యొకటియుఁ గుక్కను జంపుట యొకటియునా? పో. పో. (గోవర్ధనుఁడు వానిని వదలును.)

జయ—(లేచి) పిఱికిపందాయనిమాత్రి మెన్నఁడనకేమి? మనకున్నవిశేషములే పౌరుషము బుద్ధి. పెండ్లికూఁతురుగారుకదాయని మెత్తఁదనముగాఁ బ్రవర్తించితిమి. ఇఁక మనబుద్ధియనునది లోకవిదితమే.

గో—ఇఁక నోరుమూయుము.

గీ. పరునిబుద్ధిని మెచ్చని • వాఁడు శుంఠ
మందు ధీశాలియనువాఁడు • మఱియుశుంఠ
తనదుబుద్ధిని స్తుతియించు • కొనెడువాఁడు
శుంఠలందఱిలోపల • శుద్ధశుంఠ.

జయ—నీమాటలు మనకు నచ్చలేదు. నీవు చెప్పిన కడపటిజాతి శుద్ధశుంఠలలోనివారే ప్రపంచమున నూటికిఁ దొంబదితొమ్మండ్రు.

గో—(తనలో) బాగుగనే చెప్పినాఁడు. అవలయగతిలోఁ గర్మముచాలక సరియైనదెబ్బ పడినట్లీమాట మూఢుఁడైన యీతనినోటినుండి కర్మముచాలక బయలువెడలినట్లున్నది.

గీ. తాను రతిదేవినని యాఁడు • దాని కెట్లొ
సురగురునిభుండనని పురు • షునకు నట్లె
కాంత యున్మాదగతి చర్మ • గతమెకాని
పురుషునిది యాత్మగతము దు • ష్కరము కరము.
స్వస్థచిత్తులైన • జనులకే యీపిచ్చి
గొప్పకొలఁది • గతులఁ దప్పదనఁగఁ
దల్లికడుపునుండి • తలచూపినప్పుడే
పిచ్చిగలుగు కవుల • పిచ్చి యెంతొ!

మూఁగ వెఱ్ఱి మఱియు ♦ వాఁగువెఱ్ఱియునంచు
వెఱ్ఱి రెండుగతుల ♦ వెలయుచుండు
వాఁగు వెఱ్ఱిరోఁత ♦ బలుదిస్సమొలదౌట
మూఁగ వెఱ్ఱి గడుసు ♦ బుఱ్ఱగలది.
తనదుకవిత మధువు ♦ తక్కినకవితలు
గడ్డియనుచుఁ దెఱ్ఱి♦కవి వచించుఁ
దనగుఱంపు బూరవ్వ ♦ ఘనులను గొనియాడి
కుటిలకవి స్తుతించు ♦ గొనును దన్నె.

(పరిక్రా) పెండ్లికొడుకుగారూ! ఇఁక ముందాలోచనయేమి?

జయ—మన్మథునిగతి కొంచెము దిగఁబీఁకుడుగాఁ గనఁబడుచున్నది. చంద్రుఁడు మలయపవనుఁడు మొదలగువారు గోడమీఁదిపిల్లులవలెఁ దటస్థులైయున్నారు. కాని మన్మథుని బురికొల్పకుండనున్నారు. ఒకచిలుకపలుకుగాని యొక్క కోకిలకూఁతగాని చెవిని బడినయెడల నైఁమని యెంత కోలాహలమైనఁ జేయఁగలను! అదియు లేకుండనున్నది. ఇదికాక యీరాత్రి పెండ్లికూఁతురు గారి నక్షత్రయుక్తై యాకాశవిమానములో నాడించుటకై చిరకాల మభ్యసించిన యలంకారశాస్త్రము కర్ణవిద్యవలె సమయమునకుఁ బనికిరాకపోవుటయేకాక మనకు భూశయనమువఱకుఁ దెచ్చినది. పరదేశభోజనములు దేహమునకు సరిపడకుండు చున్నవి. అదికాక యీరాత్రి లగ్నమునకు గురుబలము తక్కువగా నున్నది. ఇన్నిటికంటెఁ బ్రధానమైనది పిల్లి యడ్డముగా వచ్చియున్నదేమోయని సందేహముగా నున్నది. కావునసే మన మిప్పటికిఁబోయి రేపటిదినమున నభిలగ్నముందుము (పోఁబోవును).

గో—ఆఁగు. కదలినయెడల గొంతుపిసికి చంపెదను. నోరు మెదలుపనైనఁ దగదు. మనమిద్దఱము కలిసి నాబసలోనికిఁ బోవుదము. ఇఁక నీవు నన్నపేక్షింపకు, నీకు నేను దక్కుదానను గాను. ఈసంగతి యెవరితోడఁ జెప్పిననైనను నీప్రాణములు దక్కవు.

జయ—మనకుఁ బెండ్లికూఁతురుగారు సంభవింపనప్పుడు మనదారి మనదికాక- మీబసకెందులకు ?

గో—నాబసలో నీకుఁ దగిన కన్యకయున్నది. దానిని నీకిచ్చి పెండ్లి చేసెదను.

జయ—మనకుఁ బెండ్లికూఁతురుగారే కావలయునన్న పట్టులేదు. ఎటు వచ్చినను రాజ్యముకొఱకే మొదట నపేక్షించితిమి. నీవంతవఱకెఱిఁగియేయుందువు. రాజ్యవ్యవహార మిప్పుడు పెండ్లితో సంబంధములేకుండఁ జేసికొంటిమి. వెనుకటిపట్టుదలచే నీవని చేయవలసి వచ్చినది. ఆపట్టుదలయైనను మనకుఁ గాదు. మనయక్కగారికి—మీారెఱుఁగరా ?

గో—ఛీఛీ ! నీసోద నాకక్కఱలేదు. నే నేమియు నెఱుఁగను. ఎఱుఁగ నక్కఱలేదు. కాని యిల్లే నోటియొట్టముగా నీరాత్రి జరిగిన వ్యవహారము వెల్లడించినయెడల నాలుకఁ గోసెదను. జాగ్రత్త- వెల్లడింపవుకద.

జయ—గాయత్రితోడు.

గో—ఇఁక సరే రమ్ము.

జయ—కాని మీాబసలో నెవ్వరో యున్నారంటిరే ?

గో—ఔను. నీకు సర్వవిధముల నరిపోవునకన్య యొక్కతెయున్నది.

జయ—మనకుఁ గన్యయే కావలయునన్న పెంకిపట్టువారము కాము. స్త్రీలలోఁ గన్యాత్వమే లేదని యొక ఋషిమతము. అందఱు

స్త్రీలుకూడఁ గన్యలే యని మఱియొక్క ఋషిమతము. ఇప్ప టి స్త్రీలకు స్త్రీత్వమే లేదని మనమతము. పెండ్లికూఁతురు గారితో రహస్య మొప్పుకొనిన బాధలేదు. డింకిణోడివలె నా కంటికి కానిన పెండ్లికూఁతు రెవ్వరు నాకంటఁ బడలేదు.

గో—అది నీకుఁ దగినదని చెప్పలేదా? మనము పోవుదము రమ్ము. (తనలో) ఇప్పుడు స్త్రీవేషముతోడనే యూరివెంటఁబోవలయుఁ గాఁబోలు. అయ్యో! ఎట్లు? నడిరాత్రి సమీపించుచున్నది. నన్నిప్పుడు చూచువారెవ్వరు? చప్పున బసకుఁ బోయి మడుఁ గుబట్టలు గట్టుకొనిన తరువాతనే నాకళాలలితను జూతును. పాప మాకాంత నాకొఱకు కక్కడ వేచియున్నది కాఁబోలు!

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.



శ్రీరామా.




# షష్ఠాంకము.



ప్రదేశము—కాళికాలయసమీపమున సత్రము.

ప్రవేశము—సరస్వతి పురుషరూపమున; కళాలలిత.

కళా—ప్రాణేశ్వరా! ఎంతకాలము నీకొఱకు నిద్రాహారములు లేక కనిపెట్టుకొనియుంటినో, నాప్రాణ మెంత తహతహలాడినదో నీవెఱుఁగవుగదా! నిముస మొక్కవత్సరముగాఁ గడపితినే! ఇప్పుడా వచ్చితివి? ఇంతలో వచ్చెదనని కదా బాసచేసి నన్ను విడిచితివి!

సర—నాసఖునికొఱకు కాచియుండుటచే నాలస్యమైనది. (తనలో) ఎవతెను దప్పించుకొనవలెనని యేడ్చితినో దానియొద్దకే తిరుగ మగవేసమున వచ్చితిని.

కళా—సఖుఁడా? భటుఁడని యనుకొంటినిలే.

సర—సామాన్యసఖుఁడా? ప్రాణసఖుఁడు.

కళా—నీకీయూర నట్టివాఁ డెవ్వఁడు?

సర—ఈయూరనే కాదు. ఈప్రపంచమున నట్టివాఁ డున్నాఁడా? అతని కాతఁడే సాటి. అతఁడే నాప్రియుఁడు.

కళా—కళాలలితుఁడేనా?

నర—కాదా ? నాప్రియుఁడు. నాప్రాణము. అతఁ డింక నిక్కడకు రా లేదా ? ఈయున్నవములకు వచ్చునని చెప్పితివే !

కళా—అతఁ డీసరికి నచ్చియే యుండును. లేకున్న తేపు వచ్చును. నీప్రియుఁడు రాలేదని నీవెంతయిబ్బందిపడుచుంటివో నాప్రియుఁడు రాలేదని నేనంత యిబ్బందిపడుట యాశ్చర్యమేమి? పోనీ! ప్రాణేశ్వరా ! అతని బదులు నేనుంటిని గాదా ? లోకములో నెవ్వనికైనను భార్యకంటె బావ యెక్కువవాఁడా ?

నర—(తనలో) అట్లు కాదు. మగనికంటె నాఁడుబిడ్డ హెచ్చా యని యనఁదగినది.

గీ. వలదు తమ్ముని కక్కకు ♦ వలదు మొదలె
అంత తేనె నాకొక్కతె ♦ కంచు నేడ్చు
బాలగతి బంధుమిత్రులఁ ♦ బాజఁదోలి
యేకముగ నాఘుఁ గబళింప ♦ నింతివంత.

అయ్యయ్యో ! ఆమె నపేక్షింపఁబోయి నన్నే యపేక్షించు కొంటిని గదా ! నేనుమాత్రము చేయుచున్న ప్రయోజకత యేమున్నది ? నన్నుఁ బ్రాణముగా నెన్నుకొని భర్తగా భావించు నీమెను—నాభర్తకుఁ జెల్లెలైన యీమెను—నన్నుఁ బెండ్లిచేసికొనుట కిక్కడకు వచ్చిన యీమెను—వ్రణప్రాయముగా వదలి—నాకు భర్తతక్క యేదియు నక్కఱలేదని రానిభర్తకై విలవిలలాడుచుంటిని గాదా? నే నింతవఱకు రానందుల కీమెప్రాణ మెంతకొట్టుకొనినదో- సరే వచ్చితిని- కర్మము చాలక యిక్కడకుఁ బంపఁబడితిని. నే నేమిచేయఁగలను? ఒక్కముష్టివాఁడు వేఱొక ముష్టివానిబాధ యెట్లుతీర్పఁగలఁడు. సరే నీ వాపినని నే నీపీధిని ముష్టియెత్తుకొందమని చెప్పుట

కంటె నాతని కేమియుపాయము చెప్పఁగలఁడు? అట్లే యిద్దర మీయూరనే పతిభిక్షుకై బయలుదేఱుదుము. నాకు మగఁడు వచ్చినయెడల నాయొడి నిండును. నీకు మగఁడెవ్వఁడైన దొర కినయెడల నీయొడి నిండును. అంతకంటె నేమున్నది? ఈబాధ వదలిపోవునని యిట (స్త్రీ)వేషమునఁ బడియుండగాఁ దిరుగ మ గవేసము నాకొంప ముంచినది. నన్ను జయరామసింగు బారిఁ బడకుండ రక్షించిన మహానుభావుఁడు వచ్చునేమో యాతని కొక్క నమస్కార మర్పించుకొని యేదో యొకవంకఁబెట్టుకొని పాఱిపోవుటకైన నాతఁ డింక రాలేదు. ఓభగవంతుఁడా! ఏమిగతి!

కళా—ప్రాణేశ్వరా! మాటలాడవేల? భార్యకంటె బావయెక్కువయా!

సర—ఎంతమాట! మగవాఁడైన వానికేవస్తువైన భార్యతరువాతిదే కదా?

కళా—అలాగే, యాఁడుదియైనదానికేవస్తువైన భర్తతరువాతిదేకదా?

సర—(తనలో) నాకు నామాటకంటె నీమాట యెక్కువబాగుగా నచ్చి నది. (ప్రకా) ఇంకను సందేహమా?

కళా—నాథా! నీకాఁకలియగుచున్నదేమో భోజనముచేయరాదా?

సర—నాకాఁకలి లేదు. రెండుయామములు కావచ్చుచున్నది. ఇప్పు డు భోజనమేమి? నీవు భుజియించితివికదా!

కళా—ప్రాణేశ్వరా! భుజియించిన యెడలఁ గడుపుమాత్రమే నిండు ను. నిన్నుఁ జూడగనే కన్నులు నిండినవి. మనస్సు నిండినది. రేపు నీతోడనే భుజియింతును గాని మనపెండ్లి యెప్పుడు?

సర—(తనలో) అయ్యయ్యో! పెండ్లియా? ఇది మనకు బలికాని పెం డ్లికాదు. అహా! వెట్టిదానా! పెండ్లి యెప్పుడని యడుగుచు న్నావా?

ఆ. వె. మూఁగ మూఁగతోడ ♦ ముచ్చటాడినయప్పు
డంధుఁ డంధుఁగాంచి ♦ యలరు నపుడు
కవికిఁ గవికి మనసు ♦ కలసినయప్పుడు
నాకు నీకుఁ గంక♦ణాల సాగను.

(ప్రకా) ప్రాణేశ్వరీ! మనమనస్సులురెండును గట్టిగ బిగించి మన్మథుఁడు స్థిరముగుముడి వేయనేవేసినాఁడు. ముడిపడవలసిన దక్కుడఁగాని మెడలోఁగాదు. ఆపెండ్లి జరుగనేజరిగినది. ఇంకను బెండ్లియవశిష్టమని యేల యనుకొందువు? ఏమో యిది సావకాశముగాఁ దీర్చుకొనఁగూడదా యేమి?

కళా—ప్రాణేశ్వరా! అట్లు తొందరపడుట న్యాయమా? నీవిందుకొఱకా మొగము ముడుచుకొనియున్నావు? నిన్ను బతిమాలుకొందును. పెండ్లిమాత్ర మెంత సేపు. ఆయాచారమేని యోతీర్చుకొని—

నీర—(తనలో) అయ్యయ్యో! నాకర్మము; నేనన్నమాట లీమె కిట్లర్థమయ్యెనా? నేను దొందరపడుచుంటినా? అయ్యయ్యో! పాటిపోవుటకుఁ దప్ప మఱెందులకుఁ దొందరపడుచుండుటలేదే. నాకుఁ దొందరయుండునెడల నీకేమ్మేమి? ఓయిభగవంతుఁడా!

గీ. నామగనితోడఁ దరువాత ♦ నన్నుఁగూర్ప
నమ్ముఁగాని మున్ముందుగా ♦ భర్తనొకనిఁ
దగినవానిని దెచ్చి యీ♦తనికిచ్చి
నన్ను బ్రతికింపుమో జగ♦న్నాథ! దేవ!

(ప్రకా) ప్రాణకాంతా! నీయిష్టము. కాని యెవరున్నను లేకున్నను నాపెండ్లికిఁ గళాలలితుఁడుమాత్రి ముండవలయును. అతఁడు లేకుండ వివాహమును నే నొల్లను.

కళా—అతఁడు తప్పకవచ్చును. ప్రాణేశ్వరా! మనకొక్క విచిత్రమైన యుద్యానవనమున్నది. పెండ్లియయినతరువాత మనమావనములోఁ గోకిలములతోఁ బాడుకొనుచుఁ, జిలుకలతోఁ బండ్లుదినుచు, భ్రమరములతోఁ దేనెఁగ్రోలుచు—ఏమి? అట్లు సేయుట నీకిష్టమేనా? ఆలాగున నుందమా?

సర—(తనలో) పాడుటకుఁగాని, పండ్లుతినుటకుఁగాని, తేనెత్రాగుటకుఁగాని కావలసినంత సమర్థతయున్నది. అంతవఱకే యైనయెడల ఓ-నీయిష్టమువచ్చినన్ని విలాసములు కనఁబఱుపఁగలను. కాని వెఱ్ఱిదానా!

ఆ. వె. మేడలున్ననేమి? మిద్దెలుండిన నేమి?
యుర్విభాగ్యమెల్ల నున్ననేమి?
మగఁడు పనికిరాని మానినికెల్ల లో
కంబు వట్టి వల్లకాడు గాదె?

గీ. కదలికను జూచి తళతళఁ గాంచి జాఱు
టంచు మఱుమిడికల నాసించు గతిని
లాగు కట్టును బొట్టును బాగచుట్టుఁ
గాంచి కటకటా! నన్నుఁ గాంక్షించినావు;
కల్లకెంపుల తళుకుచే నల్లిసెట్టి
మణులసెట్టియై ప్రజల కొంపలనుదీయు;
సొగమీసాలగల్ పటా సొగసుచేత
కాతరుఁడు శూరుఁడై భూపుఁ గోఁతఁబెట్టు;
తేర గుఱ్ఱాలచేఁ జెట్టుదిగువ న్యాయ
వాది ఘనుఁడౌచు రాజ్యముల్ బూదిసేయు,
దొడ్డ రుద్రాక్షమాలచే దొంగ, బ్రహ్మ

వేత్తయై వితంతులకు వే♦విళ్ల నొసఁగు;
వేసమా ! సాటి నీకేది ♦ పృథివిలోన
మంచిగా నెన్ని కొంపల ♦ ముంచినావొ !
నీకె ప్రథమాధిపత్య మీ ♦ లోకమందు
మాటకంటెను బనికంటె ♦ మనసుకంటె.

ఆ. వె. ఎవతె మగనిబాధ ♦ హెచ్చొట దానికే
ప్రకృతికాఁగ నాదు ♦ పాపమేమి?
ఏను నాదుమగని ♦ కేచ్చుట కంటెను
మిగుల నేస్తు నీమె ♦ మగనికొఱకె?

మానభంగమునుండి నన్నుఁ గాపాడిన యీమహానీయుఁడకు నాసోదరుఁ డింకను రాకున్నాఁడు. ఎందుచేతనో ! అతఁడు రాకుండ నిచ్చటనుండి పాఱిపోవుట బాగుగా నుండదు. అయినను నే నేవంకపెట్టుకొని యీామె నిప్పుడు త్యజింపఁగలను ?

కళా—ప్రాణకాంతా ! గంట కొక్కమాట నాడుచున్నావు. నీకు నిద్రవచ్చుచున్నదేమో యని యనుకొందును. రమ్ము పండుకొందువుగాని. నీకు వేఱె మంచమున్నది.

సర—నే నచ్చటకెందులకు ? మఱెక్కడనైన శయనింతును.

కళా—నాథా ! అభ్యంతరమేమి ? నీ వెక్కడికిఁ బోఁగూడదు. ఇదివఱకు నిన్ను వదలి పడినబాధ చాలదా ? రమ్ము. (మీఁదఁ జేయివైచును.)

సర—(తనలో) అయ్యయ్యో ! ఇప్పు డేమిచేయుదును. మానరక్షకుఁడవగు నోసోదరుఁడా !

ఆ. వట్టి వ్యర్థుఁడైన ♦ పతినుండి రక్షించి
తంచు మిగుల సంతో♦సించినాను

మఱియు వ్యర్థపతిని ♦ మగువ కీమెకుఁ దార్చి
యేల బాధఁ గూర్చి ♦ తిరుపురకును.

హరిహరీ! నిన్ననవేల? నీ వేమియెఱఁగియుందువు? నీబసయైన యీ మూఁడవగది కింకఁ బోవుచుండఁగనే యీమె నన్నడ్డు దగిలిన దే. (ప్రకా) ప్రాణేశ్వరీ! నాగదికిఁ బోయి నేను బండుకొందును.

కళా—నే నేమిచేయఁగలను? నన్ను క్షమింపుము. ఒక్క యీరాత్రి యే మన కీబాధ.

సర—(తనలో) నిజముగా నొక్క యీరాత్రియే. భగవంతుఁ డట్లే యనుగ్రహించుఁగాక! ఇఁక గొజ్జామగఁడు నీకు వలదు. కొప్పు దారిపెండ్లాము నాకు వలదు. లంఘనాలదాని నన్నములేనిది యాచించిన క్లొంమలకీవ్యర్థబాధ.

కళా—కురంగీ! కురంగీ!

సర—అదియెందులకు?

కళా—సరి సరి. ఔను. అది నీయెదుటఁ బడనీయఁగూడదనుకొంటిని గాదా! నీకుఁ బ్రక్కను దెచ్చుటకు రమ్మంటినిలే.

సర—అక్కఱలేదు.

(నేపథ్యమున నిమ్మళముగా) కురంగీ! కురంగీ!

కళా—ఎవ్వరో కురంగిని బిలుచుచున్నారు.

సర—(తనలో) అయ్యయ్యో! ఆకంఠరవ మిదివఱకు వినినదే. అతఁడే యైయుండునా?

(నేపథ్యమున) ఎవరు నన్నుఁ బిలుచువాఁడు? (తిరుగ నేపథ్యమున మఱియొక్క కంఠరవమున) ఎవ్వరా? నిన్ను రామపుర రాజ్యమునకు రాణిగాఁ జేయవచ్చిన మనమే, ఇదిగో మనమే.

కళా—అదేమి అదేమి ?

సర—(తనలో) అయ్యయ్యో! వాఁడే! నాసోదరునిఁ జంపినాఁడు కాఁబోలు. నాజాడకనిపట్టి యిటకు వచ్చినాఁడు కాఁబోలు. అటులైన నాతఁడు కురంగి నెందులకుఁ బిలిచినాఁడు. కురంగిపే రీతఁ డెట్లెఱుఁగునో. అయినను దొందరపడక నిదానింతును. (ప్ర) ప్రాణేశ్వరీ ! మఱేమియుఁ దొందరలేదు. కురంగికి మగఁడు వచ్చినాఁడు.

కళా—నిజముగానే. నిజముగానే. ఇప్పు డెక్కడనుండివచ్చినాఁడు ? ఎవఁడు ? రామపుర రాజ్యమున కీముండను రాణిగాఁ జేయుదు ననుచున్నాఁడేమి?

సర—ఏమో ! ఎవ్వరియదృష్ట మెట్లున్నదో?

కళా—నిజముగా దాని కట్టి మంచిమగఁడు దొరకినయెడల నమ్మవారికి నేను నామెడలోనిహార మిచ్చెదను.

సర—నాపుణ్యమున నాతఁడు దానినే పెండ్లిచేసికొనినయెడల నేను నూరుకాసులను గాళికమ్మ కిచ్చెదను.

కళా—అబ్బే! అఁడుదానిలాగున నీవుకూడ నమ్మవారికే మ్రొక్కకొంటివేల ?

సర—(తనలో) ఈస్సీ నేల నడచిపోయినది. పైగుడ్డలే పరికృతిని మార్చఁగలిగినయెడల బట్టలుకట్టు జంగమే బ్రహ్మయగునుగాదా. అహా ! మగవాఁడాఁడుదాని ననుకరించినాఁడనఁగ నాఁడుదాని కెంతయసహ్యమో కనఁబడినదికాదా ? అబ్బే ? యని తృణప్రాయముగాఁ దీసిపైచినది. ఆఁడుది యట్లే మగవాని ననుకరించినయెడల మగవానికిఁగూడ దానియందంత రోఁతయుండకపోవునా ? నేను మగవేసమున నుంటిననని నానాథునితోఁ జెప్పక

పోవుట యెంత మంచిపనియయ్యెనో? ఆహా! తానువలచువస్తు
వు తనకంటె సర్వవిధముల భేదముగానున్నఁగాని యట వల
పెక్కనే యెక్కదు.

గీ. కాలరూపుని గోరు బం♦గారుబొమ్మ
శ్రీరమాదేవి విష్ణునిఁ ♦ జేరినట్లు;
నల్లనగు నామె కాంక్షించుఁ ♦ దెల్లవాని
భవునికర్థాంగమైన శాం♦భవినిబోలె.

స్వరూపవైపరీత్యమే కాక స్వభావవైపరీత్యము కూడ వలపున
కుఁ బెద్దకారణము. ఇది నాకు స్ఫురించినది కాదు. ఇప్పుడు
మనస్సునఁ దళుక్కుమనినది.

గీ. ఎల్లజగతియు మనసులో ♦ నిమిడియుండు
నదియె చదువంగఁ దగు; వేఱు ♦ చదువులేల?
గ్రంథభండారమెల్ల నక్కడనె వెలయుఁ
బైచదువులెల్లఁ జిలుకల ♦ పఠన గతులె.

(ప్రకా) ప్రాణేశ్వరీ! అందుదానిలాగున నమ్మువారికి మ్రొక్కు
కొంటివేల యని యంటివి. భార్య కొకదేవత భర్త కొకఁడేన
తయునా యని యట్లొనర్చితిని. అదికాక సర్వవిధముల నీకు
వశుఁడనైన నేను నీవంటి యొండుదాననే యనుకొనుట తప్పు
లేదులే.

కళా—నాథా! నే నట్టివాల్లభ్యమును గనఁబఱుమదాననుగాను. భర్త
కు సర్వదా విధేయను.

సర—సరే. నీవట్టిదానవే కావచ్చును గాని నిన్ను స్వాధీనపఱచుకొనిన
దాఁక నాకు బింకమేది?

కళా—నాథా! అట్లనుట తగునా? పడినప్పు డింకఁబఱుచుకొనుటయెం

దులకు ? నన్ను నిరాకరించినను నీయింటికి దాసినై నేను రా లేదా ? ఏదీ ? నిన్ను నాగదిలోఁ బంధించుమ్మని నేను కోరఁగఁ బైకి లేచిపోవుదుననుచున్నావు !

(నేపథ్యమున) లేచితివా కురంగీ ! కురంగీ !

(తిరుగ నేపథ్యమున నితరకంఠరవమున) లేచితిని- కఱ్ఱకొఱకు వెదకుచున్నాను.

కళా—ఈముసలిరాజుగారిని గొట్టును గాఁబోలు. అదిగో! వా రిద్దఱిటకేవచ్చుచున్నారు. మన మావలిప్రక్కనుండి చూచి సంతోషింతమురా. వారు మనకుఁ గనఁబడుదురు. మనము వారికిఁ గనఁబడము. ఇచ్చటనుందము. (వారట్లు దాఁగియుందురు.)

(జయధర్మసింహకురంగి కఱ్ఱతోఁ బ్రవేశము.)

సర—వారి శృంగారసంభాషణము మనము వినవచ్చునా ?

కళా—ఆఁ ! రాదాయేమి కాదా ? పాపము దానిపెండ్లికూడఁ జేయఁదలఁచినాఁడు. నాకుఁ కుదిరినయెడల బాగుగా నుండును. కొట్టితూలు దగులుటకే యొగ్గసీయును.

సర—నీదాపి కావున నీవు నిటులు నెనుబోయి—ఏందులకులే—నేను కూడ నుండెదను. ఈముండకొడుకును కురంగియు నొకరినొకరు గ్రుద్దుకొనునెడల వేడుకచేయుటకైనఁ బనికివచ్చును (తనలో) ఈముండకొడుకు సంభాషణలో నా మానరక్షకునిసంగతి యేమైన వెల్లడియగునేమో వింటును.

కురం—ఏ వెవఁడవురా ?

జయ—మహాప్రభూ ! మీ దేవేరి పరిచారిక లెవరైన నడుగుటకంటె నీవెవ్వఁడవురా యని యడుగుట మనకు మహామృదువుగాను భక్తిపూర్వకముగాను నున్నది. మృదుత్వమనునది

మాటలోఁ గాదు నోటిలో నున్నది. దంతములచేత నీమాట యింకఁ గొంచెము పరుషముగా నున్నది కాని యవియన్నియు నూడఁదీయించినయెడల వట్టి నల్లిపోతు. మామేనమామ యభిచారవిద్యాపారంగతుఁడు ; అతని కొకసారి యొకచిత్రము జరిగినది. ఆయనకు రాత్రివఱకు దంతములన్నియు నున్నవి. తెల్లవాఱి లేచి పండ్లుతోముకొనుటకు సన్నాహము చేయుచుండఁగా బాబూ! మీకుఁ బండ్లులేవని భటుఁడు హెచ్చరించెను. అప్పటి డాతని మాటమృదుత్వము చెప్ప వీలులేదు. బూరుగదూది గోమయము.

కురం—నీ వెవ్వఁడవని యడుగ వెట్టిచదువులు చదివెదవేల? నేను మంచిదాననుగాను. ఇదిగో కట్టె—ఇట్లే మాయక్క తన్ను నిద్రనుండి లేపిన మంగలివైద్యుని మగఁడనుకొని కోపమున ముక్కు కొఱికినది.

కళా—నాథా! ఆమె యిట్లు మాటలాడుచున్నాఁదేల?

సర—ఓటికుండ యంతకంటె బాగుగాఁ బలుకునా?

కళా—అలాగా? అటులైనఁ గురంగి కట్టెదెబ్బచే భిన్నమగునేమో?

జయ—మన మెవరమని నీవు నన్నడిగితివి. ఎవరమని చెప్పఁగలము. అన్నియు మనమే యయినప్పు డని యెట్లు నిర్ణయింపవచ్చును. సంక్షేపముగాఁ జెప్పెదము. పెండ్లికూఁతురుగారి వెనుకటి మగలము. రామపురరాజ్యమునకు ముందటి రాజులము.

కురం—పెండ్లికూఁతురుగా రెవరు? మాపిన్నమ్మ సరిగ నిదియేమాదిరి వెనుకమగఁడని ముందుమగఁడని ప్రక్కమగఁడని పంపుగమగఁడని వెచ్చపుమగఁడని పీఁతలలో జాతులు తీసినట్లు వేఱుచేయు

జయ— పెండ్లికూఁతురుగా రెవరనఁగ— రామపుర రాజుకూఁతురు. ఆమె మనకొక వ్రేలువిడిచిన మేనగోడలు. అయిదువేళ్లువిడిచిన పెండ్లికూఁతురుగారు.

కళా— ప్రాణేశ్వరా! రామపుర రాజుకూఁతు రెవతెయో నీ వెఱుఁగుదువా?

సర— నేనెఱుఁగుదును. నీవెఱుఁగుదువు. నీవనేకపర్యాయములామెను జూచియుందువు. గుర్తు లేదు కాని—

కళా— నీవు పొరపాటుపడుచున్నావు. లేదుసుమా!

సరం— మాముసలమ్మచెల్లెలు కాశివెళ్లినది. గంగాస్నానముచేసి కామినిని వదలుచుకొనుటకు-అక్కడనామెకు జబ్బుచేసినది. గుర్తు తెలియక పశువులయాసుపత్రిలో ముడిచిపెట్టుకొని పండుకొనెను. పశువులవైద్యుఁడు వచ్చి యామెమొగమును జూచికుక్కయనుకొని రెండుచెవులును గత్తిరించెను. మనగ్రామమునకు వచ్చినతరువాత నీచెవులేవే యని యూరివారడుగఁ గాశికిఁ బోయినవారిప్పుడు కాయగూరలు విడుచుట మాని కర్ణములు విడుచుచున్నారని చెప్పినది. అప్పటినుండియు మాయింటివారికిఁ జెవులు విడిచినవారని పౌరుషనామము కలిగినది. కాని అయిదువేళ్లు విడిచిన పెండ్లికూఁతురని యంటివేల?

జయ— ఆమె యయిదువేళ్లు మనదౌడపై విడిచినది. తెలిసినదా? ఇదిగో చూడుము, సప్తసాగరాలు మనగొంతుకమీఁద విడుచుటకు సిద్ధముకాఁగాఁ బౌరుషమే ప్రధానమైనవారము కావున, నాఁడు దానిని జేయిచేసికొనక మర్యాదగా గిఱుక్కునఁ దిరిగివచ్చితిమి. నీవు మనవలెనే యుపాఖ్యానాలుచెప్పుటయందుత్సాహముగల దానవగుటచే నిన్నుఁ జూడఁగనే మన గర్భకోశముననున్న మ

న్మథుఁడు కెవ్వున నార్భినాఁడు. మనయన్నగారు మనయమ్మ దాసియగు కుందరదన కట్టుముపంచ నొక్కసారి లాగినప్పు డది యాతని మొగముపై ఘూయని యుమిసినది. అన్నగారట్టి చెక్కు చెదరక పౌరుషపరిధానుఁడగుటచేత నీవృత్తాంతము వెల్లడికా కుండునట్లుగా, లౌకికశిఖామణి కావున దానిరెండుకాళులు బట్టుకొనెను. మఱియొక పిఱికిముండకొడుకయినయెడల గయోపాఖ్యానమంత గత్తరయయి యుండవలసినది. ఆపద్ధతిగానే పెండ్లికూఁతురుగారియెడల మనము వర్తించితిమి.

సర—(తనలో) నేనుబ్రదికితిని. నామానరక్షకుఁడు సుఖముగానున్నాఁడు.

కళా—ఇంత వెఱ్ఱిముండకొడుకు నింకఁ గట్టుతీసికొని వేయక కురంగి యింక నుపేక్షించుచున్నదేమో ?

సర—ప్రాణేశ్వరీ ! ఆఁడుదానవుకదా ! అది నీదాసికదా ! ఈమాత్రమే కనిపట్టలేకపోయితివేమి ?

కళా—ప్రాణేశ్వరా ! నిజముగా నదియేనా? నాకు మనస్సున స్ఫురించినది కాని నీవధిక్షేపింతువేమో యని పైకిఁ బలుకుటకు సందేహించితిని. కురంగి యీనిర్భాగ్యుని వలచియే యుండునా?

సర—నిర్భాగ్యుఁడేమి ; రామపురరాజు.

కళా—ఈముండ రాణికావచ్చునని యాసపడినది కాఁబోలు ;

సర—అటుమాను వలపుగాక యదియేమి ?

గీ. కన్నులరవ్రాలెఁ జెక్కులఁ • గరముకెంపు
నుబికెఁ జిఱుచెమ్మట విప్రెక్కు • కొప్పగిల్లెఁ
జైటయదరెఁ బొట్టుచెదరెఁ • బ్రాసినట్లు
నింతలోమారెఁ గాబోలుఁ • నెన్నిపనులొ.

కురం—మామేనమామ మనుమరాలు పొగమట్టుగొలుపు మాయింటికి

వచ్చి యీమాట చెప్పక అమ్మవారిజాతరనుగుఱించి కుక్కల పిచ్చినిగుఱించి కవులతగవులను గూర్చియుఁ జెప్ప మొదలుపెట్టినది. మాయమ్మ యీలాగుననే దానిని జెవిపట్టికొనిజాడించి కాలిమీఁద నొక్కతన్ను తన్నినది. (అట్లు తన్నును.)

కళా—ఇది విలాసముగాఁ దన్నిన తన్నుసుమా!

సర—గాడిదెశృంగారమనఁగా నిదియే.

జయ—సెబాస్! మన్మథుఁడు ఢంకా మోగించుచున్నాఁడు. (పాడుచున్నాఁడు.)

దంశీవంశీపాయి మన్మథుఁడు- డప్పు కాచికొట్టినాఁడు మన్మథుఁడు- గాడిపొయ్యిత్రిప్పినాఁడు మన్మథుఁడు- గరిటెకాఁడఁద్రిప్పినాఁడు మన్మథుఁడు- పఱవకువెళ్లినాఁడు మన్మథుఁడు- పందికొక్కునుజంపినాఁడు మన్మథుఁడు- సింహాపీఠమెక్కినాఁడు మన్మథుఁడు- చెప్పుదెబ్బలుకొట్టినాఁడు మన్మథుఁడు- దంశీవంశీపాయి మన్మథుఁడు- డప్పు కాచికొట్టినాఁడు మన్మథుఁడు.

కళా—అయ్యయ్యో! అట్లు పాడుచున్నాఁడేల?

సర—ఏడువలేక.

కురం—నీకేమి పిచ్చియా? అట్లు పాడెదవేల?

జయ—పిచ్చియనునది సంచారిభావములలో నొక్కటి. సాత్త్వికములు రాకుండనే సంచారిభావములు మనకు గంగవెఱ్ఱులవలె వచ్చినవి. మన్మథునికింత తుపాను పట్టుటమాత్రము మన మెఱుఁగము. ఇదివఱకు మనము చూచినస్థలములలో నింతసన్నిపాతముమాత్రము మనకుఁ గలుగలేదు.

కురం—ఏమీ? ఇదివఱకుఁ జూచినస్థలములా? అన్నిస్థలములు చూచి యిప్పుడా యిక్కడికి వచ్చితివి! చాలులే—నడునడు. (కత్తి

యెత్తును).

కళా—అమ్మ నీవగలుమంత—ప్రాణేశ్వరా వింటివా?

సర—పేర్మిమార్ద్రితచేఁ బెద్దపులియైన మెత్తఁబడునుగాదా!

జయ—ఈస్థలముతక్క మఱి యేస్థలమైనఁ జూచినయెడలఁ దండ్రిని జంపినట్లు.

సర—ఛీ. ఛీ. నిర్భాగ్యుఁడా!

కురం—ఎన్నోస్థలములు చూచినట్లు నాతో నేల యసత్యమాడవలయును?

జయ—మర్యాదకొఱకు- పౌరుషముకొఱకు- చంపినరోగులఁబట్టి వైద్యునికి ఘనత- పాడుచేసిన గ్రంథాలఁబట్టి కవికి ఘనత-దిబ్బలు తీర్చిన రాజ్యాలఁబట్టి న్యాయవాదికి ఘనత- లాఁగిన్న ...టలను బట్టి రాజునకు ఘనత- అందుకొఱ కట్లెంచ్చితిమి.

కురం—నాకీగొడవయంతయు నేల? నీవు నిజముగా రాజవేనా?

జయ—కాకపోయినయెడల నీయెడమకాలితో మూతిమీఁదదన్ను- నెత్తిమీఁద శతకోపముకంటె నాకది యెక్కువగౌరవము. మనకుఁ గావలసినది మర్యాద- మర్యాదయనునది పరులకన్నులలో నున్నది కాని మనగర్భములో లేదు. అందుచేత మర్యాదగా నీనాలుగుగోడలనడుమను నీవెన్ని చెప్పుదెబ్బలుకొట్టినను మనకది సత్యనారాయణప్రసాదమన్నమాట- రాజమర్యాదకు ధర్మసూక్ష్మమిది.

కురం—అటులైన నీకు రాజ్యమెప్పుడువచ్చును?

జయ—దైవకటాక్షమున రామపురరాజున కిప్పుడు జబ్బుగా నున్నది. మనమక్కడ నున్నయెడల విసముపెట్టి చంపినామను నపయశస్సు మనకు దక్కునేమోయని—.

పర—(తనలో) హాతండ్రీ! నీకు జబ్బుగానున్నదా? ఈనిర్భాగ్యురాలు నిన్నువిడిచి యిచ్చట నాఁడుదానికి మగఁడుగా నున్నది. నీకు దిక్కెవ్వరు? నాతండ్రి! భార్య రెండవది. కొడుకెవ్వఁడు లేఁడు. ఉన్నకూఁతు రీవిధముగా మన్నయినది. ఒకవేళ నీముందుకొడు కసత్యమాడియుండునేమో? హాభగవానుఁడా! మాతండ్రిని రక్షించు రక్షించు.

కళా—ప్రాణేశ్వరా! అస్తిమితతగా నున్నట్లుంటివేల?

పర—నాకిక్కడనుండుట రోఁతగానున్నది. పోయి పండుకొందును.

కురం—ఆయనతరువాత నీవు రాజవు కాఁబోలునేమి?

జయ—నీవు రాణివి. నేను రాజను. నీవు కృతిపత్నివి. నేను కవిని.

కురం—మామునలమ్మ కొక్కపూజారికవి గణపతికథను కవిత్వముకట్టి కృతినిచ్చెను. ఆమె కవి నెట్లు బహుమానించెనో యెఱుఁగుదువా? సగముజీతముమీఁదఁ దనయుక్కను నెలదినములుంచుకొనుమని కవి కుత్తరువుచేసెను. పుస్తకభండారములకు మేము సగమువెలలకే మాగ్రంథము లిచ్చుచున్నాము. కావున నీయే ర్పాటు నాకు సమ్మతమే యని కవి యందుల కొడఁబడెను. నీ కృతికి నేనేమి బహుమాన మీయవలయునా యని చూచుచున్నాను.

జయ—ఈడింకికోడియే నాకు బహుమానము. (కురంగి ముక్కునలుపుచున్నాఁడు.)

కురం—(జయరాముని మూతిపైఁ గొట్టుచున్నది.)

పర—ప్రాణేశ్వరీ! పాదుపారమ్మన్నను బోపోయును స్వభావముగల దానవని నాతో నిది యనినది. ఇప్పుడిట్టి యీపందకుఁదక్కినది, కూఁతలకుఁ జేఁతల కెంతవ్యత్యాసమున్నదో చూచితివా?

కళా—కాని నాథా! ఇది మనలనిడిచి పోవుచు. ఏతెలివితక్కువపెద్ద మ్మ రాజునకైన రాణికైన సుఖపడునెడల నంతే కావలసినది.

సర—దాని మొగము దాని మోర.

కళా—ఇదియంతయు నసత్యమేనా?

సర—ఏదో పోనిమ్ము- మన కెందులకు?

కురం—నిన్నుఁ జూడఁగనే నీయందు నాకనురాగముకలిగినది. రాజ్య ముసుబట్టి కొంతకలిగినది. నీ చేతవాతఁగానితనమువలన, నీ వె ఱ్ఱిముండకొడుకుఁదనమువలన మఱికొంత కలిగినది.

జయ—మన మట్టివారమనియే కొందఱుమూఢు లనుకొనుట కలదని మనము కర్ణాకర్ణిగా వినియున్నాము.

కురం—లోకమంతయు నేకగ్రీవముగా ననఁదగినమాట యిదియొక్కటి యే. అందుకొఱకే నిన్న పేక్షించితిని. మఱఁడెప్పుడు పనికిమా లిన తెలివిమాలిన నోరుమాలిన చచ్చుపెద్దన్నుయై యుండవల యును. సర్వసుఖములు పొందఁదగినయాఁడు దట్టివానిని గట్టు కొవలయును. అట్టి యథమాధమతత్త్వము నా కంటఁబడినది.

జయ—సరే. తత్త్వపరీక్ష యెందులకు. కాని మన పెండ్లి యెప్పుడు?

కురం—ఇప్పుడేనా యేమి?

జయ—గ్రహచారజ్ఞాననిధులు పైమాసములోఁ బ్రళయమునకు ము హూర్తముంచినారు. ఆలగ్నమం దాశుభకార్యముజరుగునేమో? ఒక్కగడియ వృథచేసినయెడలఁ గార్యములేదు. ఉత్తరజన్మము లోని ముచ్చటలుకూడ నీనెలలోనే తీరవలయును.

కురం—సరే. అట్లైనాఁగక నీవు కాళికాలయమునఁ బండుకొనుము.

జయ—ఇప్పటికింతే! మన్మథుఁ డిప్పటికిఁ బొది బుజమునఁ దగిలించి కొని పోవలసినదేనా?

కురం—పనిలోఁ బని—తల గొఱిగించుకొనియే పోవ్వనుము.

(జయరాముఁడు నిష్క్రమించును.)

సర—ప్రాణేశ్వరీ! నేనింకఁబోయి పండుకొందును. (తనలో) తూర్పు తెల్లఁబాఱువఱకుఁ జూచి నా మానరక్షకుఁడు రాకున్నయెడలఁ బాఱిపోయి మఱెక్కడనైన దాఁగి నానాథునికొఱకు చూచు చుందును. (పోవును.)

కురం—మాయమ్మతో నామగనిసంగతిఁ దెలిపెదను. (పోవును.)

కళా—హా! ప్రాణేశ్వరా! తెల్లవాఱవలయును గాదా- నిన్నుఁదిరుగ నెంతకాలమునకుఁ జూతునో?

(నిష్క్రమింపఁగ అపేక్షినే మఱియొకకొనను.

ప్రవేశము గోవర్ధనుఁడు స్త్రీరూపమున.)

గో—ఇదిగో వచ్చెదనని యీసందులోనికిఁ బోయినాఁడు. ఇపుడేవచ్చు నో రనంతసేపటికి వచ్చునోయని గంటనుండి కనిపెట్టియుంటిని. దొంగయుండకొడుకు! నాతో నిన్ను నాబసకుఁ దీసికొనిపోవు దునని చెప్పియు సత్రములో నాబస అయిదవగదియనియు దాసిపేరు కురంగి యనియు నోరు జాఱఁజెప్పితిని. అక్కడికి నాతోఁ జెప్పకుండ ముందు పరుగెత్తుకొనిపోయినాఁడేమో? దానిని జూడవలయునని యుత్సాహ మెక్కువగా నున్నదికాఁబోలు! ఈపరికి మాటలాడుచుండునేమో? వారిద్దఱి యవకతవక సంభాషణ వినవలయునని యనుకొంటిని. నాదేవియగు కళాలలిత బస చెప్పితినిగాని మూఁడవగదియైన నాబస చెప్పియుండినయెడలఁ గొంప మునిఁగియుండును. ఈతఁడు బలాత్కరింపఁ బోయిన కాంతయొద్దకే తిరుగ నీఁడు పోయినయెడల నింకే మైన నున్నదా? అయినను బురుషరూపమున నున్నదికదా?

ఆమె ధరించిన దుస్తులచేతనే నన్నామెగా నీశుంఠభావించినాఁడు. స్వరూపభేదము నెంతమాత్రమును గ్రహింపలేదు. వట్టి తెలివితక్కువ నిర్భాగ్యుఁడు. ఒకవేళ, బ్రదికితినిగదా యని కాలుకొలఁది మఱెక్కడికైనఁ బాఱిపోయినాఁడేమో? ఒక్కసారి పిలచి—ఏమనిపిలువను? పేరెఱుఁగను. ఓపెండ్లికొడుకుగారూ! ఉహూ- నేనింక సత్రమునకుఁ బోయెదను. హా కళాలలితా! ఇంతలో వచ్చెదనని చెప్పి యెంతయాలస్యముచేసితినో! హా! కళాలలితా! ప్రాణమంతయు నీయొద్దనే యున్నది. బొందిమాత్ర మిచ్చటఁ దిరుగుచున్నది.

(కళాలలితుఁడు ప్రవేశించును.)

కళా—(గోవర్ధనుని జూచి గడగడ వడకుచున్నాఁడు.)

గీ. తేజమో గానమో ప్రేమ ♦ దేవియేమొ!
హృదయమును జీల్చుకొని పైకి ♦ నెగిరి వచ్చి
ముందు నిల్చు గోవర్ధన ♦ మూర్తియేమొ!
స్వప్నమో మూర్ఛయో చావొ ♦ పరిణయంబొ!

(నేలవ్రాలి మూర్ఛపడును.)

గో—హాహా! ఇదేమి? (అతనిసమీపించి) అయ్యా! అయ్యా! (విసరును.) ఇంకను లేవకున్నాఁడు. "హృదయమును జీల్చుకొని పైకి నెగిరివచ్చి, ముందు నిల్చుగోవర్ధనమూర్తియేమొ" యని యీతఁడనినాఁడు ఆహా! ఈతఁడు నాకు ద్వితీయభర్తకాఁబోలు. వెనుకటి మగఁడు నావలన నేమి సుఖపడినాఁడని యీతఁడు నన్నాసించెనో! ఆహా! పాపము. గాఢమైన మూర్ఛావస్థలో నున్నాఁడు. నాపేరతఁ డెట్లెఱుఁగునో తెలియదు. ఏకాంతమైన నెచ్చటనైన నేనెఱుఁగకుండ వలచియుండి నాకొఱకు

ఆమె ధరించిన దుస్తులచేతనే

ఉ. స్వరూపభేదము ... ను స్త్రీరూప • మునను దిరుగ
తెలివితక్కువ ద్దలిచ్చెడు మగలకు • హద్దు కలదె ?
లుకొ... భర్తృసంపాదనమునకుఁ • బడఁతి యగుచుఁ
బుట్టనక్కఱయేలేదు • ముదితవలెను
నిలఁబడినఁ జాలుఁ బోతురా • యలను నేల
రాయునది త్రైకయే కాని • రమణి కాదు.

ఆ! ఇదిగో కొంత స్మృతి కలుగుచున్నది. కన్నులు తెఱచి నాఁడు.

కళా—(నిమ్మళముగ) చక్రిపుటపాకాయ మందుచుఁ దిరిగినట్టు లేది యో యొకదీప్తి గిఱగిఱఁ దిరుగుచున్నది.

కళా-

గో—తొందరలేదు—కన్ను లింక మూసికొనుము. (మూయును) పాపము! ఏకాంతను గాఢముగా వలచియున్నాఁడో. ఇతని రాగ మతిగాఢమై యున్నట్లున్నది. ఆహా! నా బ్రదు... ముగా నున్నది ?

గీ. పతులు లెక్కింప నిద్దఱు • భార్య యొకతె
భార్యయైనను మొదట నా • భార్య కాదు
వట్టి యూడంగివానిది • కట్టుకొంటి
మగతనము చూపనీరీతిఁ • దగులఁబడియె.

గో-

కళా—(కన్నులు తెఱచి)

గీ. గంటలాగుచ వెలిఁగెడి • మంటలోనఁ
బూలు తీఁగెలు మొగ్గలు • ముత్తెములును
గాలులు కాఁకరపూవత్తి • కాలుచున్న
దేమొ ? దీపావళీదర్ప • యేమొ నేఁడు ?

త్మకముగా నిష్టదేవతకుఁ దన్నర్పణముఁ జేసికొనిన పరిపన్నుని వలె నున్నాఁడు. గొప్పవాఁడే యగును. అయిన నేమి? కంది మోఁకువలె బిగిసికొనియున్నాఁడే-కదలఁడే!

ఆ. వె. వట్టిమొండివాని ♦ వైఖరి యొక్కటి
మఱి ప్రపత్తిపూర్ణు ♦ మార్గ మొకటి
యొక్కొక్కప్పుడు పైకి ♦ నొక్కలాగే యుండు
జ్ఞానిపిచ్చివాని ♦ చందమునను.

కళా—ప్రాణేశ్వరీ! నీవు స్త్రీవస్త్రధారిణివై యుండుటచేత నీవు బ్రదికితివి-నన్ను బ్రదికించితివి.

గో—నేను బ్రదుకుటకూడ నెట్లు?

కళా—ఈకాళీపురరాజు దుర్మార్గుఁడు- రామపురరాజున కీతఁడు పినతండ్రికొడుకు. ద్వితీయభార్యామృతివలన రామపురాధీశుఁడు కొంచెము మతిచెడి యున్నాఁడు. ఆవంకను దీసికొని కాళీపురరాజు తదనంతరప్రభుఁ డగుటచేఁ గొంతపరివారమును గూర్చుకొని కోటలోనే యున్నాఁడట; అతని నొకవేళ రాజ్యాశచేఁ జంపునేమో యని నాకు భయముగా నున్నది. ఆరామపురరాజున కొక్కతెయే కూఁతురు. రాజ్య మామెకు రాఁదగినది. ఆమె యెచ్చట నున్నదో తెలియదు. ఇంతవఱ కేదో కొంత కారణబద్ధముగనే యున్నది. కాని గోవర్ధనునిబట్టుకొని చంపుమని కాళీపురరాజు వాజ్ఞయగుటచేత నాతనికొఱకు కన్నియూళ్ళు దిరుగుచున్నారు. అన్నియూస్థానములు దిరుగుచున్నారు. ఆగోవర్ధనుఁ డెవఁడో తెలియదు. ఈసంగతులన్నియు నీయూరనున్న గాళీపురాస్థానప్రధానుఁడు నాతోఁ జెప్పినాఁడు. అన్నియుత్సవప్రదేశములును నేను నీకొఱకు వెదకితిని. తుద

కు నిన్నిక్కడఁ జూచితిని. కర్మముచాలక నీవు గోవర్ధననామ ధారిణివైతివి. నీపూర్వనామ మేదో నే నెఱుఁగను. స్త్రీవేషమును మాత్ర మింక విడువకుము.

గో — (తనలో) కాళీపుర రామపుర రాజ్యములకుఁదగవేమి? నడుమనన్నుఁ జంపుటయేమి? యీప్రాంతములనున్న రాజబాలకులలో గోవర్ధననాముఁ డెవ్వఁడును లేఁడు ఉన్మాదమునకు వైద్యము నాకుఁ దెలియును. నన్నుఁ బోషించుచున్న యవ్వ చెప్పినది. నేను రామపురమునకుఁ బోయి యారాజు పిచ్చి కుదిర్చెదను. ఎందులకైనను మంచిది, స్త్రీవేషముననే యుందును. నాభార్యతో నెందుల కిట్లుండవలసివచ్చినదో చెప్పుదును. ఆమెను దీసికొని సూర్యోదయ మగువెంటనే పోవుదును. కాని యితఁడు నన్ను విడుచుటెట్లు? నేను భార్యనని భ్రమపడి పాపము! ఎన్ని రహస్యములో చెప్పుచున్నాఁడు. నారహస్యము లట్టివానికి జెప్పవచ్చునా? రాత్రి యంతయు నిదురలేదు. అందులో నెక్కడికిఁ బోయిన నేనో యొక భ్రమమే- ఆభ్రమకు ముక్కు లేదు మూలము లేదు. ఎవ్వఁడును నన్నెఱుఁగఁడు. అందఱు నన్నెఱిఁగినవారే. నాకు మతియేపోవనున్నదో యేమో- సరి యేదో నాకర్మము నాది- కాని మరమేకవలె నున్న యీమగనిమాట యేమి?

కళా — తెల్లవాఱవచ్చుచున్నదేమో? ఇంక నిక్కడ నెందులకు?

గో — నేను నదియె చూచుచున్నాను. నీవు సందేహింపకుండు నెడల నీతో నొకమాట చెప్పెదను.

కళా — సందేహము లేదు. నీమాటకు వ్యతిరేకత లేదు. నీవు చెప్పినది చేయవలసినదే కాని, నేనుస్వతంత్రించి యేదియు నీకుఁ జేయను.

అట్లు చేసినందులకుఁ బ్రాయశ్చిత్తమైనది.

గో— ఇదివఱకుఁ బురుషుఁడను గాన నాకు బాధలేకపోయినది. ఇప్పు డాఁడుదాననైతినిగాన— రాజకాంతనైన నాకొక్కదాసియుండినఁ గాని వీలులేదు. నాకు మిగుల నమ్మకమైనదాసి కావలెను. నీవు స్త్రీవేషమును ధరించి నాదాసివై యుందువా?

కళా— మహాప్రసాదము- మహాప్రసాదము-ఉందువా యని వేఱ నన్నడుగనక్కఱలేదు- అట్లే యుంచుకొనుము.

గోవ— సరే- నీవు పోయి స్త్రీవేషమును ధరించి, వేగరమ్ము-నేనామేడలోనే యుందును. మఱ్ఱికొమ్మ ప్రక్కనుండి పోయినదే- అదే-

కళా— పోవుదును. త్వరలో వత్తును. (నిష్క్రమించును.)

గోవ— అమ్మ-బ్రదికితిని. మగఁడని పేరున్నంతమాత్రమున వెఱ్ఱినిర్భాగ్యపుముండకొడుకునకే కావలసినంత బిగింపు కలిగినప్పుడు మహారాజైన మగని కీమాత్రమైన నుండదా? హా కళాలలితా! వచ్చుచున్నాను. అయ్యయ్యో! నాబసకుఁబంపిన యారాజపుత్త్రికమాట మఱచిపోయితిని-

(నిష్క్రమించుచుండఁ, బ్రవేశము సరస్వతి.)

ప్రదేశము— సత్రమునకుఁ గొంచెము దూరమున.

సర— ఇఁక నన్ను రక్షించిన నాసోదరుఁడు రాఁడు. తెల్లవాఱవచ్చుచున్నది. ఇక్కడ నొక్కనిముసమైన నుండఁగూడదు. తాళము తీసి యుంచినయెడల నెవ్వఁడైన నతనిగదిని బ్రవేశించి యాతని వస్తువులను హరించును. వేసియే వెళ్లెదను. అతఁడు వచ్చి పగులఁగొట్టుకొనును.

(నేపథ్యమున) పట్టుకో- పట్టుకో- అతఁడే గోవర్ధనుఁడు- పట్టుకొని ప్రధానునొద్దకుఁ దీసికొనిపొమ్ము.

(ఒకభటుఁడు ప్రవేశించును.)

భటు—ఆఁగు- (పట్టుకొనును) రమ్ము-

సర—హా కళాలలితా! హా కళాలలితా!

(తీసికొనిపోవును.)

ఇది షష్ఠాంకము.



శ్రీరామా.




# సప్తమాంకము.

ప్రదేశము—సత్రము.

ప్రవేశము—కళాలలిత.

కళా—పనికిమాలిన మనస్సు! సందేహించినట్లే యయినది. అయ్యయ్యో! నేనేమి చేయుదును? ఇంత మిడిమేలపుమగఁడైన నెట్లు బ్రదుకుదును! కేవలము స్వాధీనురాలగు భార్యను మగఁడిట్లు వేఁపుకొనియే తినునుగాఁబోలు! స్వాధీనము కాకుండుటకు నాతరమా! భర్తను జూచిచూడకున్న భార్యచుట్టుచుట్టు మగఁడు తిరుగును. కాని వదలి యొక్కక్షణమైన బ్రదుకలేని నావంటివారి బ్రదుకు మగలచుట్టుచుట్టు తిరుగుటయే. అదియే మహాభాగ్యము. ఏలాగైన నాభర్త కనఁబడినఁజాలు! అదిగో! భానుఁడు! కలకల నుదయించుచున్నాఁడు. ఓసూర్యభగవానుఁడా! నిన్నుఁ బ్రత్యక్షముగాఁ జూచుట యీనాఁడే జరిగినది. నాకుఁ బైటపంపుగ జరిగినది మొదలు మేలుముసుఁగుచాటునుండియే నిన్నుఁ జూచితిని గాని యిట్లు నిర్భయముగాఁ జూడలేదు. నాకిఁక రాణివాస మెందులకు! బహిరంగముగా వీధిఁబడి నానాథుఁ డెక్కడనున్నాఁడో వెదకుదును.

అంతఃపురకాంత యట్లు రాణివాసమును బరిత్యజింపవచ్చునా? ఏమి చేయఁగలను? రాణివాసము జరుగుబాటుతో నున్నది. అది లేనప్పు డిదియు లేదు. జరుగుచున్నప్పు డందఱుస్త్రీలు రాణివాసము కలవారే; కడుపుకకుఱ్ఱితిచేఁ గడ నెక్కి యాడు దొమ్మరిసానికైనను రవంత చేరినతరువాత, రాణివాసమే; రాణివాస మొకరు గుంపనక్కఱలేదు. ఒకరు తీసివేయనక్కఱలేదు. ఉండవలసినప్పు డదియేయుండును. పోవలసినప్పు డదియేపోవును. అంతేకాక దానిని దీసివేయుతలంపునఁ బనిలేక యంతఃపురకాంతను నడువీథి కెక్కించి నగుబాటు నొందఁదగదు. దాని నుంచుతలఁపున ముప్పిదానిని దడకచాటునఁ గూర్చుండఁబెట్టి వస్తుపెట్టింపఁదగదు. ఎండకన్నెన్నఁ డెఱుఁగకిపోవుటచే నింత యీవిషయమై యాలోచింపుకొనవలసివచ్చినది. ఇంతస్త్రోత్క్రలాడవలసివచ్చినది. నాకిది మహాపదయము. మగఁడు మాయమగుటకంటె, మహాపద మఱియేమి! ఇప్పుడు రాణివాస మేల! కావున నేను వీథిని బడెదను. ఓ యంతఃపురకాంతలారా! నేను మీమర్యాదను జెడఁగొట్టితి నని మీరు నన్ను నిందింపకుఁడు. ఇట్టియవస్థలో మీరుకూడ నిట్లే చేయుదురేమో యోచించుకొనుఁడు—ఎవరచ్చట? కురంగీ!

కురంగి—(ప్రవేశించి) అమ్మా! కనఁబడెరాఁడా?

కళా—అయ్యో! లేదే. నీవు దేవాలయమేసులన్నియు జూచితివా?

కురం—చూచితిని. ఎక్కడను గనఁబడఁడు. ఏమికర్మమో!

కళా—నీభర్త యేమిచేయుచున్నాఁడు?

కురం—బలికై తెచ్చిన మేకలు భయపడి బెదరుచు యంబునందంతటి విపరీతమైన కూఁతఁ బెట్టుచు ఘుమఘుమనాదముతో నివసించు

చున్నాఁడు.

కళా—లేపలేకపోయితివా? పోనీ. అతఁ డెంచులకులే. నీవు పోయి తూర్పువీథిని మఱియొకసారి చూచి రమ్ము.

కురం—అలాగే. (నిష్క్రమించును.)

కళా—ఆదిత్యభగవానుఁడా! నాభర్తను నాకుఁ గనఁబఱచి రక్షింపుము. లోకచక్షువైన నీకాతఁ డెక్కడ నున్నాఁడో తెలియక పోదు. నీతో మఱియొకమాట చెప్పఁదలఁచినాను. నీవు మఱియొక్కబారెడు పైకి వచ్చుసరికి నానాథుఁడు నన్నుఁ జేరకుండునెడల నిదిగో యీపైఁటచెఱఁగును గొంతుకకుఁ జుట్టఁబెట్టికొని నడువీథిని మరణింతును. నీవంశమునఁ బుట్టినవారియెడల నీ కభిమాన మున్నయెడల నట్టిత్రొంవర రానీకుండఁ గాపాడుము. నీవంటిమహాత్ముఁడు వంశాభిమానము గనఁబఱుపనప్పుడు నావంటిది ప్రాణాభిమాన మగపఱుమట తగదు. గోవర్ధనా! ప్రాణేశ్వరా! ఎచ్చట నున్నావు? అట్లుపోయి వెదకుదును.

(కళాలలిత నిష్క్రమింపఁగ గోవర్ధనుఁడు ప్రవేశించును.)

గో—(స్త్రీ) వేషమున పెద్దవీథినుండి రాలేక సందుదారులఁ బట్టి నాబసకుఁ బోయితిని. తలుపుపైనఁ దాళమువైచియున్నది. ఆకాంత నాబసకు రానట్లు కనఁబడుచున్నది. తాళ మామెయొద్దనేయున్నది. తాళము పగులఁగొట్టుట కెవనికైనఁ దేవలయును—పోనీ. కళాలలితబసలోనికిఁ బోయిచూడ నాతలుపునకుఁగూడఁ దాళము వైచియున్నది. ఆకెయును లేదు. కురంగియును లేదు. హా! కళాలలితా! ఎచ్చటికిఁ బోయితివి! అయ్యయ్యో! ఇది యేమి? స్వప్నమా! మాయయా! ఇంద్రజాలమా! హా! కళాలలితా! హా! కళాలలితా!

(కళాలలిత ప్రవేశించును.)

కళా—(కౌఁగిలించుకొని) హా! ప్రాణేశ్వరా! ఇది న్యాయమా-న్యాయమా? స్త్రీవేషధారివై మమ్ము విడిచి పాఱిపోవుచుంటివా!

గో—కళాలలితా! కనఁబడితివా! మహాసంతోషము. నిన్ను మోసపుచ్చుట కీవేషము నేను ధరింపలేదు. ఇది వీథి. ఆప్రక్కను మాటలాడుకొందము రా.

కళా—సరే. (పరిక్రమించి) ఈవేసము నన్ను మోసపుచ్చుటకుఁ గాదుకదా-నన్ను వదలకుండునెడల నీవెన్ని వేసములు వేసినను నే నభ్యంతరపెట్టుదానను గాను. కాని ప్రాణేశ్వరా! స్త్రీవేషమున నీవు నాకంటె బాగుగా నున్నావేమోసుమా! అద్దము చూచుకొంటివా?

గో—చూచుకొంటిని. కాని యిక్కడ మన మాలసింపఁదగదు. కురంగి యెచ్చట నున్నది? మనము శీఘ్రముగా నిక్కడనుండి పోవలసియున్నది.

కళా—కురంగి నీకొఱకే యింతసేపు వెదకినది. ఆలయములోఁ బండుకొన్న తనభర్తను లేపుటకుఁ బోయినది. కురంగి కాదు-ఇంతటినుండి కురంగి రాణికదా-

గో—(తనలో) ఆవెఱ్ఱిముండకొడు కిక్కడకు వచ్చుట కురంగిని వలచుట- వారు భార్యాభర్తలగుట, జరిగినదా! సంతోషమే-వాని నయిదవగడికిఁ బొమ్మని నేను జెప్పితినిగాన సరిగ లెక్కఁజూచి యాబసకు వచ్చి కురంగిని జూచినాఁడు- మూఁడవగడిదియైన నాబసకు నేను బంపిన పురుషరూపధారిణియైన కాంతనుగూర్చి యీమె నడుగుట యెందులకు? ఈమె కామెనుగూర్చి యేమి తెలిసియుండును? అదిగాక ఆమె యవమానము నీమెతోఁ

నేను బాధించుదునో! నాప్రియురాలగు కళాలలితను నే నెప్పుడు చూతును? ఈతఁడు నాకు స్వాధీనుఁడై యున్నాఁడు. కావున నీతనిని సత్రమునొద్దకు తీసికొనిపోవుదునా? అయ్యయ్యో! గుమ్మములో నాకొఱకుఁ గనిపెట్టుకొనియుండుకళాలలిత నన్నుఁ జూడదా?

ఆ. వె. అవికఁ దొడిగి చీర ♦ తవణించి మగఁడనై,
చెలువఁ జూడ నేగ ♦ సిగ్గుగాదె?
మఱియు నందు నాదు ♦ మగఁడంచు నీతని
వెంటఁబెట్టుకొనుచు ♦ వెడలఁగలనె?

కళాలలితాప్రియుఁడ నైన నాకు లోకమందలి పరస్త్రీలు తోఁబుట్టువులు. అందులో నీతనిభార్య నావలెనే యుంటచే నాకు మఱింత చెల్లెలు—అదృష్టశాలినీ- కన్యకావతంసమా! ఓ చెల్లెలా!

1. వె. భార్యభార్య యనుచు ♦ బావ సిగ్గును వీడి,
చీర అవికడాబు ♦ చిత్తగించి
పాత్రి గనిన ఫోటొ ♦ వటువును దలదాఁటె
వేగ నేలుకొనుమ ♦ వెట్టిమగని.

నే నతనితో నొకటి రెండు మాటలకంటె నెక్కుమాట లాడ లేదుగదా! 'ధారాళముగా మాటలాడవేమి; ప్రాణేశ్వరా యని పిలువవేమి? నావంకఁ దిన్నగఁ జూడనైనఁ జూడవేమి?' యని యేమియు ననఁడే! అతని కేమియు నక్కఱలేదు. అతఁడు నన్నుఁ జూచి యానంద మొందుచే యాతనికిఁ గావలసినది కాఁబోలు- ఫలాభిసంధి లేని మహానురాగముతోఁ బ్రకాశించుచున్నాఁడు- సెబాస్- ఇంతవానిని నేను జూడలేదు. సర్వ

ప్రేయసీ! ప్రేయసీ యంచుఁ ♦ బిలువ నితని
సతినిగా నుంటినో యేమొ ♦ చచ్చినట్లు ?

ఆహాహా! నా పాలిటి దైవమైన కళాలలిత యచ్చట నాకొఱకు వేచి యుండఁగా నక్కడకుఁ బోఁదలఁచియుఁ బోలేకుండ నున్నాను. ఇతనిని వదలఁదలఁచియు వదలలేకుండ నున్నాను.

గీ. ఇష్టముండియు హితునకు ♦ నీయలేఁడు;
రోదనము సేయుచుండి శ ♦ త్రువున కిచ్చు;
నరునిస్వాతంత్ర్యసౌభాగ్య ♦ సరణి యిదియె;
మనుజుఁ డంతనిర్భాగ్యుఁ డీ ♦ మహిని లేఁడు.

గీ. బుద్ధి యున్నది యాత్రోవఁ ♦ బోవలేఁడు.
కలదు స్వైరత; వదలదు ♦ కాలిబొండ
మొఱకు యున్నది వినియోగ ♦ మెప్పుడు లేదు
నరునియంతటిబానిస ♦ ధరను లేఁడు.

కళా—ప్రాణేశ్వరీ! పనికిరాలిన మగరూపమును వదలి స్త్రీరూపము ను ధరించితివి! మహానందముగా నున్నది. ఇఁక నిన్ను నేను వదలను.

గో—(తనలో) ఇదియొక కర్మముకూడనా? నే నేదో స్త్రీనని భావింపకుండ మగవాఁడనై యాఁడువేసము వేసితినని, యనుకొను చున్నాఁడా? కాదు-కాదు- నాదే పొరపాటు. కనఁబడికనఁబడని వెలుతురులో కన్ను చెదరినట్లు, తెలిసితెలియని యోగాథలో మనస్సు చెదరుచున్నది. పురుషరూపధారిణియైన కాంత నీతఁడు వలచినాఁడు- ఆ వేసమును విడిచి స్వస్వరూపమునఁ గానఁబడుట మహానందము మొన్న నని యీతనియభిప్రాయము. ఈతఁడు నన్ను వదలననుచున్నాఁ డేమికర్మమో? ఇంక నెంత

-(తనలో) భగవానుఁడా! నాకీనరహత్య-అందుఁగో గాజహత్య-యేల గొంతుకకుఁ జుట్టఁబెట్టెదవయ్యా! అయ్యయో! ఈతఁడే దేశపరిభుకుమారుఁడో. నా కాళులఁ బడుటయేమి? పోనీ! పడినందుల కేమైన ఫలమున్నదా? పాపముతక్క నేమున్నది? నేను నీభార్యను గాను బొమ్మని యనువెంటనే కాకులతుపాకి తోఁ జచ్చిన కాకివలె గిజిగిజ దిరిగి చచ్చును. అది మఱింత పాపముకాదా? ఏమిచేయుటకును దోఁపకున్నదే. (ప్రకాశముగా) లెమ్ము కాళులు వదలుము.

—ప్రేయసీ!

గీ. వలదు కాళులు, చేతులు ♦ వలదు, నోరు
వలదు, నాసికస్పర్శంబు ♦ వలదు మొదలె;
గాత్రమంతయు నొక్కటే ♦ కన్నుగాఁగ,
నైన నిను జూచుకొంచు నే ♦ నట్టెయుందు.

-(తనలో) నాభార్యమొదల న్ప్రేమమే యధికమనుకొనుచుంటిని గాని, యిప్పుడు తల వంచుకొనవలసివచ్చినది. అనురాగాంబుధినైన యీతని బ్రదుకే బ్రదుకగుఁగాక! ఈతనిచే వరింపఁబడిన యాకాంత బ్రదుకే బ్రదుకగుఁగాక! ఇట్టివానిని నేను బొమ్మని నిరుత్సాహపఱచిన నిల్వునఁ బ్రాణము విడువఁడా? మచ్చునకైన నింత స్వచ్ఛానురాగము కొంతకాలము లోకమున నుండనీయక తప్పదు. అటులైన నేఁ జేయునదేమి? నాకెంత దిక్కుమాలిన సంధ్యవస్థ వచ్చినది. సతీమందునఁ గళాలలిత—

గీ. నామగఁడ వీవు రమ్మంచు ♦ నన్ను నామె
సొంపువ భర్తనై తిని నోరు ♦ మూసికొనుచుఁ

నున్న దే! గిఱగిఱ తిరిగినట్లు కనఁబడుట మాత్రము సద్దకొని నది. ఇంకను దృష్టికి విస్పష్టత కలుగలేదు. (ప్రకాశముగా) ఒకనిముసము శాంతి నొందుము. కనులు మూసికొనుము. ఆఁడుదానిచేతనే యీతఁడు పడియుండినయెడల నీవఱకే ప్రజ్ఞావంతుఁడై యుండవలసినది. మగవాఁడ నైన నాకు.

గీ. చలువలేదు చేతను దయా ♦ లలితమైన
పలుకు లేదు నిపుణమైన ♦ పట్టులేదు,
త్వరగ నారోగ్య మీతఁడు ♦ పడయు టెట్లు?
కటికవైద్యుచేఁ బడు రోగ ♦ కలితుఁ డట్లు.

ఈతని జూడఁగా నాకుఁ గొంచెము ప్రేమ యుదయించుచున్న దేల? బనారసుచీరపరిభావమా? కాదు. ఇదిగో ఈతనిముఖ నాకళాలలితముఖ్కును నొక్కతీరున నున్నవి. అందులకే యీ వికారము—ఇంతమాత్రమునకే నాకిట్టి మనోగతి కలుగఁగా నామూలాగ్రముగఁ ధనభార్యవలెఁ గానఁబడు నన్నుఁ జూచి యీతఁ డింతమూర్ఛపడుటలో వింత యేమున్నది? కాని లేచుచున్నాఁడు.

(లేచును. గోవర్ధనుఁడుకూడ లేచును.)

కళా—(గద్గదతో) ప్రాణేశ్వరీ! ఆఁగి ఆఁగి ఆలోచించి- ఆలోచించి- ఒక్కసారి కౌఁగిలించుకొంటి వని కోపముగలిగి పాఱిపోయితివా! నాగతి యేమగుననుకొంటివి!

గీ. బ్రిదుకుచుంటివో పాషాణ ♦ భక్షణమునఁ
జావుచుంటివో సెలవిమ్ము ♦ సత్వరముగ
నెన్నఁడును కౌఁగిలింపక ♦ మిన్నకుందు
బ్రదికినన్నాళ్లు పదములే ♦ పట్టుకొందు. (కాళులుబట్టుకొనును.)

జెప్పుట దోషముకాదా! (స్త్రీ)మర్యాద (పిడికిలిబట్టి) యింతలో నున్నది. ఇంతకు నాబసలోని కాకాంత వచ్చినట్లే లేదు. తెల్లవాఱువఱకు రానందులకు నన్ను క్షమింపు మని నాభార్యను గోరుట మఱచిపోయితిని. పోనీ. అదియుఁ గొంతమంచి పనియే జరిగినదేమో? ఎందుచేత రాలేదనఁగ నెన్నియో చెప్పవలసియుండును.

కళా—అదిగో కురంగిరాణి వచ్చుచున్నది.

గో—అది యిక్కడకేల ? మనముకూడ బసలోనికిఁ బోవుదము. చూడు. నేనొక కారణమున (స్త్రీ)రూపముననే కొంతకాల ముండవలసివచ్చినది. నీవొక్కతెవు తప్ప నాయొద్ద కెవ్వరును రావలదు.

కళా—నీయిష్ట మెట్లో యట్లే.

గో—రమ్ము. పోవుదము. (తనలో) ఆనిర్భాగ్యని బారినుండి నిన్ను రక్షించితిని. నిన్నుఁ దిరిగి చూడవలయు నని యనుకొంటిని. నీ వెచ్చటికిఁ బోయితివో సుఖముగా నుంటివో మఱి యేయాపదలోనైనఁ జిక్కుకొంటివో- సోదరీమణీ! నిన్ను భగవంతుఁడు రక్షించుఁగాక-

(ఇద్దఱు నిష్క్రమింపఁగఁ బురుషవేషమున సరస్వతి యిద్దఱుభటులతోఁ బ్రవేశించును.)

సర—భటులారా ! నన్నుఁ జంపుదురని సంతసించితిని గాని యిప్పుడింక నెక్కడకుఁ దీసికొని పోవుదురు ?

భటు—చంపుటకే మొదటఁ బ్రధానుఁ డుద్దేశించెను గాని, యెందుకైన మంచిది, మహారాజుగారి యెదుటికే పంపించిన యెడలఁ దసపూచి తగ్గిపోవునుగదా యని యిట్లు చేసినాఁడట.

సర—నన్నే రాష్ట్రమునకుఁ దీసికొనిపోవుదురు ?

మొదటిభటుఁడు—రామపుర రాష్ట్రమునకు.

సర—ఆ రాష్ట్రాధిపతియే నన్నుఁ జంపునా ?

రెండవభటుఁడు—తమ్ముఁడా! ఆతనితో వ్యవహారరహస్యము లేల వెల్లడింతువు ? రాజకార్యము లెంకబింకమైన పట్టులో నుంపవలెనురా పెద్దమ్మ !

సర—నాయనలారా ! నేనేమియు నడుగను లెండు.

మొ॥ భ—ఇంతలో మునిఁగిపోయిన దేమిరా ! రాజకార్యరహస్యములు మనము గుట్టుగనే యుంపవలయునని దేవులాడుదుము కాని, మనచెవిని బడకుండనే యవి సంతపాటి కెక్కును.

సర—పోనిండు. మీకుఁ దగవెందులకు ?

(నేపథ్యమున) మనకుఁ దగవెందులకు ? ఆఁడుదే యను నీయిష్టము- మగవాఁడే యను నీయిష్టము.

మొదటి—ఎవ్వరో యిట్లు వచ్చుచున్నారు.

సర.—(తనలో) మధురికాభ్రమరకు లిచ్చటికి వచ్చుచున్నారు. ఇదివఱకు వీరిద్దఱు నన్నుఁ బరిహాసించి బాధించినారు. ఇప్పుడెందులకో వచ్చుచున్నారు. మధురిక యానిర్భాగ్యుని భటులనుండి తప్పించుకొనినది కాఁబోలు- నేను వారితో మాటలాడను.

(భ్రమరుఁడు మధురికయుఁ బ్రవేశింతురు.)

భ్రమ—(అటు చూచి) మధురికా ! కన్నులు పెట్టుకొని చూడు-ఆతఁడు నాగోవర్ధనుఁడు.

మధు—(చూచి) ఆమె సరస్వతి; నీకుఁ దెలియదు. అయినను నేను నీతో నిందునుగూర్చి తగవు పెట్టుకొనలేదుకదా-అయ్యయ్యో! భటు లామెను బంధించినారే.

భ్రమ—వెఱ్ఱివెఱ్ఱివేసాలు వేసినవానికి గతి యింతేకాదా? (ప్రకా) అమ్మా! గోవర్ధనా! నీవు నాకిచ్చినసంచిని నీయెదుటఁ బడవైచితిని. నీవు తీసికొనకపోవుటచే నది మధురికయొద్దనే యుండెను. దానిని బట్టుకొనిన దొంగల కది యిచ్చి వారిబారినుండి తప్పించుకొనినది. నీవు పురుషరూపమున నాకుఁ గనఁబడి నా సంచి యేదని నీవడిగితివి. నీకే యిచ్చితిని బొమ్మని నిన్ను దుర్భాషలాడితిని. అంతవఱకు నాతప్పు క్షమింపవలయును. నీసంచివిలువను నీకీయవచ్చితిని క్షమింపుము.

మధు—(తనలో) నాకాంతను జయరామసింగు హరించుకొనిపోయినాఁడని నేను నాభర్తతోఁ జెప్పక ఆమె మనబసకు రానున్నదని మాత్రమే చెప్పి యామె యభిమానమును గాపాడితిని. రాణిగారికట్టు కాపాడలేని దాసిదాని బ్రతుకేల? (ప్రకాశముగా) అమ్మా! కాదు. అమ్మా!

సర—(పో, పో యనునట్లుగా నిష్ఠురపు సంజ్ఞచేయును.)

రెండవభటుఁడు—వీరాలెవ్వరో యీ యువతితో మాటాడుటకు వీలు లేదు పొండు.

మధు—మేము వారిభటులము. ఎట్లు మాటలాడకుండఁగలము?

రెం-భ—భటులైననరే—నటులైననరే—వీలులేదు పొండు.

మధు—మేమురాణి మిత్రులమే వచ్చెదము. మాప్రభువును విడిచి మే మెక్కడికిఁ బోవుదుము.

మొ-భ—మేము రామపురరాష్ట్రీయులము బోవువారముకదా, మీరామె మాతో నెంతమాత్రము రాఁగలదు

రెం-భ—సరేగొంతునోయి—ఆమాటయెంచుటకురా?

మధు—(తనలో) ఈమె జయరామసింగుచేఁ బట్టుపడినది కావున నా

తఁడే యీయామెను రామపురమునకు వివాహమునకై తీసికొనిపో వుచున్నాఁడు. కాఁబోలు! అయ్యో! ఎంతగతి పట్టినది. తుద కానిర్భాగ్యపుముండకొడుకే గతి యైనదా?

భ్రమ—గోవర్ధనా! ఇదిగో నీసంచివిలువ. (కాగితపుఁబొట్లము మీఁదఁ బోవును.

సర—(పో, పో, యనునట్లు సన్న చేయును.)

భ్రమ—మధురికా! ఈసామ్మిటఁ బొఱవైచి మనము పోవుదమురా.

మధు—(అప) నాథా! ఆసొమ్మునుగూర్చి యిప్పుడామెను దొందర చేయవలదు. సొమ్మనఁగా నెంత? ఆమె మర్యాదపోయి యే డ్చుచున్నది.

భ్రమ—(అప) నీకు మతి పోయినదా? ఆమె ఆమెయని యింకనదియే మాటయేనా?

మధు—(అప) నాపిచ్చి నాది. ఆమెయేకాని ఆయన కాదు. ఆమె రహస్యము నే నెఱుఁగుదును. ఆపరమాత్ముఁ డెఱుఁగును. ఆమె నాకు రాణి. ఆమె మహాపదలో నున్నది. మేము చి న్నతనమునుండియుఁ గలసి పెరిఁగినవారము. ఇప్పు డామెను వదలుటకంటె మహాపాపము లేదు. ఆమెతో నేను బోవుదు ను. నీవు నన్ను వదలకుండ నాతో రాఁగోరెదను.

భ్రమ—అతని కొలువు నేను వదలుకొంటినిగదా!

మధు—ఆమెయాశ్రయము వదలుకొంటివి కాని నాయాశ్రయము వదలుకొంటివా?

భ్రమ—నీవు నాయొద్దనే యుండరాదా? ఆయనతో నేలపోవలయును?

మధు—నీవు నీరాణిని సేవించుమనుచు మనియును, నీయిష్టమైన య్యెడల నీతో రామపురమున నుండుమనియు నీవు బాసచేసితివి

కాదా? ఇప్పు డిట్లనుట న్యాయమా?

భ్రమ—అంటినికాని యాతఁడు నీరాణి కానప్పుడు సేవ నీ వెవరికిఁ జేసెదవు?

మధు—అట్లనుట తప్పు. నాప్రార్థన విని నాతో నీవీమెను వెంబడింపుము.

భ్రమ—నీవు నేను చెప్పినట్లయిన వినవలయును. కాకున్న నేను నీవు చెప్పినట్లయిన వినవలయును. సరే-నడు-మనకు బసయొద్దమాత్రమేమున్నది? ఇట్లే పోవుదము. (కూడ నడతురు.)

రెం-భ—మీరు మాతో నేల? పొండు.

భ్రమ—మాదారిని మేము పోవుదుము. ఈవీథిని మఱియెవ్వరు నడవనేకూడదాయేమి?

మధు—అయ్యా! మే మెవ్వరితోడను మాటలాడకుండ వచ్చునప్పుడు మీకేమిబాధ యున్నది?

మొ-భ—రండు మఱేమియు భయములేదు.

సర—(తనలో) హా! కళాలలితా! తుదకు నీవర్ణనమైన కాలేమకదా! నేనెంత మందభాగ్యురాలనో! రాజకుటుంబమునఁ బుట్టిననేమి? మహైశ్వర్యమునఁ దులదూఁగిన నేమి? నుదుటిరేఖ సరిగాలేనప్పు డేమివినియోగము? లోకమున నెవతెయదృష్టముదానిదే. బంగారుగనిలో మసిబొగ్గు పుట్టినది. గోదావరిలో స్నానముచేయుచు దాహమో దాహమో యని యేడ్చినదానను నేనొక్కతెనే. నిన్నను బగలు రాత్రికూడ నన్నములేదు. ఇక్కడనే నన్నుఁ జంపుదురేమోయని యాసపడితిని. నాతండ్రియొద్దకుఁ దీసికొనిపోవుదురుకాఁబోలు. కాని యేమికావలసియున్నదో? కళాలలితుఁ డెప్పటికైన నీగ్రామమునకువచ్చును

గాని రామపురమున కెట్లువచ్చును ? నే నాతనిని దిరస్కరించితినని యాతఁడు కోపించెనేమో ! హా కళాలలితా ! నిన్నెప్పుడైనఁ జూతునా? నీవు నాకు లభియింపనియెడల నేను బ్రాణములు విడుతును. నాచిత్రచరిత్ర యేమోకాని యెక్కడకక్కడ కేవిఱుపు ; ఎక్కడకక్కడకే యడుగు. అప్పటవిఱుగెందులకో తెలియదు. ఇప్పట నడుకెందుకో తెలియదు. నాకథ నాకే తెలియకుండనున్న దేమికర్మము ? పెండ్లామని యొకఁడు గౌఁగిలింపఁబోవఁగ మగఁడనని యింకొకతె లాగుటయేమి ? కావలసినమగఁడు కనఁబడకపోవుటయేమి ? పనికిరానిభార్య బాధించుటయేమి? ఈలోన జయరామసింగు బలత్కారమా ? పోనీ మానరక్షణమొనర్చిన యామహానుభావుఁడు కనఁబడరాదా ? ఆతనితోఁ జెప్పుకొని యేడ్చియుందును. ఆతఁడు నన్నుఁ గళాలలితునితోఁ గూర్చునేమో ! కాని యాతనికంతరవము నాదివలెనే యుండుట కేమికారణమో ? నిజముగానున్నదో ? అదికూడ భ్రమమో ? అయినను నాకథ చిక్కువిప్పుట కిదియానాకు దొరకిన సాధనము? ఏడ్చినట్లేయున్నది. అట్లేయుండుటేమి? ఏడ్చుచునే యున్నాను. హా కళాలలితా ! నన్ను బ్రదికింతువా-చంపుదువా ? (ఆపీథని మొదటికొనను స్త్రీవేషమునఁ గళాలలితుఁడు ప్రవేశించును. భటులతోఁ సరస్వతి నిష్క్రమించును.)

కళా—నాకింక బ్రదుకా- చావా- నాభార్య కనఁబడదే ! ఇప్పుడు చేయవలసినదేది ? గోవర్ధనుఁడు పట్టుకొనఁబడినాఁడని తెలిసినది. నాభార్యతక్క గోవర్ధనుఁడెవ్వఁడు ? పట్టుకొనిన గోవర్ధనుని రామపురమున కంపించిరఁట ! చంపుదుమనికదా మొదట ప్రధానుఁడు చెప్పినాఁడు. రామపురమున కంపించుటనుబట్టి పట్టు

బడిన వ్యక్తినిగూర్చి ప్రధానుని కేదోసందేహము తోఁచిన ట్లుంచవలసియున్నది. అనఁగ స్త్రీయో పురుషుఁడో యనుసందేహము దోఁపఁగ మనకెందులకని రామపురము పంపించినాఁడేమో? ఇఁక నెప్పుడు మగవేసము వేయవలదని నాభార్యతో నేను జెప్పియుండగాఁ దిరుగ మగవేసము వేసినదేమో? ఏమో పోనీ- పోయి ప్రధానుని గనుఁగొందమన్న నుదయామునుండి యిప్పటివఱకీమూఁడువేసమున నామెకొఱకు వెదకుటతోడనే సరిపోయినది. మఱిలేక నే నేడ్చుచుండఁగా, నెక్కడకుఁ బోవఁగలను. అదిగాక స్త్రీవేషమున నెట్లుపోఁగలను. నాకిప్పుడేయీ వార్త తెలిసినదిగదా! ఇప్పుడుపోయిన లాభమేమియున్నది? పట్టుబడుటయైనది. పంపుటయైనది. ఇఁకఁ బ్రధానుఁడు నాకుఁ జేయులాభమేమి? అయినను దనప్రభునియాజ్ఞకు వ్యతిరేకముగా నాకతఁడేమిచేయఁగలఁడు. ప్రధానునియొద్దకుఁ బోవలసిన పనిలేదు. నేనే రామపురమునకుఁ బోవుదును. అడ్డుదారి నేల దారియున్నది. అట్లుపోయిన మంచిదనుకొందును. స్వల్పమైన సేనను రామపురమునకుఁ బంపుమని, నాప్రతినిధికి లేఖ వ్రాయుదును. రామపురములో దుర్మార్గుఁడైన యీరాజుండఁగా నా భార్య యిప్పటికి దీసికొనిపోఁబడఁగా నేనిక్కడ నెందులకింకఁ దొక్కులాడుచుండవలయును? కాని నాభార్య యెక్కడనున్నదో యదియే నాయూహ- కాని, పురుషవేషమునఁ బోయిన మంచిదా- స్త్రీవేషమునఁ బోయిన మంచిదా? పురుష రూపమునఁ బోయినయెడలనే యన్నివిధముల మేలు కానియీమూఁడువేసము వేయుమని నాభార్య నాకాజ్ఞయిచ్చినది. కొంతకాల మామెయొద్ద దాసిగానుండుమని చెప్పినది. ఆమె యీనతిచ్చి

నప్పుడు వ్యతిరేకముగానడతునా- నీవు చెప్పినట్లే చేయుదునని నే నామెయెదుట రాత్రియేకదా శపథమొనర్చితిని? ఏమియూ పదలువచ్చిననుసరే- ఎంతనగుబాటైనసరే- స్త్రీవేషమును దీయను- ఈవేషమున నామెదాసినై యామెను గొంతకాలము సేవింపవలయును. ఆమెయాజ్ఞనుబొంది తీసివేయవలయును. అంతేకాని యిప్పుడే తీసివైచుట తగునా? భార్యయిచ్చినయాజ్ఞలను భార్యయెదుట తీర్చుట విశేషముకాదు. భార్యలేనప్పుడు తీర్చినవాఁడే భర్త. అదికాక యీవేసమునువేసి మూఁడుజాములైనఁ గాలేదుకాఁబోలు. వేసినతరువాత నేదోకొంతకలాపము వినిపింపకుండ నిప్పుడే తీసివైతునా? ఏదోకానీ. ఆలస్యమేల? పోయెదను. హా గోవర్ధనా! నీమగపేరేకాని యాఁడుపేరే తెలియదు. పెండ్లాముపేరైనఁ దెలియనిమందభాగ్యుఁడను ప్రపంచమున నే నొక్కఁడనే. హా! గోవర్ధనా! గోవర్ధనా!

(నిష్క్రమించును.)

ఇది సప్తమాంకము.

శ్రీరామా.




# అష్టమాంకము.

ప్రదేశము.— రామపురము.

ప్రవేశము.— స్త్రీవేషమున గోవర్ధనుఁడు.

గో.— ఈకోటలో బసచేసియున్న యీరాజుగారి పినతండ్రికొడుకగు మాధవవర్మకు, గోవర్ధనుని బట్టుకొని చంపునుద్దేశ మేల కలిగెనో, యేమియుఁ దెలియకున్నది. పోనీ! స్త్రీవేషముతోఁ గాని దీనిఁ దీసివైచికొని గాని యాతనిబసకుఁ బోయి యచ్చట నెవ్వరినైనఁ గనుఁగొనుటకు నాకీరాజు ప్రక్క విడుచుట కెంత మాత్రమును వీలు లేకున్నదే. కోటలో నింకఁ బ్రవేశించుచుండఁగానే సరస్వతమ్మ వచ్చినదని దాసులు భటులందఱు కేకలువైచి రాజులోఁ జెప్పఁగ, నాతఁడాపిచ్చికేకలతోనే వచ్చి రెండవపారాగుమ్మములో నాకాళ్ళపైఁ బడి యేడ్చినాఁడు. నేను నీకూఁతును గానని యెట్లు చెప్పఁగలను? చెప్పిన నెవ్వరు నమ్మెదరు? అప్పటినుండి యీనాలుగైదు దినములనుండి యహోరాత్రములు నన్ను విడువకుండ నున్నాఁడు. ఇతనికి నావంటికూఁతునున్న దని యెఱిఁగియుండినయెడల నిక్కడకు రాఁ జేయుచుండును.

(నేపథ్యమున) అమ్మా! సరస్వతమ్మా!

గో—ఆ! నన్ను సరస్వతమ్మ యని పిలువవచ్చునని యొక్క రాజుగారికే నే ననుమతి యిచ్చియుండఁగా మీరందఱట్లేలపిలిచెదరు?

(నేపథ్యమున) అలవాటుచొప్పున నట్లు పిలిచితిని. అదిగాక సరస్వతమ్మా యని పిలువవలసిన దని మారాజుగారు మాకాజ్ఞ యిచ్చి యుండఁగా మా ప్రభువుగారి మాట పాటిసేయకుండ వచ్చునా?

గో—రాజుగారికి మతి కుదుటఁబడనున్నది, కాని నాకు మతిపోవుచున్నది. (ప్రకాశము) సరే, ఎందులకు?

(నేపథ్యమున) రాజుగారు రమ్మనినారు. (మఱియొక రవమున) అమ్మా! సరస్వతమ్మా!

గో—వారెవరు?

(నేపథ్యమున) రాజుగారు రమ్మని మీతోఁజెప్పుమని నన్నుఁగూడఁ బంపినారు.

గో—సరే వచ్చుచున్నాను. పొమ్ము. (తనలో) రోగియింటిలోనుండి వైద్యముచేయు వైద్యుఁడు రోగికంటె ముందు చచ్చును.

(పరిక్రమించును.)

(వెనుకఁ దెరయెత్తఁగ, మంచముమీఁద రాగవర్ధనుఁడు కూరుచుండి ప్రవేశము.)

రాగ—అమ్మా! సరస్వతీ! నేను రావలయుననియనుకొనుచున్నాను. నీవే వచ్చితివా! చూడు. నీవిక్కడ కూరుచుండఁగలిగినంత సేపు కూరుచుండుము. ఎక్కడికైనఁ బనియుండి నీవు పోవలసి వచ్చినప్పుడు నీవు నన్ను నీకూడఁ దీసికొనిపొమ్ము. నేనుమాత్రము నీవులేకుండ నిక్కడనుండను. ఎందుచేతననఁగా నీవు

పైకిఁబోయినప్పుడు నాకడుపులోనుండి యేదియో నీవైపు పోవును. నీవు తిరిగిరాఁగనే యదితిరిగికడుపులోఁజేరును. ఎన్నినాళ్లు నిన్నిదివలకు విడిచియుంటినో జ్ఞప్తిలేదు. చూడు. అక్కడ నెవ్వరైన నున్నారేమో తొంగిచూడు.

గో—(అట్లుచూచి) ఎవ్వరులేరు.

రాగ—అమ్మా! నీతో నెంతయెంతయో చెప్పవలసియున్నది. ఈదినమున మనస్సు నిన్నటికంటె నిర్మలముగా నున్నది. అమ్మా! చూడు. మీసవతితల్లి పరలోకమునకు వెళ్ళిపోయినది. ఇఁక నీకు, నాకుఁగూడ భయములేదు. ఎప్పుడుకూడ రెండవపెండ్లామంత చెడ్డవస్తువు లేదమ్మా - తల్లీ- నేననుభవించినానమ్మా- చూడు. నీవు పెద్దదాననైనతరువాతమాత్రము నావలెరెండవ పెండ్లి చేసికొనకుసుమా.

గో—నాయనగారూ! పొరపాటుమాటలాడుచున్నారు. ఊరకుండుఁడు. (తనలో)ఆహా! "నాయనగారూ" అనుమాట నోరుజారినదేమి చెప్పుమా. నాతల్లిదండ్రులు నాపసితనములోనే పోవుటచేత, "నాయనగారూ" అనిపిలుచుటన్నైన నెఱుఁగనే!

రాగ—ఔను- పొరపాటే- అమ్మా, నిన్ను మీతల్లి యిక్కడఁ గనలేదుసుమా. మీయమ్మను మొదటిపురుడు కోటలోనే పోసినాము. ఆసంతాన మక్కలకు రాకపోవుటచేత నామె రెండవపురిటికి మాతమ్ముఁడు మాధవవర్మయింటికి దాసీమాత్రసహాయగా నామెను బంపినాము. ఆచారము దప్పింపవలయునని, యాతని సొంతధనముచేఁ బురుడుపోయించెను. నీవుపుట్టిన మూఁడవదినమునఁగాఁబోలు మీతల్లి పోయినది. తల్లియనఁగా సవతితల్లియనుకొని, భయపడి తిరుగఁ బారిపోకుసుమా. కన్నతల్లి యె

న్నఁడును సవతితల్లి కాదమ్మా. కాని కన్నతండ్రి సవతితండ్రి యగుటమాత్ర మున్నదిసుమా.

గో—అయ్యో పొరపాటుమాటలాడుచున్నారు.

రాగ—ఇది పొరపాటుకాదు. ఈదినమున వెనుకటిసంగతులన్నియు సద్దముకట్టినట్లున్నవి. కన్నతండ్రినైన నేను నారెండవపెండ్లాముమూలమున, నీకు సవతితండ్రినైతిని. తెలిసినదా? నాభార్య కీ-యన-కీ కా-యన-కా; నిన్ను దయతోఁ జూడలేదు. నీమీఁదఁ గోపపడితిని. నిన్నుఁ దిట్టితిని. నీవు నన్ను క్షమింతువు కద. (ఏడ్చును.) పెద్దవాఁడను. మాతల్లీ నాకు నీవుతక్క నెవ్వరులేరు. రెండుచేతులు బట్టుకొనుచున్నాను. క్షమింపవా. తల్లీ క్షమింపకపోయినయెడల నేను నీయొడిలో పండుకొని అమ్మా అమ్మా అని యేడ్చెదను. అప్పుడు నీవు నన్నెత్తుకొనఁగలవా.

గో—నాయనగారూ! కుదుటఁబడుచున్న మనస్సు చెదరుచున్నది. ఈ మాట లిఁక మానివేయుఁడు.

రాగ—ఏదో నీమాట చెప్పఁబోయితిని. ఆ- ఔను జ్ఞప్తికివచ్చినది. నీవు తొట్టెలోఁ బండుకొని అమ్మా- అమ్మా- యని యేడ్చునప్పుడు నాకడుపు తఱుగుకొనిపోయెడిది. అప్పుడు నిన్ను నీసవతితల్లి వచ్చి యెత్తుకొని యాడించుచుండెడిది. అందఱు సవతితల్లులు మొదట సవతిపిల్లలయందు దయతోడనే ప్రవర్తింతురు. అందఱు సవతిపెండ్లాములు మొదట సవతిమగలయందు దయనే చూపుదురుసుమా. మొదట కొంతకాలమువఱకు బాగుగనే జరిగినది. చూడు. ఎటువచ్చినను నాబావమఱఁది జయరామిగాఁడున్నాఁడే, కొంకనక్కముండకొడుకు. అతఁడు వచ్చి దానిమనసు పాడుచేసినాఁడుసుమా. (అటునిటుచూచి నిమ్మళ

ముగా) ఇక్కడ నెక్కడ నాముండకొడుకు లేఁడుకదా.

గో—(తనలో) వానిని గురంగిని కోటబైటనేయుంచి నేను నాభార్యయు మాత్రిమే వచ్చినాము. (ప్రకాశము) ఇచ్చట లేఁడు.

రాగ—పోనీ-అమ్మా! అందులో సవతి యాఁడుదానిమనస్సు గడిసూరములాగున నెవ్వఁడైన బాధచేయకుండ మాత్రిము చెడదు సుమా. నీవు నీభార్య తమ్ముని మాత్రము గోటలో నుంచనని నామీఁద నొట్టుపెట్టుకో.

గో—అదిగో. ఉ. ఊ.

రా—తప్పాడితివిగాఁబోలు. ఆజయరామిగాఁడున్నాఁడే వాఁడే నామీఁద సవారు. అందఱపైకి సవారు కావలసినరాజు తానే గుఱ్ఱమైనప్పు డింక గడ్డితినుట కాశ్చర్యమేమి? నిన్ను వానినిఁ బెండ్లిచేసుకొనుమని నే ననినందులకు నిదిగో లెంపలు వైచుకొనుచున్నాను. (కొట్టుకొనుచున్నాఁడు.)

గో—ఆఁ. ఆఁ. అది యేమిపని?

రా—నీవు కొట్టుటకు సందేహించినప్పుడు నేను గొట్టుకొనుట తప్పులేదులే. నీవు కూఁతురవు కావున నీవు సందేహించితివి కాని సవతిపెండ్లామునకు స్వతంత్రత యెక్కువచేతఁగాఁబోలు నన్నుఁ గొట్టినదిసుమా- అమ్మా! నీవు నీమగని నెప్పుడు కొట్టఁగూడదుసుమా. మఱేమియులేదు. కొట్టినయెడల మగనికిఁ బిచ్చియెత్తును. అంతే; అన్నప్పుడెల్లను గన్నకూఁతులు వచ్చి పిచ్చిని గుదిర్చి బాగుచేసెదరా. దెబ్బతోఁ బిచ్చి కుదురునందురు.కాని అసత్యముసుమా- దెబ్బకొట్టినకొలఁది బంగారములాగునఁ బిచ్చి సాగిపోవును.

గో—నాయనగారూ! ఊరకుండరాదా!

రాగ—తప్పుమాట లాడినప్పుడుకూడ నన్నాఁపెదవేల (నిష్ఠూరముగా) చూడుము. అక్కడ దాసులెవ్వరు లేరుకాదా.

గో—లేరు.

రాగ—(నిష్ఠూరముగ) అలాగునఁ గాదు. పోయి చూడుము.

గో—(చూచివచ్చి) ఎవ్వరును లేరు.

రాగ—రాజుగారిమాటలను పొంచి వినుటలో నీదాసీముండలంత పండితులు లేరుసుమీ. రాణి కోరుకరాని కోర్కెయైనతరువాత దాసిది రాజుగారి చెవులుపట్టుకొని జోకాయించుట సిద్ధాంతము. తెలిసినదా- ఈమాట జ్ఞప్తిలో నుంచుకొనుము.

గో—అయ్యా! నాకీగొడవయంతయు నెందులకు ?

రాగ—అప్పా! అట్లనవచ్చునా? నాకష్టసుఖములు నీతోఁజెప్పుకొననఁగాని నాకు శాంతియెట్లగును? అదికాక నీవు పెద్దదానవైతివి. మగఁడు పిల్లలని యింక నీకు గొడవ పెరుగనై యున్నది. నీకు లోకజ్ఞానము నావలనఁగాని యెట్లువచ్చును? అదిగాక వైద్యశాలవు కావునఁ బిచ్చి యెందులకుఁగలిగినదో నీవు కనిపట్టవచ్చును. నాకింకఁ బిచ్చి కుదురవలెనని బ్రతుకవలెనని లేదుసుమా. నిజముగా- చూడు- పెండ్లాము పోయినదనరే- పోయినతరువాతమాత్రము సంసారమున కంతవెలితి మఱియొక్కటి లేదుసుమా- భార్యలేనివానికిఁ దనయిల్లె పూటకూటిల్లని నమ్ము. ఈదాసులున్నారే- నాసొమ్ము నాకుఁబెట్టుట కేడ్చుచుందురుసుమా- రాజ్యము తమదైనయట్లు నేను గతిలేక కోటలో గంజికై చేరినట్లు వారియూహ- కాని యేదో చెప్పఁబోయి మఱచితినితల్లీ—

గో—నాయనా! ఇఁకఁ బండుకొనుము. చెప్పినమాటవిను. (తనలో) ఆహా! ఎంతెంత చిన్నవిషయములు బ్రహ్మపదార్థములో. ఎన్నికారణములచే

నీతనికి మతిచెదరెనో. ఆహాహా! రాజులవంటి సుఖవంతులు ప్రపంచమున లేరని, జనుల సాధారణాభిప్రాయము. ఈతనిని జూడ నాకు మిగుల జాలియగుచున్నది. (ప్రకా) నాయనా! ఇఁకఁ బండుకొనుము.

రాగ—ఇఁక నొక ముఖ్యమైనసంగతి చెప్పవచ్చితిని. ఏది యా? అది. ఔను. నీసవతితల్లి యేలాగునఁజచ్చిపోయినదో నీ వెఱుఁగుదువా?

గో—నా కెట్లు తెలియును?

రాగ—నాకును నిశ్చయము తెలియదులే- కాని నాయూహ- ఆజయ రామిగాఁడున్నాఁడే- ఈసడుము నిన్నుఁ దెచ్చి పెండ్లిచేసికొనుట కెక్కడకో పోయినాఁడట. కాళీపురమున కుత్సవములకని అకని పైకివంక—అప్పా! అట్లు కన్నులుమూసికొంటివి నిద్రవచ్చుచున్నదా?

గో—లేదు. (తనలో) జయరామసింగు బలాత్కరింపఁబోయినపుడె - నేను నాబసకుఁ బురుషవేషమునఁ బంపించియుండ [illegible] కాఁబోలు! ఆహా! కన్యారత్నము వచ్చి సంప్రతించినయెడల నెంత బాగుగానుండునో చెప్పుట కవకాశమున్నదా! ఏమి! ఎప్పటనున్నదో తెలియదు. కాని మంచములోనుండి యలికిడైనట్లువస్తువులు గనఁబడినరీతిని నాకీతనిమాటలవలన నాకళ్యాణపురచరిత్రము, కాళీపురచరిత్రమును గొంత గోచరింపుచున్నది.

రాగ—అప్పా! చూడు. ఆజయరామిగాఁడు మనకోటనుండి వెడలి పోవునప్పు డేమిచేసినాఁడనఁగ, నిక్కముగ వచ్చినాఁడు. ఏమిచేసి నాఁడో నేను నిన్నఁగఁ జూడలేదు. పోయినాఁడు. కొంతసేపటికి మీసవతితల్లి చచ్చినది. [illegible] నున్నది సుమా. ఆమాట [illegible], నీ చెంబు

లో మంచినీరున్నదా యని యడిగినది. ఉండవచ్చునని చెప్పితిని. ఆనీరు త్రాగినది. మఱియొకగంటకు వట్టికొయ్య.

గో—అయ్యో! మీరు త్రాగి చావవలయునని జయరాముఁడు విసము కలిపినాఁడుకాఁబోలు.

రాగ—అట్లే యనుకోవలసివచ్చినది. మంచినీటిచేఁ బ్రాణముపోవునెడల సముద్రపుఁ జేఁపలుతప్ప మఱియొకజీవము ప్రపంచమున నుండనేకూడదు. వాఁడే యింతపనిచేసినాఁడు. సాధారణముగా మొదటిభార్యతమ్ముఁడే దొంగ- అందులో సవతిభార్యతమ్ముఁడున్నాఁడే వానియంత నరాంతకదేవాంతకపుముండకొడుకు లేఁడని యూగోడమీఁదను మూఁడుబంతులను లిఖించు—ఉఁ.—కానీ.

గో—నాయనగారూ! అతనినిబట్టి యందఱనుగూడ నట్లనుట తగునా.

రాగ—ఎవరిమట్టునకు వారే ఆలాగనునప్పు డందులో నంద ఱేలచేరకపోవుదురు. పోనీ- మనకెందులకు మనవస్తువు చేయిదాఁటిపోయినది; కాని నాకు నిజమైన నమ్మకమేదో చెప్పనా. నిన్నూరక సాధించి, సాధించి, బాధించుటచేత నే,యామెకట్టిగతికలిగినది. ఆమెతోఁ జేరి నిన్ను నేను నిరాదరణఁ జేసినందులకు నాకు మతిపోయినది. నామతి నీమూలమున దిరుగవచ్చినది. ఆమెప్రాణముకూడ నట్లు నీవలన రావలసినదేకదా. ఏదీ! ఆఘటమిచ్చుట లేకపోయినదికాని, నీవామెను బ్రతికింపఁగలవనియే నానమ్మకము

గో—నాయనగారూ! తప్పుడుమాట లెక్కువగా వచ్చుచున్నవి. నే నొప్పుకొనను. మీరు మాటలాడక పండుకొనుఁడు.

రాగ—అమ్మా! నీకేమియుభయములేదు. నే నింతటఁ జచ్చిపోవుదు నేమోయని నీవాందోళనపడుచున్నావు. మొదటిభార్య మర

ణించుటయే భర్తకుఁ గొంచెము మాయుర్వృద్ధికిఁ గారణము. రెండవభార్యకూడ మరణించినయెడల నీకుఁ గోటలోఁ బాగావేసి నాఁడన్నమాటయే. మొదటిభార్య పోయినప్పుడే కొంతనట్టు గాని, రెండవభార్య పోయినతరువాతమాత్ర మావిసరువిసరు తొమ్మిదివత్సరంబులు జూడవలసినదే. భర్తకు బ్రహ్మయిచ్చినయాయుష్యుమీఁద పోయినభార్యలసంఖ్యలోఁ దలకొక్క పదిసంవత్సరములచొప్పునఁ జేర్పవలసినదే.

గో—నాయనా! ఆమాటలన్నియు మానుము. చాలు ఇఁకఁజాలు.

రాగ—ఇదికూడఁ బొరపాటందువా యేమి? మంచిబుద్ధిమంతురాలవు! చెట్టుకొమ్మలు కొట్టివేయుము. మొద లెంతవృద్ధియగునో- ఈ చేయి యెండిపోయినప్పు డీచేయి బలిసినదా? లేదా? కాళ్లుఁజేతులుగూడ నెండినప్పుడు మొండెము బలిష్ఠమైనదా- లేదా- అమ్మా! నేను దప్పుమాటాడను. కొంచెము తలనొప్పిగా నున్నది కాని, మతిమాత్రము తరవాణిలాగునఁ దేరి స్వచ్ఛముగా నున్నది.

గో—తలనొప్పి యారంభమైనదా? సరి- సరి- ఇఁకఁజాలు- ఇఁక మాటలాడుట పనికిరాదు.

రాగ—వైద్యునిమాట విననలసినదని నేనెఱుఁగనా? కాని యింకనొక్కమాట చెప్పెదను విను. తప్పుమాటలేకుండ జాగ్రత్తగానే మాటాడెదను. నాకు మతికుదిరినతరువాత మూఁడవపెండ్లిచేసికొనవలయునని బుద్ధిపుట్టునేమో?

గో—ఊఁ (అని గద్దించును.)

రాగ—ఊఁ అనకు; పెండ్లి త్రాగుడువంటిదమ్మా. ఎవ్వరైన బలాత్కారమున నాఁపినయెడల నాఁగవలసినదేకాని సాధారణమ్ము

గా న్నాఁగదు. అప్పుడు నేను నిన్నుఁ బ్రార్థించున దేమనఁగా ఇకపై నా రాజ్యము నీకిచ్చెదను. నీవు స్వేచ్ఛగాఁ బరిపాలించు కొనుము. రాజ్యము నాకుండదు కావున, నాకుఁ బిల్లనిచ్చువా రెవ్వ రుండరు. అది సుఖపడును. నీవు సుఖపడుదువు. నేను సుఖపడుదును. ఉభయ భాగాకాకుండఁ దీర్పువిధమా నుంచితిని. బొమ్మ జెముడులో 'త్రిధార' యనునది యున్నది. నీ వెఱుఁగుదువా.

గో—సరి-సరి- ముదురుచున్నది. ఇఁక మాటలాడకుము.

రాగ—ఇఁక మాటలాడఁదలఁచుకొనలేదు కాని, వెనుకటిమాటనుబట్టి మఱియొక్క ముఖ్యమైనమాట జ్ఞప్తికి వచ్చినది. అమ్మా! అమ్మా! అదియొక్కటే చెప్పెదను.

గో—ఇఁకఁ బనికిరాదు.

రాగ.—అమ్మా! అమ్మా! అమ్మా! ఒకటేమాట. అలసత్వమైనయెడల మఱచిపోయెదను.

గో—అట్లయినఁ జెప్పుము. అపైనఁ బనికిరాదు. (తనలో) కొంచెము కృత్రిమనిద్రను గలుగఁజేసెదను. (చేయుచుండును.)

రాగ—నాపినతండ్రికొడుకు కోటలోఁ బ్రవేశించినాఁడు. అతనిస్వభావము మంచిది. నాయందాతఁడు మిగుల భక్తికలవాఁడు. నా కూఁతురు లేచిపోయినదని నాకు మతిపోయినదని యెఱింగినవాఁడై వచ్చినాఁడు. కాని యాతనితో నాసహవాస నీవులేనియెడల నా రాజ్యమునకుఁ బ్రభువుఁడు. నీవిఁక వచ్చితివి కావున నాతనికి రాజ్యములేదు. ఆసంగతి యాతనితోఁ జెప్పి యాతనిఁ బంపివేయవలయును. రాజ్యము మనము స్వాధీనపఱుపకపోయినయెడల బలాత్కారముగా స్వాధీనపఱచుకొనవలయునని యూహాముండి యుండునని కొందఱందురు. కాని నేనామాట నమ్మను. ఇంతకును

చేపటినుండి నీవే యీ రాజ్యమునకుఁ బరిపాలకురాలవు; నేనా యుద్యోగుల నందఱఁ బిలిపింతును. తేపుతప్పకుండ రాజ్యము స్వీకరింపుము. నేనింకఁ బండుకొనెదను. నీవు నాప్రక్కలోఁ గూరుచుండుము. కదలకుసుమా—(నిద్రించును.)

గో—అమ్మ! ఈవెఱ్ఱిరాజునకు మాధవవర్మ పరమయోగ్యుఁడని నమ్మకము- గోవర్ధనుని బట్టుకొనుమని యాదుర్మార్గుఁడిచ్చినయాజ్ఞకిప్పుడు కారణము తెలిసినది. ఈరాజకూఁతురు పురుషరూపమునఁ గోవర్ధననామముతో సంచరించినది. గోవర్ధనా యని సత్రములోఁ గురంగి నన్నెట్లు పిలిచినది? నాభార్య యామెను జూచియే వలచినది. తిరుగ నామె నేనిచ్చిన పురుషరూపమున నున్నది. ఆమెను గోవర్ధనుఁడని పట్టుకొందురేమో! నేను గాళీపురము బయలుదేఱుసరి కట్టిది జరిగినట్లు మాత్రము విని యుండలేదు. తరువాతఁ బట్టుపడినదేమో తెలియదు. ఒకవేళఁ బట్టుపడి ప్రధానుని యొద్దకుఁ దీసికొనిపోఁబడెననియనుకొందము. నేను స్త్రీసమ్మా యని ప్రధానునిభార్యతోఁ జెప్పి మృతిఁ దప్పించుకొనలేదా? ఒకవేళ యిక్కడకే పంపఁబడిన యెడల మఱింత మంచిది. తండ్రికీవార్త నంపి తప్పించుకొనును. ఆమెను జూడవలెనని కుతూహలముగా నున్నది. మగవానిని బోలిన మగవానినే జూడలేదు. మగవానినిఁ బోలిన యాఁడుదెట్లుండెనో చూడవలెను. ఎట్లుండునేమి? నేనున్నట్లే యున్నది కాఁబోలు- ఆమె వచ్చిన తరువాత నేను మాయమై పోయెదను. మాయవ్వగారితోఁ జెప్పి రాలేదు. అమ్మా- సరస్వతమ్మా- ఎందఱు కెన్నిభ్రమలు కల్పించితి

పద్మ:- నీమూలమున మాకు భ్రమలే కాని నీకు శ్రమ లెన్ని కలిగెనో- తుట్టతుద కీమాధవవర్మచేఁ బట్టువడి యేమి బాధ నొందుదువో!

( తెర పడును. )

ఇది అష్టమాంకము.



శ్రీరామా.




# నవమాంకము.

ప్రదేశము—రామపురపుఁగోటలో మాధవవర్మ బస.

ప్రవేశము—మాధవవర్మ.

మాధ—నాయాజ్ఞ యొకటియుఁ దనచేఁత యొకటియునా! చెప్పినయక్షరములప్రకార మాచరింపలేని యీ తెలివితక్కువ ప్రధానుఁడు నాకెందులకు? పరీక్షించితిననియు, గోవర్ధనుఁడు కాఁడేమోయని సంశయముగా నున్నదనియును వ్రాసినాఁడు. పరీక్షఁజేసి చంపుమంటినిగాని సందేహముగా నున్నయెడల నిక్కడకుఁ బంపుమంటినా? ఇది నా యూరా? నాకోటయా? ఇక్కడ నితనిఁ జంపుట, యెల్లరికిఁ గారణమగును గాదా? తా నేమనుకొనినాఁడో? మనకోటలో మన మెన్నిహత్యలు చేసినను గ్రిప్ముదలగా నుండును. ఎవని సంసారపుగుట్టు వానిది. ఇంతవఱకు వచ్చిన తరువాతఁ జంపక తప్పునా? దగ్గఱనుండి చంపింపవలయును. అప్పుడుగాని మనస్సునకు సంతుష్టిగా నుండదు. సరే- అతనితో ముందు మాటలాడవలసియున్నది. కాని భూకంపమేమి? పాతాళగుహాద్వారము పగులుటయేమి? వారు పాఱిపోవుటయేమి? వింతగా నున్నది. ఎం

తవెదకినను గానఁబడకపోవుట యేమి? అదేదో చూచుకొన వచ్చును. ముందు గోవర్ధనుని జూడవలయును.

(మాధవర్మ పరిక్రమించుచు నిష్క్రమింపఁగ, వెనుకఁ దెర యెత్తఁబడును. ప్రవేశము:-పురుషవేషమున సరస్వతి.)

సర—ఇది నాతండ్రి కోట. ఇది కోటలో వేఱుగా నున్న పుస్తకభండారము. ఇచ్చట నేను మొన్న మొన్నటివఱకుఁ జదువుకొను చుండెడిదానను. ఇందు బసచేసినరాజు నన్నుఁ దప్పక ఖండించునని మొదటిభటుఁడు దారిలోఁ జెప్పినాఁడు. అంతయదృష్ట మెన్నఁడైనఁ బట్టునా! నాకోటలో, నేనాడుకొనినస్థలములోఁ దండ్రిగారేజబ్బుతోడనో యింక బాగుగ నుండఁగా నీమట్టిలో నామట్టి కలిసిపోవుట యదృష్టముకాదా? భ్రమరుని మధురికను గోటలోనికి భటులు రానీయలేదు. వారు రాకపోవుట నాకు నిష్టమే. ఇక్కడకు మాతండ్రిగారి భటులుకూడ నేనో సామానులు తీసికొనివచ్చుచుఁ బోవుచున్నారఁట! ఏభటునిచేనైన, మాతండ్రిగారికి వార్త నంపినయెడల నాకీకష్టము వదలిపోవును; నేనట్లు చేయను. ఇంతకంటెఁ జచ్చుటకు మంచిస్థలములేదు. మంచియదనులేదు. మొదట సముద్రములోపలనే చావవలసినది. అట్లు జరుగకుండఁ గళాలలితుఁ డడ్డుపడినాఁడు. అట్టి యామహానుభావుని, నేను వదలకుండ నుండవలసినది. వదలితిని. బుద్ధిపూర్వకముగఁ జెడిపోయితిని. ఇఁకఁ గళాలలితుని దర్శనము నాకీజన్మమునకు లేదు. అందుచే మరణింపవలసినదే. చంపునప్పుడు నేను గట్టిగా నేడువనైన నేడువను. నా యేడ్పు వినఁబడి మాతండ్రి వచ్చి రక్షించునేమో! నాకుఁ బ్రపంచమున మూఁడే హితపదార్థము లున్నవి. తండ్రి, కళా

లలితుఁడు, నామానరక్షకుఁడు- మొదటియాతఁడు దేహప్రదాత- రెండవయాతఁడు ప్రాణరక్షకుఁడు- మూఁడవయాతఁడు మానరక్షకుఁడు- వీరిఋణమును నేను దీర్చుకొనఁజాలను. చావనఁగ నేమో కొందఱుజడిసి యేడ్తురుకాని, నాకేమియుఁ గష్టముగాఁ గాని భయముగాఁ గాని కానఁబడదు. భగవానుఁడా! నిన్నుఁ ద్రికరణశుద్ధిగాఁ నమ్మినదానను. నన్ను వేగముగ నీలోఁ జేర్చుకొనుము. ఓ పరాత్పరుఁడా! (లేచి చేతులు జోడించుకొని యుండును.)

(మాధవవర్మ ప్రవేశించును.)

మాధ—నాయనా! గోవర్ధనా! వచ్చితివా? దీర్ఘాయుష్మంతుఁడవై యుండుము.

సర—(తనలో) ఈతనికి నమస్కరించితి నని యనుకొని కాఁబోలు నన్నాశీర్వదించుచున్నాఁడు.

మాధ—నాయనా! కూరుచుండుము. నీవు వచ్చితివి, పరమానందముగా నున్నది. నిన్నుఁ జిన్నతనములోఁ జూచితిని, ఈనడుమ నీవెచ్చట నుంటివో తెలియలేదుసుమా! నాప్రాణములన్నియు నీమీఁదనే యున్నవి. నిన్నెప్పుడు జూతునా యని యనుకొనుచున్నాను. కాని తండ్రీ! నీచదువు పూర్తియైన దనియు నీవు యాత్రాచరణదీక్షుఁడవై యున్నావనియు వింటిని. నిజమేనా?

సర—నిజము కాదు.

మాధ—నాయనా! నీవు కళ్యాణపురమునఁ గొంతకాలముండి చదువుకొంటివి కాదా?

సర—లేదు.

మాధ—నిన్నుఁ బెంచుచున్న ముసలియామె బాగుగా నున్నదా?

సర—ఆమె యెవ్వతెయో నే నెఱుఁగను.

మాధ—పోనీ నాతండ్రీ! నీపేరు గోవర్ధనుఁడేనా?

సర—ఔను.

మాధ—(తనలో) ఇతని మాటలనుబట్టి యితఁడు గోవర్ధనుఁడు కాఁడని నాకుఁ దోఁచుచున్నది. మాప్రధానుఁడుగూడ నీప్రశ్నములే యాతని నడిగియుండును. మాకీనడుమను గోవర్ధనుని గూర్చి తెలిసిన సమాచార మిదియే. ఇతఁడు గోవర్ధనుఁడుకాఁడేమో? అయియుండియు నసత్యమాడుచున్నాఁడేమో? పేరు గోవర్ధనుఁ డన్నంతవఱకు నిశ్చయము కదా! ఇఁకఁ జంపుటకు సందేహమేమి? శత్రువును జంపుటకు నిశ్చయజ్ఞానమే యక్కఱలేదు. సందేహమైనను జాలు. (ప్రకాశముగా) నాయనా! నీకెవ్వరైనఁ బిల్లలున్నారా?

సర—పెండ్లియే యింక లేదు.

మాధ—(తనలో) పోనీ. ఈవ్రేటుతో నీకొమ్మ నాశనమే. బ్రదికితిని. (ప్రకా) నాయనా! నాకుఁ బిల్లలులేరు. నాకాళీపురరాజ్యమునకు నిన్నుఁ బ్రభువుగాఁ జేసెదను. నాకు దత్తపుత్త్రుఁడవై యుందువా?

సర—నాకు నీరాజ్య మక్కఱలేదు.

మాధ—నాయనా! చిన్నతనములో నీకీవిరాగత యేల? అయిన నాలోచించుకొనుము. సరే—నీవిటనుండుము. నేనిప్పుడే వత్తును.

(ముందునకుఁ బరిక్రమింపఁగ, వెనుక తెరపడును.)

మాధ—(చప్పటలు గొట్టును.)

(ఇద్దఱు భటులు ప్రవేశింతురు.)

1 భటు—ఏలపిలిచినారు ?

మాధ—మీరు మాసొమ్ముతినువారేనా ?

1 భటు—ఏమిమహాప్రభూ ! అట్లు సెలవిచ్చుచున్నారేల ?

మాధ—ప్రశ్నకుఁ బ్రశ్నయేల ? అడిగినదానికుత్తరమిమ్ము.

1 భటు—మేము మీభటులము, మీరుమాకు పోషకులు.

మాధ—మీరు మాసొమ్మువలనఁ బ్రదుకవలసినది. మీసేవవలన నేను జావవలసినదియా ?

2 భటు—మహాప్రభూ ! మావలన నేమి నేరము జరిగినదో మేమెఱుఁగము. క్షమింపవలెను.

1 భటు—బాబూ ! సెలవైనయెడల నగ్గిలో దుముకుమన్న దుమికెదము.

మాధ—నాప్రాణముపోయిన తరువాత మీరు భస్మమైన నాకేమి ? లోకమంతయు భస్మమైన నాకేమి ?

1 భటు—తమ కిప్పుడుగలిగిన యపాయమేదో మహాప్రభూ ! మాకేమియుఁ దెలియలేదు.

మాధ—నేను నాదాయాదికోటలో బసచేసియుండుట నాకపాయము కాదా ? బంధుమర్యాదకొఱకు నేనురాఁగఁ దనరాజ్యముకొఱకువచ్చినానని నాబంధుపనుకొనుటయుటింతయపాయము కాదా? నేనిచ్చట నిట్టి యపాయస్థితిలోనుండఁగ మీరు నాక్షేమమును సహస్రనేత్రములఁగని పట్టవలసినవారేకదా.

2 భటు—అభ్యంతరమేమి ! అట్లు మేముచేయుచునేయున్నాముకాదా?

మాధ—చేయుచున్నామని యేమొగము పెట్టుకొని చెప్పుదువు. నా ప్రాణరక్షణము మీరుచేయుచుండినయెడల రామపురరాజుకు

మాయన్న గారివలనఁ బంపఁబడిన యాతఁడు నన్నుఁ జంపుట కీరాత్రి యేల వచ్చియుండును ? మీరు పంపకుండ నాతఁడు లోనికి రాఁగలఁడా?

2 భటు—మీప్రధానుఁడుగారివలనఁ బంపఁబడిన యొక చిన్నవానిని మాత్రము మేము లోనికిఁబంపితిమి.

మాధ—ప్రధానుఁడుకాఁడు. వల్లకాఁడుకాదు. లోపలికి వచ్చుట కది యొకవంక. ఇక్కడ నాకు మనుష్యులులేరా ? ప్రధానుఁడేల పంపవలయును ? ఆచిన్నవానిని దెచ్చినభటులను మీరు గుర్తెఱుఁగుదురా ?

2 భటు—నీవు చూచితివఁటరా !

1 భటు—నేను దిన్నగఁ జూడలేదు.

మాధ—మీరెఱుఁగరు. వారీ యూరివారైనప్పుడు మీరెల్లెఱుఁగుదురు ? (తనలో) వారిని వెంటనే కాళీపురము పంపినాను.

1 భటు—ఆలాగా బాబూ !

మాధ—ఆచిన్నవాఁడు—ఆరాజకుమారుఁడు—ప్రధానుఁడుపంపిన నా ప్రాణమిత్రుఁడు—బాకుతీసికొని నన్ను నిద్రలోఁ, బొడువఁ బోయినాఁడు.

2 భటు—దెబ్బతగులలేదుకదా బాబూ !

మాధ—దెబ్బతగిలినయెడల నాకు దండధరభటసాహాయ్యముకాకయీ ధర్మపిండ భటసాహాయ్యమేల ?

1 భటు—మాకు మీరుచెప్పినమాట తెలియలేదు. కాని మహాప్రభూ! గొప్పగండము మీకు దాఁటినందులకు సంతోషముగానున్నది.

మాధ—ఆచిన్నవాఁడు తొందరలో బాకుతో నొఱ తీయకుండనే పొడిచినాఁడు. లేచి పట్టుకొని యాగదిలోనుంచితిని. ఆతనిని నేను

జూడను. మీరుచూచి నాలుగు చీవాట్లు వేసి వదలిపెట్టుఁడు.

2 భటు—వదలిపెట్టుమందురేమి? మహాప్రభూ! రాజహత్య సంక ల్పించినవానిని విడిచిపెట్టుదురా?

1 భటు—నాయనా! ఇంతధర్మప్రభువులైన యెడల నేలాగుబాబూ!

మాధ—మా యన్నగారిచేఁ బంపఁబడినాఁడు. ఆయన కోటలో మన మున్నాము. ఆయన భటునిట్లు శిక్షించుట యప్రతిష్ఠ కాదా!

2 భటు—మీయన్నగారికి మిమ్ముఁ జంపుట ప్రతిష్ఠయైనప్పుడు మీకిది యప్రతిష్ఠ కాదు లెండు.

మాధ—ఏమిరా? నన్నేమి చేయుమనినారురా? దిక్కుమాలిన రాజ త్వమైపోయెను. తెల్లవాఱినది మొదలుకొని వారిని శిక్షించి, వీరిని శిక్షించి—ఛీ! ఛీ! సామాన్యకుటుంబములోఁ బుట్టినయె డల నాకీఘోరకృత్యక్షోభము లేకుండును. నాకర్మము.

1 భటు—మీరేమియు ననకుఁడు. మే మాతనిని జిత్రవధము చేసె దము.

మాధ—అల్లరిరా- పనిలేనియల్లరిరా- అదిగాక మీరన్నమాటవలన నా కొడలు జలదరించుచున్నదిరా.

2 భటు—చచ్చుటకంటె జలదరించుట మంచిది కాదా నాయనా? అల్లరి లేదు- అట్టె శబ్దమైనలేదు. నల్లిని నలిపినట్లు—

మాధ—అబ్బ! అబ్బ! అనహ్యామురా! ఇక్కడ నన్నగారికిఁ దెలిసిపో వునేమో యనికూడ నంతఁ బరితపించువాఁడనుగాను. అదిగో! అక్కడరా.

1 భటు—ఇక్కడ నెవ్వరికిఁ దెలియదు బాబూ! అక్కడిమాట తరు వాతఁ జూచుకొందము.

మాధ—రాజవిశ్వాసముచేత మీ రంతపట్టుగాఁ జెప్పుచున్నప్పుడు నే నొప్పుకొనకతీఱినట్లు కనఁబడుచున్నది. నాచెవిని వైవకుండ, మీరు తలఁచుకొనినపని యేదో చేయరాదఁటరా?

2 భటు—చిత్తముబాబూ! అంతేచాలు. దండాలు. పువ్వుత్రుంపి నట్లు—దీప మార్పినట్లు—తేగమోటిక లాగినట్లు.

మాధ—తీరఁ జెవిని వైచితిరి కాదా? చేయుపనిలో నేమైన బుద్ధిహీన తగా నాచరించిన యెడల—ఆయపయశస్సు నాకే కాదా? విన కతప్పునా? ఏది యేలాగునఁ జేయఁదలఁచుకొనినారో, రవంత యేఱుపుఁడు.

1 భటు—కత్తితోఁ దల నఱుకుదును. ఆ!

మాధ—కత్తితోఁ దల తెగును- తెగకపోవును. క్రింద రక్తము—వానివస్త్రములమీఁద, నీవస్త్రములమీఁద రక్తము—ఇవియన్నియు నిదర్శనములు గావఁటరా!

2 భటు—భోజనము చేసి విస్తరి యవలఁ బాఱవైచి యలికినట్లుండవలెను బాబూ! కడుపునిండుతప్పఁ బైకేమియు నగపడఁగూడదు బాబూ! గొంతు గట్టిగాఁ బిసికి చంపి—

మాధ—అబ్బా! అబ్బా! గుండెలు కొట్టుకొనుచున్నవిరా. ఊఁ. ఆమాట నోట ననలేనురా. కాసి-ఏదీ? ఆపైని?

2 భటు—అంతేబాబూ! చంపినతరువాత నింకేమున్నది బాబూ! ఒక్కగంటతరువాత నైనను బ్రాణము పోకతప్పదండి.

మాధ—ప్రాణముకొఱ కెవ్వఁ డేడ్చుచున్నాఁడురా! ఈదిక్కుమాలిన శరీరముకొఱకే కాదా యీతాపత్రియమంతయును?

2 భటు—కళేబరమును తాలుగట్టి నూతిలోఁ బాఱవైచెదము.

మాధ—చప్పుడురా! నడిరేయివేళ మఱింత చప్పుడురా! పొండి ఏదో

యేడ్వఁడు. నాకెందులకీబాధ-మీావిశ్వాసముకొలఁది మీారేమి యేడ్చిననునరే. నేమానుమన్న మానుదురా? మొండికుండ కొడుకులు ! ఈపనియైన యుత్తరక్షణమున మీాకు కాశీపుర మునకుఁ బోవలయును. అక్కడ నేదో యలికిడియగుచున్నది. చూడుఁడు. (నేపథ్యమున) అయ్యా !

మాధ—వేగ మీాపక్కనుండి పొండు. నిద్రించుచుండఁగాఁ జేసిన మెడల మంచిది. రవంత నిదానించి మఱి చేయుఁడు.

1-2 భటులు—చిత్తము. (పోవుదురు.)

మాధ—ఎవఁడురా? ఇటురా.

(భటుఁడు ప్రవేశించును.)

భటు—దండాలు బాబూ !

మాధ—ఎందులకు వచ్చితివి !

భటు—ఒకయాఁడుది వచ్చియున్నది- మీాదర్శనము నపేక్షించుచు న్నది.

మాధ—ఆఁడుదియా! నీవు బాగుగాఁ జూచినావా ?

భటు—ఆఁడుదనుట కెంతచూడవలెను బాబూ!

మాధ—ఋషివలెఁ గాలక్షేపము చేయు నావంటివానియొద్ద కాఁడది యెందులకురా ?

భటు—మనకేమియుఁ దెలియదు బాబూ!

మాధ—మనకేమిటిరా నీమొగము! బాగుగా నున్నదా? పెద్దమ్మగారి దాసివలె నున్నదా ?

భటు—కమ్మనివాసన గొట్టుచు మినుపసున్నియుండవలెనున్నది.

మాధ—మినుపసున్నియుండ నీవెఱుఁగుదువఁటరా ?

భటు—మాగురువుగారి కూఁతురు సమర్తాడినప్పుడు పెట్టినారు బాబూ!

మాధ—ఏమిరా యీకర్మము ? పొమ్మని చెప్పరా.

భటు—చిత్తము. (పోఁబోవును.)

మాధ—ఉండు. ఉండు.

భటు—(ఆఁగును.)

మాధ—దర్శనమునకు వచ్చినతరువాత నిరాకరించుట బాగుగా నుం
డదేమో- రమ్మని చెప్పు. ఒక్కనిముసమైన నామనస్సునకు
శాంతి నుండనీయరురా.

భటు—(పోవును.)

(స్త్రీవేషమునఁ గళాలలితుఁడు ప్రవేశించును.)

కళా—అయ్యో! రామ్ రామ్. గోవర్ధనుఁ డిచ్చటకు వచ్చినాఁడా?

మాధ—ఎవరు ? గోవర్ధనుఁడా ? కానీ—నీవెవతెవు ?

కళా—అతని దాసిని.

మాధ—ఆఁడుదానికి దాసికాని మగవానికి దాసి యెందులకు ?

కళా—ఆఁడుదానికి దాసితనమునకు మగవానికిఁ బ్రిక్కయుంగునకు.

మాధ—అతని కింకఁ బెండ్లి లేదాయేమి ?

కళా—పెండ్లి యగునెడల నెప్పటికైనను నాతోడనే.

మాధ—నిన్నిప్పటి కుంచుకొనెనా యేమి? చక్రవర్తియైన నుంచుకొ
నఁదగినదానవువలె నున్నావు. కాని మొదటివేడుక తీఱిపోయి
నతరువాత నిన్నాతఁడు పెండ్లిచేసికొనఁడేమో! అయినను నీ
వేల వచ్చితివి ?

కళా—నాప్రభువును జూచుటకు.

మాధ—నీప్రభుఁ డిక్కడ నుండెనని నీకెట్లు తెలియును ?

కళా—సాకంటె నొక్కగంటముం దాతఁడు కోటలోఁ బ్రవేశించినాఁ
డు. నేను గొంచెము వెనుక నుండవలసివచ్చినది. ఎక్కడ

నున్నాఁడో శీఘ్రముగఁ జూపి పుణ్యము కట్టుకొనుఁడు.

మాధ—చూపెదను గాని, నాకేమి యిచ్చెదవు ?

కళా—నీకేమికావలయునో అదియే.

మాధ—అటులైనఁ జెప్పెదను. ఒక్కముద్దు.

కళా—అభ్యంతరమేమి ? ఇదిగో ! ఊఁ ఉ. (జుట్టు వంచి యొకగుద్దు గుద్దును.)

మాధ—అబ్బ! అబ్బ! (నడుము పట్టుకొని) గుద్దితివేమి ?

కళా—ఇంతటితో సరిపెట్టినందులకు సంతసింపుము. గోవర్ధనుఁ డెట నున్నాఁడో చెప్పెదవా ? డొక్క చీల్పనా ?

మాధ—ఎవఁడురా? అక్కడ ?

కళా—నీయింటి నాశ్రయించిన భటుల నందఱ కరదండములు వేయించితిని. వారు నీకుఁ దోడ్పడరు. నాభటులను బిలువనా? ఎవఁడురా? అక్కడ ?

(ఒక్కభటుఁ డరదండములు పట్టుకొని ప్రవేశించును.)

భటుఁడా ! నీవీరాజుచేతి కరదండములు తగిలింపుము.

మాధ—అ-అ-

భటు—(అట్లు చేసి) మహాప్రభూ ! ఈతని నేమిచేయుమని సెలవు ?

కళా—ఎక్కడ నున్నాఁడో చెప్పవేమి ? (కొట్టును.)

మాధ—హా! హా! హా! హా!

(నేపథ్యమున) హా! హా! హా! కళాలలితా !

కళా—ప్రాణప్రియా ! వచ్చుచున్నాను. ఆధ్వని యేవైపునుండికదా వచ్చినది ? భటుఁడా ! నీవీతనిఁ గొట్టులో నుంచి భద్రముగా నుండుము. పో !

(భటుఁడు మాధవవర్మతోఁ బోవును.)

అటుకాదు. ఇటు. హా! ప్రాణప్రియా!

(పరిక్రమింపఁగ వెంటనే తెర యెత్తఁబడును. భటులు సరస్వతిగొంతు నులుముదురు. ఒకఁడు చేతులు గట్టిగఁ బట్టుకొనును.)

హా! ప్రాణకాంతా! ఆ! ఆ! (గట్టిగఁ గేకలువైవఁగ భటులు పాఱిపోవుదురు.)

కళా—(సరస్వతిని బట్టుకొని యొడిలోఁ బరుండఁబెట్టుకొని విసరును.) నేను జడిసినట్లే యయినది. దైవకటాక్షమునఁ బ్రాణ మింక నున్నది. అయ్యయ్యో! మెడపై నాక్రూరులవేళ్లెట్లొత్తుకొనినవో! ముచ్చెమట లెట్లుపోసినవో! కన్నుల వెలుపలికొలుకులనుండి పెద్దబాష్పబిందువులు రెండు జాఱినవి. (తుడిచి విసరును.) ఊఁపిరి యిప్పుడు బాగుగా నాడుచున్నది. ఈచోక్కా మెడగుండి వదలు చేయుదునా? ఎఱుఁగనియవస్థలో నంతవఱకు సాహసించుట తప్పేమో? ఆహా! కన్నులు తెఱచుచున్నది. హా! ప్రాణప్రియా! ప్రాణప్రియా! అట్లె చూచి వెంటనే కన్నులు మూసికొనినది. హా! ప్రాణప్రియా!

సర—(తనలో) ఈమె నన్ను వదలకుండ నావెంటనే యిటకు వచ్చి తనవలె నాఁడుదాననైన నన్నిట్లు బాధించుచున్నదా? హా! ఈ మనువుబాధ నాకు మన్నగువఱకుఁ దీఱదాయేమి? (ప్రకాశముగా) హా! కళాలలితా? నాప్రాణము పోవుచున్నప్పుడైన నన్నుఁ బ్రాణప్రియా యని పిలుచుట మానవా? అవసానసమయమునఁ బ్రాణప్రియా యనుటకంటె 'భవానీప్రియా!' యనుమాట నాచెవిని వైచుట మంచిది కాదా?

కళా—నీకేమియు భయములేదు. నీవు బ్రదికితివి. అందువలన నేను బ్రతికితి. నేను నీప్రాణప్రియుఁడను గావున నిన్నిట్లు పిలిచితిని.

సర.—(తనలో) కళాలలితకాదు. కళాలలితుఁడే. ఆహా! ఇతఁడు స్త్రీ వేషమున నుండుటచే భ్రమఁ జెందితిని. ఔను. ప్రత్యక్షముగఁ గళాలలితుఁడే! ఇప్పుడే బ్రదికితిని. ఆఁడుదానికి హృదయమునఁ బ్రాణము నిలుచుట బ్రదుకు కాదు. ప్రాణప్రియుఁ డెదుట నిలుచుట బ్రదుకు. ఇఁకనేమి? కావలసినంతశక్తి వచ్చినది. (లేచును.)

కళా.—కన్నులు తిరుగునేమో, జాగ్రత్త. ఇప్పుడు నీవు సుఖముగా నున్నావా?

సర.—(తనలో) నాకొడలెఱుఁగని యవస్థ కావున, నాభర్త నన్నుఁ గౌఁగిలించినాఁడు. ఈతనిని నేనట్లు తిరుగఁ గౌఁగిలించుట తగునా? కౌఁగిలింపక యూరకుండఁగలనా? ఈతఁ డింక నుపేక్షించుట యెందులకో? కన్నులు తిరుగునేమో యన్నవాఁడు కౌఁగిలించుకొనఁగూడదు కాఁబోలు. (ప్రకా) ప్రాణేశ్వరా! ఇది యేమి?

కళా.—నావలనఁ దప్పే జరిగినది. అవశుడనై జగన్నాథపురమున నిన్నుఁ గౌఁగిలించినందులకు, నీవు పాఱిపోయితివి. ఆతప్పును క్షమింపుమనియు నిన్నెప్పుడు నీయిష్టము లేనిదే కౌఁగిలింపననియుఁ గాళీపురమున రాత్రి స్త్రీరూపమున నున్ననిన్ను నేను గలసినప్పుడు శపథ మొనర్చితిని. దానికి వ్యతిరేకముగా నిన్నింతకుముందే గౌఁగిలించితిని. ఒడలు తెలియక జ్ఞప్తిలేక సగముప్రాణ మెగిరిపోవ నట్లొనర్చితిని. ఎటులైనఁ దప్పుచేసితిని. క్షమింపుము.

సర.—ఏమీ? కాళీపురమున నిన్ను నేను గలసితినా? నీవు నాతో శపథ మొనర్చితివా? ఎవతెను గలసితివో! జ్ఞప్తిచేసికొనుము.

కళా—ప్రాణప్రియా! నీమనస్సింకఁ గుదుటఁ బడలేదు. కొంతసేపటికి నీకే యంతయుఁ జ్ఞప్తికి వచ్చును.

సర—అసత్యము. అసత్యము. జగన్నాథపురమున నిన్ను వదలినతరువాత నీరామపురమునఁ దక్క మఱి యెచ్చటను నిన్నుఁ గలసికొనలేదు.

కళా—ప్రాణకాంతా! అట్లు సెలవిచ్చుట న్యాయమా? పోనీ! అప్పుడు జరిగినదే మఱియొక్కమాట జ్ఞప్తికిఁ దెచ్చెదను. గోవర్ధనుని బట్టికొనుమని ప్రధానుని యాజ్ఞ యయినది. దైవవశమున నీవు స్త్రీరూపమున నుంటివి. మహాసంతోషము. 'తిరుగఁ బురుషరూపమును ధరింపకుసుమా! ఏమిప్రమాదము వచ్చునో!' అని నేను నీతోఁ జెప్పలేదా? తిరుగఁ బురుషరూపమును ధరించుటచేతనేకదా యింతమునిఁగినది!

సర—ప్రాణనాథా! మతి నాకుఁ గుదుటఁబడలేదని యంటివి. నీకు మతియే లేనట్లున్నదేమి? నీవు నాతో నీమాటలు చెప్పితివా? మఱల నిన్నుఁ జూడనే లేనప్పుడు మాటలాడుట యెట్లు? బహుచిత్రముగా నున్నది. ఇదివఱ కనేకభ్రమము లొందితిని కాని వానికంటె నిది మఱింత సొగసుగ నున్నది.

కళా—నీవట్లనఁగ నేనేమి చేయవలయును. నిన్నుఁ జూచితిని. నీతో మాటలాడితిని.

సర—అవి యేవో వెనుక జరుగనిమాటల కేమికాని, ప్రస్తుతము నీకీ స్త్రీవేష మేమి?

కళా—నన్ను నీదాసిగా నుండుటకై స్త్రీవేషమును ధరింపుమని నీవు చెప్పుటచేతనే కదా యిట్లయితిని?

సర—కళాలలితా! నీకేమి స్వప్నమా? ఏదైన నావహించెనా? ఎవ

రైన మందు పెట్టితా? నీవు నాకు దాసిగా నుండుమని నేనంటినా? హరహరా! నేనట్టివాఁడను గానని యెఱుఁగుదువు కదా! ఆమాటవలననైన నిన్నుఁ గలసిన దేవతయో నావేషమును వైచిన దొంగయని గ్రహించుకొనలేకపోయితివా?

కళా—అయ్యో! అయ్యో! నీవట్లనుచుండ నే నింకఁ జేయవలసిన దేది?

సర—నాకును గొన్నిభ్రమ లిదివఱకుఁ గలిగియున్నవి. అందులకుఁ గారణ మేదో నేనూహింపలేకున్నాను. నావంటివాఁడో నావంటిదో యొక్కపిశాచమో కామినియో మనవెంటఁ దిరుగుచున్నది. ఇది నీతప్పుగా నేను భావింపలేదు. నీవు సందేహింపకుము. అది యేదో తెలియవలసివచ్చినప్పుడు తెలియును. కాని యానిర్భాగ్యుఁ డేమైనాఁడు?

కళా—బద్ధుఁడైనాఁడు.

సర—తిరుగ నాకుఁ బ్రాణమిచ్చిన పుణ్యాత్ముఁడు నాభర్తయేనా? ఇఁకఁ గౌఁగిలింపనని నీవెవతెతోడనో చేసిన శపథమును గొట్టివైచుటకు దానికే కాని నాకనికారము లేనందున నిన్ను నేను—
(కౌఁగిలించును.)

కళా—హా! ప్రాణప్రియా! ఈజన్మమునకీ సౌఖ్యమే చాలును. ఇంతటితో మనకు జన్మరాహిత్యమే సుమా!

గీ. మనుజునకు జన్మరాహిత్య ♦ మనున దొకటి
కలుగుటయె సత్యమైనచోఁ ♦ గాంత! వినుమ,
అట్టి నిష్ఫలాపేక్షమా♦నట్టి ప్రేమ
తత్త్వమహిమనె కలుగంగఁ♦దగును జుమ్ము.
ప్రేమలతఁ గోయుమని మన♦పెద్ద లనిరి
నాకు పమియింపు మామాట ♦ నచ్చలేదు

జన్మరాహిత్యపరమశా శ్వతసుఖంబు
భవ్యతమరాగలతికోద్భ వంబు గాదె?
దంపతుల ప్రేమవంటి దీ ధరణి లేదు
వారికే ముక్తి విభవ మె ప్పటికినైన
నట్టిబ్రహ్మచారికి మోక్ష పదవి సున్న
జ్ఞానియగువాని కద్ది సం శయము సుమ్ము.

(సరస్వతి నవ్వును.)

ప్రాణకాంతా! నవ్వేదవేల? ఇట్టిశృంగారసమయమునఁ బుష్పహారములు, చుంబనములు, వనవిహారములు ప్రశంసనీయములు గాని బ్రహ్మచారులు జ్ఞానులను గూర్చి యేల ముచ్చటించుచున్నాఁ డని నవ్వితివా?

సర—అబ్బే! అందులకుఁ గాదు. అట్టివి నాకు నక్కఱలేదు.

కళా—కాకపోయిన యెడల నామాటలు నీకు నచ్చలేదు కాఁబోలు! పోనీ! నీయభిప్రాయ మేమి?

సర—జగన్మిథ్యాత్వమును గూర్చి, జన్మరాహిత్యమునుగూర్చియు మన మేమి చెప్పఁగలము? మొన్నటిదాఁక నెదుటఁ బడి మన కెన్నో భ్రమలు కలిగించినవ్యక్తి యాఁడుదియో మగవాఁడో మనము కనిపట్టఁ జాలకపోయితిమే! మనకథ చిక్కుముడి విప్పుకొనినయెడల నంతే చాలును. ప్రపంచపుఁజిక్కుమాట తరువాతఁ జూడవచ్చును. నీవు మంచివాఁడవు. నేను మంచిదానను. కావున సరిపోయినది. కాని కాళీపురమున రాత్రి నీ వెవతెనో చూచి మాటలాడితి వని యపుడు దిరుగ నీమొగముఁ జూతునా? కాని యిఁక నాలస్యము చేయకుండ మాతండ్రిగారిని జూడవలయును. నీవు నాతో రావలయును.

కళా—మామగారు రవళ్యవందనీయులు గదా ?

సర—నే నీపురుషవేషమును దీసి నా స్వరూపముననే మాతండ్రిగారిని జూతును. నీవుకూడ నీవేషమును దీయవలయును.

కళా—నే నిది తీయను- క్షమింపుము.

సర—ఎందుచేత ?

కళా—(స్త్రీ)వేషమున దాసిగా నిన్నుఁ గొలుతు మని నాతో నీవు కాశీపురమునఁ జెప్పియుంటివి. ఆమాట నీ కేదో కారణమున జ్ఞప్తి లేదు. ఏకారణముననైన నీ కట్టిస్ఫురణ తిరుగఁ గలుగునెడల నీవు నన్నపేక్షింతువు. కోపించి మునుపటివలెనే పాఱిపోవుదు వేమో !

సర—ఈవేషమును దీసివేయుమని నేనే నీకుఁ జెప్పుచుంటిని గాదా? ఇంకను సందేహ మేల ?

కళా—అట్లయినఁ గాశీపురమున నాతో మాటలాడినది నీవే యనియొప్పుకొనుము.

సర—అదిమాత్ర మసత్యము.

కళా—అట్లయిన నాకక్కడఁ జెప్పినవా రెవరో తీయుమని చెప్పువఱకును నేను దీయను. క్షమింపుము.

సర—పోనీ ! నీయిష్టము. మాతండ్రిగారియొద్దకుఁ దవ్వరగఁ బోవుదమా ?

కళా—అభ్యంతర మేమి ?

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది నవమాంకము.

శ్రీరామ.




దశమాంకము.

ప్రదేశము— రాగవర్ధనునిమందిరము.

ప్రవేశము- రాగవర్ధనుఁడు; స్త్రీవేషములతో సరస్వతి, గోవర్ధనుఁడును, కళాలలిత, కళాలలితుఁడును.

రాగ—ఇదివఱకు మీరందఱు చెప్పినమాటలేవియో నాకు నచ్చలేదు. ఆహా! ఇదియేమి?

గీ. కలయొ? మాయయొ? మఱి కను-కట్టొ? మంత్రి
సాంద్రతయొ? పిశాచకృతియొ? - యింద్రజాల
గతియొ? గాధేయసృష్టియొ? - కాక యహహా!
నావలె మతిమాలిన కవి-నాటకంబొ?

జంటపువ్వులలో భేద-సరణి కలదు
తారలందైన భేదంపు-దారి యుండు
నచ్చుబొమ్మల నైన న్యూ-త్యాస ముండు
కలదు భేదము ప్రతిబింబ-ములనుగూడ.

అమ్మా! నీవు! అమ్మా! నీవు! మీరిద్దఱే కాదా? ఆసంగతి ముందు చెప్పుఁడు. ఇదివఱ కేమి చెప్పినారో నామనస్సున నిలువలేదు.

సర—(తనలో, గోవర్ధనుని జూచి) అదియే నాచీర. అదియే నాఱవిక. నే నిచ్చిన స్త్రీవేషముననే యింక నున్నాఁడు. నాయనా! నీవిచ్చినపురుషవేషమును దీసివైచి నీయందలక్ష్యమునుజూపితిని. క్షమింపుము.

రాగ—మీరిద్దఱొకరా యిద్దఱా యని యడుగ మాటలాడరేమి?

సర—నాయనా! అట్టిప్రశ్న మడుగుదురా? మే మిద్దఱము కామా?

రాగ—సరే- అటులైన నాకూఁతు రెవరు?

సర—నాయనా! నేనే.

రాగ—(అటుచూచి యిటుచూచి యాలోచించును. సరస్వతి నుద్దేశించి) అటులైన నీవు నాచేయి గట్టిగాఁ బట్టుకొనుము. సరే- నాతల్లీ! నీవు నాకూఁతురవే! నాకు మందిచ్చి మతి కుదుటఁబఱచినది నీవేనా?

సర—నీకు మం దెవరిచ్చిరో నే నెఱుఁగను.

గో—మందిచ్చినది-నాయనగారూ! నేను.

రాగ—అటులైన మతి నిచ్చినదే సరస్వతి యగు కాని మఱియొక రెట్లగుదురు? నీవే నాకూఁతురవు. నీవు నాచేయి గట్టిగాఁ బట్టుకొనుము. తుపాకిరవ్వలలాగున నుంటచే భేదము తెలియకుండఁగా నొక్కసుతిని మేళవించిన తంబురాలవలె నొక్కనాదముతోఁ గూడఁ బలుకుచుండఁగా భేదము తెలియుటెట్లు? ఇప్పుడు మీరిద్దఱుకూడ నాచేయి పట్టుకొనియున్నారేల? ఇదిగో! నా కుడిచేయి పైనున్న కూఁతురే కాని యెడమచేతిపైనున్న కూఁతురు పట్టుకొననేల?

సర—నాయనా! నేనే సరస్వతిని. జయరామసింగును జేసికొనుమని నాసవతితల్లి పెట్టినబాధలను నేను సహింపలేక నిన్ను విడిచి

పాటిపోయిన దుర్మార్గురాలను నేనే నాయనా! గోవర్ధనునకట్టి బాధ యేమైన నున్నదేమో యడుగుము.

శాగ—అమ్మా! అది బాగుగా నున్నది. సవతియాఁడుదాని బాధ యంత శాశ్వతపుఁగోఁత ప్రపంచమున నుండదమ్మా! నీవు మంచిసాధనమే చెప్పితివి. కుడిపైపుననున్న కూఁతురు నడుగు మంటివా?

గో—నన్ను వేఱె యడుగనక్కఱలేదు. నేను దల్లి నెఱుఁగను. తండ్రి నెఱుఁగను. ఇఁక నాకు సవతితల్లిబాధ యేమున్నది? అయ్యా! ఇంతసేపు వినోదముగా నుండుటచేత నూరక వినుచున్నాను. నేను మగవాఁడను. మగవాఁడను. మగవాఁడను.

శాగ—మగవాఁడ వైనయెడలఁ గూఁతురుగా నుండఁగూడదు. కాని కొడుకుగా నుండవచ్చును గాదా? అమ్మా! సరస్వతమ్మా! ఈ రాజ్యము సగము నీది. సగ మీతనిది. మీరిద్దఱు నేలుకొనుఁడు.

సర—నాయనా! నాకు నాభర్తరాజ్యమే చాలు. నీరాజ్యమంతయు గోవర్ధనుని కిమ్ము. ఈతఁడు నాకొక్క గొప్పయాపద తప్పించినాఁడు. ఇప్పుడు నీకు మతి నిచ్చినాఁడు.

గో—నేను జేసిన జనసేవకు నేనేమియుఁ దీసికొనువాఁడను గాను. నాకు రాజ్యమక్కఱలేదు. భగవంతుని యీసర్వప్రపంచమే నా రాజ్యము. నామనస్సున నీ వృత్తాంతములోని యన్ని చిక్కులు విడిపోయినవి. ఇఁక నేను బోవుదును.

కళాలలిత—నాథా! నేనుగూడ వచ్చెదను. రాజేంద్రా! నమస్కారము.

కళాలలితుఁడు—చెల్లెలా! మన మిదివఱకు మాటలాడినట్లు కలసియే

పోవుదము. బావా! గోవర్ధనా! కొంతసేపటిలో మేముగూడ వచ్చెదము.

సర—నామానసంరక్షకుఁడవగు నో మహాత్మా! నీకు నమస్కారము.

రాగ—అమ్మా! ఆసంగతియేమి?

సర—ఈగాథ సావకాశముగాఁ జెప్పెదనులే.

గో—అమ్మా! అందఱను రక్షించువాఁడాపరాత్పరుఁడు. నీవు నన్నుఁ బ్రశంసింపవలదు.

రాగ—సరే. గోవర్ధనా! నాదొక్కప్రశ్న. దానికి సంతుష్టికరమైన యుత్తరము చెప్పి మఱిపొమ్ము. చూడు! నీవు సర్వవిధముఁల మాసరస్వతమ్మలాగున నుండుటకుఁ గారణమేమి?

గో—నేనెట్లు చెప్పఁగలను? పోవుదును.

రాగ—నే నడిగినది చెప్పకుండ నెట్లుపోవుదువు? కదలకుము. నీకు వీరియుందఱసాహాయ్య మిచ్చితిని. మీరంద ఱాలోచించి చెప్పుఁడు. నాపుస్తకమును మఱియొకఁ డచ్చువేయించుకొనుట కేమి యధికారమున్నదో కనుఁగొనకపోవుదునా?

(నేపథ్యమున) మహాప్రభూ! కల్యాణపురమునుండి యెవ్వఁడో భటుఁడు వచ్చినాఁడు.

రాగ—కల్యాణముమట్టునకు మాకిష్టమే కాని పురముమాత్రము కాదు. పొమ్మని చెప్పుము.

గో—అయ్యా! కల్యాణపురము మాయూరు. నన్నుఁ బోషించుముస లియమ్మగారియొద్దనుండి వచ్చినాఁడేమో! రానిండు.

రాగ—సరే! లోనికిఁ బంపుము.

(నేపథ్యమున) చిత్తము.

గో—(చూచి) వీరిగా! అమ్మగారు బాగుగా నున్నారా? ఇచ్చట స్త్రీలున్నారు. నీవావప్రక్కనుండుము.

భటు—(లోనుండియే) బాగుగా నున్నారు. గోవర్ధనయ్యా! నీవాఁడు వేసమున నుంటివేమి? మిగిలిన యూఁడువారు గూడ నీవంటి వారేనా యేమి? పెద్దవాఁడవైతివికదా? ఇట్టివేసములు బాగుగా నుండునా నాయనా! ఈకోటలో నీవంటివారు చేరి రాజుగారియెదుట భాగవత మాడుచున్నారా యేమి?

గో—లేదు. నిన్ను మాయమ్మ యెందులకుఁ బంపినారు?

భటు—నాకెట్లు తెలియును? ఈయుత్తరమును నీవు రామపురరాజుగారి కిమ్మని చెప్పినారు. ఆమె దగ్గుచే బాధపడుచుండుటచేత రాలేకపోయితి నని చెప్పినారు.

గో—ఆలాగే. నీవావల నుండుము. నేనీయుత్తరమును రాజుగారి కిచ్చెదను. అయ్యా! రామపురప్రభూ! మాముసలియమ్మగారు మీకీలేఖ నర్పింపుమనినారు. (ఇచ్చును.)

రాగ—ఆయుత్తర మేదో నీవే చదువుము.

గో—అయ్యా! నే నెందులకు? సరస్వతమ్మచేఁ జదివింపుడు.

రాగ—సరే.

సర—(చదువును.)

శ్రీ రామపురరాజుగారికి- నంద్యాల పార్వతమ్మ రామ్ రామ్.

గోవర్ధనుఁడను చిన్నవాఁడు నాచేఁ బండ్రెండు సంవత్సరముల నుండి పెంపఁబడుచున్నాఁడు. నేనొక క్షత్రియకాంతను. ఆతనిని బట్టుకొని మీదుర్గమున కెందులకో తీసికొనిపోయినారని వింటిని. నేను మతిలేకుండ నున్నాను. ఆతనిని రక్షింపవలెను. ఆతఁడు దొంగకాఁడు. అనాపకారి కాఁడు. ఆతనికి విద్యఁ జెప్పించితిని. ఆతనికి మీరు గాని

మీవంక నెవ్వరైనఁ గాని యేమియపకృతి చేయుదురో యని మీకు వ్రాసితిని. ఆతనిచరిత్ర మీక్రింద వ్రాసితిని.

నాకుఁ దెలియకుండ నాదాసి యీపిల్లవానిని నాలుగుసంవత్స
రములు పెంచినది. తాను మరణించుచు వీనిని నాకిచ్చి పోయినది.
దానికీపిల్లవాఁ డెట్లువచ్చె ననఁగ- వాలేశ్వరనగరమునుండి
కూఁతురు దానియింటికీ పిల్లవానితో వచ్చి యు
ఆకాలమున దాని కామె వీని నప్పఁజెప్పెను. ఆమె
వచ్చినదనఁగా- దాని పినతల్లికూఁతురు దానికిచ్చెను.
రీచిన్నవాఁడు పుట్టినప్పుడు తల్లియొద్ద నుండినది. ఆమెకుఁ
భుఁడగు మాధవవర్మ వేయివరాల నొసఁగి యీబిడ్డను
ర్థించెను. అందుల కామె యొడఁబడినట్లు నటించి చంపితినని
చ్ఛన్నముగాఁ దెచ్చి తనపెదతల్లికూఁతున కిచ్చెను. పుట్టిన
నాటినుండి యీచేతినుండి యీచేతికిఁ దిరుగులాడుచుఁ బండె
వత్సరములకిరింద నాకు లభించినాఁడు. ఆతని కిప్పుడు
ముల వయస్సు. ఆతఁడు మీయొద్ద నున్నాఁడు. ఆతనిని రక్షిం
ల దైవము మెచ్చును.

అంతర్యామునకుఁ దేవలయును.

రాగ—(లేచి తొందరతో) నాయనా! గోవర్ధనా! నీవు నాపుత్త్రుఁడ వేనా? తండ్రీ! (ఏడ్చును.)

సర—అన్నయ్యా! అన్నయ్యా! (కౌఁగిలించుకొనును.)

రాగ—ఒకకాసు మఱియొకకాసులాగున నుండుట కచ్చొక్కటియై యుండవలయును. సరే- నీవు నాకొడుకవు. అమ్మా! వీరిద్దఱెవరు?

సర—ఆమె నీకోడలు.

గో—ఈతఁడు నీయల్లుఁడు.

రాగ—అలాగా! అల్లుఁడుగారూ! మీకీయయిదువతనమేల? పురుష రూపమును ధరింపరాదా?

కళాలలితుఁడు—(అప) గోవర్ధనా! స్త్రీవేషమును ధరింపుమని నీవే కాదా నాతోఁ జెప్పితివి?

గో—(అప) క్షమింపుము. నేనే.

కళాలలితుఁడు—(లోనికిఁ బోవును.)

రాగ—నాయనా! గోవర్ధనా! అమ్మా! సరస్వతీ! మీరిద్దఱు నన్ను గాఢముగాఁ గౌఁగిలింపుఁడు.

గో-స—(అట్లు చేయుదురు.)

రాగ—సరస్వతమ్మా! నీమగఁడు మంచివాఁడేనా?

సర—ఆ.

(కళాలలితుఁడు ప్రవేశించును.)

రాగ—నాయనా! గోవర్ధనా! నీవు స్త్రీవేషమును దీసి రమ్ము.

(గోవర్ధనుఁడు నిష్క్రమించును.)

కళాలలితుఁడు—మామగారూ! నమస్కారము.

రాగ—దీర్ఘాయుష్యమస్తు. (గోవర్ధనుఁడు ప్రవేశించును.)

గో—నాయనగారూ! నమస్కారము.

రాగ—నాయనా! దీర్ఘాయుష్యమస్తు. నీవు నీభార్యయు దగ్గఱగానుండుఁడు. అమ్మా! నీవు నీభర్తయు దగ్గఱగా నుండుఁడు. (వారట్లు చేయుదురు.) వేదాల కన్నింటికి సారమైనమాట యొక్కటి యున్నది. పిల్లలను పోఁగొట్టుకొనఁదలచినవాఁడు దక్క మఱెవ్వరు రెండవపెండ్లి చేసికొనఁగూడదు. అలాగున మానాయన

తన రాష్ట్రపరిపాలనములో నుత్తరువు లీయవలసి యున్నది. అమ్మా! నీ రాజ్యములోఁ గూడ నీభర్త యట్టియుత్తరువులీయవలసియున్నది.

సర—అట్టియుత్తరువులు మేమెప్పుడో యిచ్చుట కేమికాని, యింత ద్రోహ మొనర్చిన మీపినతండ్రికొడుకును గూర్చి మీరిప్పు డేమియుత్తరువు లిచ్చెదరు?

రాగ—పోయిన వస్తువులు దొరకిన మహాసంతోషములో, దొంగవానిమాట మనస్సునుండి జారిపోయినది సుమా! అతనిని దప్పక శిక్షింపవలయుననియే మీయభిప్రాయమా?

కళాలలితుఁడు—బద్ధుఁడై నాకతఁ డధీనుఁడై యున్నాఁడు.

రాగ—పినతండ్రికొడుకనఁగఁ దమ్ముఁడన్నమాటయేనా? మాతండ్రియు నతనితండ్రియు నన్నదమ్ములు. తమ్మునిఁ జంపుట మంచిదైన యెడల మాతండ్రి యతనితండ్రినే చంపియుండును. నాపిల్లలు నాకింటఁ బడినారు. పూర్వమే పాపము చేయుటచేతనో నాకన్నిబాధలు కలిగినవి. మన మెన్వరియుసురు నింకఁ బోసికొనవలదు. రాముఁడు లక్ష్మణమూర్ఛను సంతోషించినట్లు వాల్మీకి వ్రాయలేదు. ఇంతకును బెద్దలొకకమైనమాట. అతనిని జంపినయెడల మన కాశౌచము.

సర—అతనిని జంపనేయక్కఱలేదు. దోషము చేసినవారి కొకశిక్ష యొనర్చినఁ గాని లోకమునకు ఘోరముగా నుండును. మాసోదరుని కాతఁడు చేసినయపకార మింతని చెప్పవచ్చునా?

రాగ—నిజమే. ఏతప్పయిన క్షమింపవచ్చును గాని నోరెఱుఁగనిపిల్లలయెడలఁ జేసినదోషము మాత్రము సాధారణముగా క్షమింపఁదగదు. కావున మాసోదరుని కటు పిలిపింపుము.

కళాలలితుఁడు—నేను బోయి తీసికొనివచ్చెదను. (పోవును.)

రాగ—అమ్మా! నాయనా! ఇదివఱకు మీరిద్దఱు నన్నొకసారి కౌఁగిలించినారు. తనివి యొంతమాత్రమును దీఱలేదు. మఱియొక్కసారి కౌఁగిలించుకొనుఁడు. (వారట్లు చేయుదురు.) బిడ్డలారా! ఈసమయమున మీతల్లియే యిట నుండినయెడల నెంతసంతోషించునో! నాకిప్పుడు మతి కుదుటఁబడినట్లున్నది. అన్నిసంతోషములు సమకూరినవి. మీతల్లి యిచ్చట లేకపోవుటయే గొప్పలోపము.

(నేపథ్యమున) ఔను. గొప్పలోపమే యొనర్చినాను. నన్ను క్షమించునెడల నింతకంటె మహానందమును గలుగఁజేయుదు నని చెప్పుము. (మఱియొకధ్వనితో) నీవే చెప్పుము.

రాగ—మాధవవర్మ వచ్చుచున్నాఁడు.

(మాధవవర్మ కళాలలితుఁడు ప్రవేశింతురు.)

మాధ—అన్నగారూ! నమస్కారము.

రాగ—సోదరుఁడా! నీవు నాయందు మహాభక్తిగలవాఁడవు. నీవది నెను నన్నుఁ దల్లిదండ్రులఁగాఁ జూచుకొనుచుంటివని నీయింటికి నాభార్యను బురిటికిఁ బంపియుండ నీవు నాకొదుకున కింతహాని యొనర్చుట తగునా?

మాధ—నేను నేరమే చేసితిని. క్షమింపుము. అయినను దుదకది మహానందదాయకముగాఁ బరిణమించినదికదా!

రాగ—మాకు మహానందము కలిగినమాట నిజమే. క్షమింపలసినదే. కాని—

మాధ—ఇంతకంటెను మహానందమును గలుగఁజేయుదును. క్షమింతురా?

రాఘ—సందేహమా? క్షమింతును.

మాధ—మీరు సెలవిచ్చినట్లు నేను దల్లిగఁ జూచుకొనుచున్న మావదినెగారు సుఖముగా నున్నారు.

రాఘ—ఆహా! ఆహా! (అందఱు సంతోషింతురు.)

రాఘ—తమ్ముఁడా! ఎంతశుభవార్త చెప్పితివి! ఆమె బ్రతికియే యున్నదా?

మాధ—ఆ. ఆమె మృతిఁ జెందెనని యసత్యవార్త కల్పించి లోకమును నమ్మఁజేసి యామెను ౧౮ సంవత్సరములు పాతాళగుహలో దాసీమాత్రసహాయగా దాఁచితని. ఈనడుమను గలిగిన భూకంపముచే గుహాద్వారము పడిపోయినది. ఆమెయు దాసియు గుహనుండి తప్పించుకొని పాఱిపోయిరని నాపరిధానుఁడు వ్రాసినాఁడు.

రాఘ—ఎప్పుడు? ఎప్పుడు? వారింక నిటకు రాలేదేమి? వారిక్కడకు వత్తురా?

అంద—ఓ-ఓ- రాకపోవుటకూడనా?

(నేపథ్యమున) ఓ-ఓ- (యనుసవారిమూలుగు వినఁబడును.)

(నేపథ్యమున మఱియొక ధ్వనితో.) సవారి ఆపు.

(కమలయు, దాసియుఁ బ్రవేశింతురు.)

రాఘ—ప్రాణప్రియా! ప్రాణప్రియా! (ఎదురుగఁ బోవును.)

కమల—ప్రాణకాంతా! నమస్కారము. (కాళులపైఁబడి మూర్ఛపడును.)

సర—అమ్మా! అమ్మా! మాటలాడవేమి?

గోన—అమ్మా! అమ్మా!

(ఇద్దఱు నామెను లేవఁదీసి కౌఁగిలించుకొందురు.)

రాగ—పాణిప్రియా! పరీక్ష నొందితివా? కన్నులు తెఱచితివా?
వీరే నీపుకన్న కవలు.

కమ—ఆ! ఆ! ఏరీ? ఏరీ?

సర-గోవ—అమ్మా! అమ్మా! మేమే.

కమ—(బిడ్డలను కౌఁగిలించుకొని) అమ్మా! నాయనా! ఇంతవారైతి
రా? మీముచ్చట లేమియు నేను జూచుకొనలేదు కదా?

సర—అమ్మా! మాయిద్దఱిలో నెవరు ముందు పుట్టిరి?

కమ—అమ్మా! నీవే ముందుఁ బుట్టితివి.

సర—అటులైన గోవర్ధనుఁడు నాకుఁ దమ్ముఁడా!

రాగ—కాదమ్మా! కవలలోఁ గడపటఁ బుట్టినవాఁడు పెద్దవాఁడు.
కావున మానాయనయే నీకంటెఁ బెద్ద. పాణిప్రియా! ముచ్చ
టలేవియుఁ జూడలేదని నీవు చింతింపవలదు. ఇక్కడనుండి
కావలసినన్ని ముచ్చటలు. ఇప్పుడే మన పెదనాయనపుట్టినదిన
పు బండుగఁ జేసికొందము.

కమల—అంతకంటెఁ గావలసిన దేది?

రాగ—అదిగో! నీయల్లుఁడు. అదిగో! నీకోడలు.

కళాలలితుఁడు-కళాలలిత—అత్తగారూ! నమస్కారము.

కమ—కల్యాణమస్తు.

రాగ—"కల్యాణమస్తు" అని యొక్కసారి యనుటకాదు. రెండు
సారు లనవలయును. జరుగవలసిన కల్యాణములు రెండున్నవి.

సర—రెండేకాదు, నాలుగు. భ్రమరునకు మధురికకు నొకటి.

రాగ—వారేరీ?

సర—కోటవెలుపల నున్నారు. వారిని బిలిపింతును. జయరామసింగు
నకుఁ గురంగికి రెండు.

